'హాసం'

హాస్య-సంగీత పత్రిక

Also available on net - www.haasam.com

# ఇవీ సంగతులు

## హాస్యం - సంగీతం



కర్టెసీ:

75వ పేజీలో ఎ.ఎన్.ఆర్. తైలవర్ణ చిత్రం - విజయచిత్ర ప్రత్యేక సంచిక కోసం ప్రఖ్యాత చిత్రకారుడు టి.వి.రత్నం ప్రత్యేకంగా చిత్రించినది. టి.వి.రత్నంగారికి విజయచిత్రకు కృతజ్ఞతలతో ... హాసం





'సెంటర్‌స్ప్రెడ్'లో

సినీ సంగీత ప్రియులకు ప్రత్యేక కానుకగా

'ఒకటో నెంబర్ కుర్రాడు'

'ప్రేమలో పావని కళ్యాణ్'

సినిమా పాటల పుస్తకాలు కలర్‌లో

అనుబంధంగా జి.కె.వెంకటేష్, లతా మంగేష్కర్, నూర్జహాన్, హేమంత్‌కుమార్ సినీ గీతాలు 30, 22, 28, 52 పేజీలలో

ముఖచిత్రం: అంకిత




మీ "హాసం" హాస్యాన్ని పంచి నవ్విస్తూ, సంగీత సరిగమల స్వరాల మధురిమలో సర్వాన్ని మరిచి పోయేలా చేస్తోంది.

ఈ పత్రిక పెద్దలను చిన్నవాళ్ళను కూడా బాగా ఆకర్షిస్తుంది అనుటలో అతిశయోక్తి లేదు. పెద్దలు చదివి తమ చిన్ననాటి ఇష్టమైన సినిమా పాటలను మననం చేసుకుని గతాన్ని తరచుకుని ఆనందిస్తే చిన్న వయసు వారు "హ్యూమర్ బాక్స్" "చిలిపిలిపి"తో బాటు కొత్త సినిమా పాటల్ని చదివి ఈ పత్రిక తిరిగి ఎప్పుడు వస్తుందా అని ఆత్రంగా ఎదురు చూస్తున్నారు. ఈ వయసులో నీకు సినిమా పత్రికలు ఎందుకు? పురాణాలు చదవక? అనే వాళ్ళే ఇప్పుడు పత్రిక రాగానే నా చేతికి అంద కుండా ముందు వాళ్ళు చదివాక నాకు ఇస్తున్నారు. అందరినీ అలరిస్తున్న ఈ పత్రిక శత సహస్ర జయంతులు జరుపుకోవాలని మరీ మరీ కోరు కుంటున్నాను. ఇంతమంచి పత్రికను అందించి ఆనందింప చేస్తున్న పబ్లిషర్లకు, సంపాదకులకు, స్టాఫ్‌కు నా శుభాకాంక్షలు తెలియజేస్తున్నాను.

-చింతపెంట కమల, బెంగుళూరు

రాజీ ఏ మాత్రం పడకుండా రోజాపుష్పాల వంటి అతి సుందరమైన హాస్య సంగీత పుష్పాలను అందిస్తున్న మీకు, 'హాసం'కుహార్దికమైన శుభా శీస్సులు. జనార్దన మహర్షి గారి బిన్‌లాడెన్ - పెండ్లాడెన్ ఓ బృహత్ బహూకరణ. ఐతే, భువన చంద్రగారి హృదయం ఎంత చల్లనిదో, 'చంద్రు'నిలో చూసాం. చిత్రకారులను ప్రోత్స హిస్తున్నట్లే గేయ రచయితలు (కొత్తవారిని) మీరు ప్రోత్సహించే ఓ శీర్షికను పాఠక లోకానికి అందిస్తే బావుంటుంది కదా.

-శ్రీమాన్ కాశ్యప్, సింహాచలం

మీ పత్రిక కారణంగా నాకు ఒక పేషంట్ నుంచీ అభిమానమూ, మరొక పేషెంట్ నుంచీ అసహనమూ ఎదురయ్యాయి. ఎలాగంటే...

నా క్లినిక్‌లో వెయిటింగ్ హాల్లో వివిధ రకాలైన పత్రికలను ఉంచడం నాకలవాటు. 'హాసం' కూడా వాటిల్లో ఒకటి. మొన్న వచ్చిన పేషంట్లలో క్రమశిక్షణతో మెలిగే బ్యాంక్ మేనేజర్ ఒకరు. ముందుగా అపాయింట్‌మెంట్ తీసుకొని సరిగ్గా, తనకు ఎలాట్ చేసిన టైమ్‌కే క్లినిక్‌కి వచ్చాడు కానీ నన్ను కలవకుండా వెయిటింగ్ హాల్లోనే ఉండి పోయి క్యూలో తన తరువాతి ముగ్గురిని పంపిన తరువాత గానీ లోపలికి రాలేదు. విషయమేమిటనీ అడిగితే అక్కడున్న 'హాసం' పత్రిక చదువుతూ కదల్లేకపోయానన్నాడు. నా రూంలోకి వస్తూ కూడా తనతో పాటు పవన్‌కల్యాణ్ ముఖచిత్రం సంచికను పట్టుకొచ్చాడు. అతను వెళ్లిపోయిన తర్వాత, నా టేబుల్‌పైన వదిలి వెళ్లిన 'హాసం' పత్రికను క్యాజువల్‌గా తెరిచాను. (నాకు 'హాసం'ను ఆమూలాగ్రం చదవాలని అనిపించినా, సమయాభావం వల్ల చదవలేకపోతూంటాను). పత్రికను తెరవడంలోనే రాజాగారు రాసిన కథ 'బాబోయ్... ఇదే బావుంది' కనిపించింది. యథాలాపంగా రెండులైన్లు చదివి పూర్తి కథంతా చదవకుండా ఉండలేక పోయాను. బయట పేషంట్లను మర్చిపోయి వారిని అసహనానికి గురిచేసేటంతగా నన్నాపత్రిక ఆకట్టుకొంది.

'హాసం' వల్ల బ్యాంక్ మేనేజర్ తనకిచ్చిన అపాయింట్‌మెంట్‌ను వెనకపెట్టేటంత సహనాన్ని పెంచితే, నేను 'హాసం'ను చదువుతూ బయట వెయిట్ చేస్తున్న పేషెంట్ల అసహనాన్ని పెంచాను. ఆ విధంగా... హాసం ఒకరి సహనానికి, మరొకరి అసహనానికి కారణమయ్యింది. బ్రతుకు శాపం కావచ్చు. కానీ, నవ్వు వరం! అది 'హాసం' ద్వారా సాధ్యం.

-డా॥ చిరుమామిళ్ల మురళీమనోహర్,
యం.డి. (ఆయుర్వేద),
హైదరాబాద్

మీ (మా) పత్రిక ప్రారంభ సంచిక నుండీ క్రమం తప్పకుండా చదువుతున్న పాఠకుణ్ణి. అన్ని రకాల పాఠకులను సమానంగా 'తృప్తి' పరుస్తోన్న 'హాసం' నిస్సందేహంగా ఓ చక్కని పత్రిక. పాఠకుల 'మనసెరిగి' ముందుకు పరుగులెత్తు తోంది. 'ఫలానా' వారి గురించి రాయండీ! అన్న అభ్యర్థనకు ఆస్కారం లేకుండా మరీ రాస్తున్నారు! నేనీ మధ్య 'పద్మనాభం' గురించిన వ్యాసం ఎప్పుడొస్తుందో అనుకున్నాను. 16-31 ఆగష్టు సంచికలో ఆ వ్యాసం ప్రత్యక్షం! నా ఆనందానికి 'అవధి' లేకుండా పోయింది.

-బి.శ్రీనివాసాచారి, హైదరాబాద్

ఘంటసాల సావిత్రి గారు వ్రాస్తున్న "మా మావయ్య కథ" చాలా బావుంది. ఈ ఆర్టికల్ మీ 'హాసం' పత్రిక వున్నన్నాళ్ళు ప్రచురించినా తృప్తిలేదు. ఒక వేళ, ఆ శీర్షిక ముగించవలసి వస్తే ఘంటసాల గారి సహకాల సంగీత దర్శకులు, గాయకులు, గాయనీమణులు, దర్శకులు, నటులు, మరియు ఈ తరం వారి అభిప్రాయా లను, అనుభవాలను సేకరించి ప్రచురిస్తే చాలా బాగుంటుంది. ఎందుకంటే ఘంటసాల గారి గురించి రాయడమంటే ఒక గ్రంథం లాంటిది. కాబట్టి, ఘంటసాల సావిత్రిగారికి మీరు ఈ విషయం తెలిపి ఆయన జీవితంలోని అనేక సంఘటనలను, వివరంగా వ్రాయమని చెప్ప వలసిందిగా నా మనవి. సాధారణంగా నాకు పత్రి కలు, వారపత్రికలు, నవలలు చదివే అలవాటు లేదు. మీ 'హాసం' పత్రిక ఒకసారి చదివాక, ప్రతి సంచికకోసం ఎదురు చూడడం జరుగుతున్నది.

-ఆర్.మధుసూదనరావు, ఎర్రగుంట్ల,

ఇప్పుడొస్తున్న పత్రికలలో నేను రెగ్యులర్‌గా కొని, చదివి భద్రపరచుకొనేది 'హాసం' ఒక్కటే. ఆ పాట/పాత మధురం శీర్షిక పత్రికకే హైలెట్. ఈ ఫీచర్‌లో మిస్సమ్మ, రోజులు మారాయి, అనార్కలి చిత్రగీతాల విశ్లేషణ సూపర్బ్! వెంట వెంటనే ఈ చిత్రాల ఆడియో క్యాసెట్లు నాచేత కొనేలా చేసింది శీర్షిక. 'అర్థం చేసుకుందాం - ఆస్వాదిద్దాం'లో పాత హిందీ పాట(ల)నే వేస్తే బాగుంటుంది. శ్రీమతి ఘంటసాల సావిత్రిగారి సీరియల్ ఆసక్తికరంగా వుంటోంది. నెలకి రెండు సార్లు మమ్మల్ని స్వర సంచారంలోకి తీసికెళుతూ స్వర్ణయుగంలోని సంగీత మాధుర్యాన్ని, విశేషాన్ని అందిస్తున్నందుకు హేట్సాఫ్ టు 'హాసం'!

-జి.ఎల్.ఎన్.స్వామి, విజయనగరం

'హా'యిని, ఎనలేని 'సం'తోషాన్ని కలగలిపి సంగీత, సాహిత్య ప్రియులకు అందజేస్తున్న 'హాస్య 'సం'గీత పక్ష పత్రిక పాఠకులమైనందుకు మాకెంతో గర్వంగా ఉంది. నా వద్ద ఇంత సంపద ఉంది అని చెప్పుకోవటం కంటె నా వద్ద ఇన్ని 'హాసం' పత్రికలున్నాయని చెప్పుకోవటంలోనే మాకు ఆనందం ఉంది.

-మారురి పుల్లారెడ్డి, సత్తెనపల్లి





సంపుటి :1 సంచిక: 24

16- 30 సెప్టెంబరు 2002

పేజీలు: 68 + 8

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200


The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక 24


మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ


ఇది 24వ సంచిక. అంటే తొలి సంవత్సరంలో ఆఖరి సంచిక. పఠనాసక్తి తరిగిపోయిన ఈ రోజుల్లో చక్కటి అభిరుచితో వెలువడే పత్రికలు బతికి బట్టకట్టవు అనే నమ్మకం ఎల్లెడలా వ్యాపించి వున్న వాతావరణంలో "హాసం" నిలదొక్కుకోవడమే కాదు, ఎదుగుతోంది కూడా అని గుర్తు చేసుకోవలసిన తరుణం. ఏడాది ప్రస్థానంలో విజయాలను, వైఫల్యాలను, సమీక్షించుకోవలసిన సమయం.

హాస్యం, సంగీతం అనే సబ్జక్ట్‌లు కలిపి పత్రిక తేవడం అనే ఆలోచన చాలమందిని ఆకట్టుకుంది. కానీ కేవలం ఈ రెండు విషయాలతోనూ పత్రికను ఎక్కువకాలం నడపడం కష్టం అనే అపోహ 'హాసం' రెండు, మూడు సంచికలు చూడగానే తొలిగిపోయింది. అన్నిరకాల వయస్సుల వారినీ, అన్ని అభిరుచులవారినీ దృష్టిలో పెట్టుకుని రూపొందిస్తున్నా, ముఖ్యంగా మధ్య వయస్సు, ఆ పై వయస్సు చేరినవారు, హౌస్‌వైఫ్‌లు, పత్రికను తమ స్వంత పత్రికగా భావిస్తున్నారు. దీనికి కారణం 35 ఏళ్లు పైబడ్డవారు పత్రికలు, టీవీ ఛానెల్స్ తమ అభిరుచులను పట్టించుకోవడం లేదని ఫీలవుతున్న సమయలో "హాసం" రంగంపైకి వచ్చింది. పత్రికలు పట్టుకోవడం మానేసి చాలాకాలమైన వారు మళ్లీ పుస్తకాన్ని చేతపట్టి చూస్తున్నారు. ఒకటి, పదహారు తారీకులకై ఎదురుచూస్తున్నారు. పత్రికను ఇంటికి ధైర్యంగా పట్టుకెళ్లడమే కాదు, దీనిలో విషయాలను ఇంట్లో అందరూ కలిసి చర్చించడమే కాదు.దూరంగా ఉన్న కుటుంబసభ్యులపేర చందాలు కట్టి పంపిస్తున్నారు. 'అశ్లీలత లేకపోవడం ఒక్కటే అర్హత కాదు. ఎన్నో గంభీరమైన విషయాలను ఆకర్షణీయంగా అందిస్తున్నారు. "హెల్తీ కమ్మర్షియల్" ఇమేజ్ తెచ్చుకున్నారు. అదీ ఈ పత్రికలో ఉన్న గ్లామర్!" అంటున్నారు విమర్శకులు.

రచయితల విషయానికొస్తే ప్రసిద్ధ రచయితలకు "హాసం" వేదికగా మారింది. 'హాసం' పాఠకుల పరిణతి చూసి ముచ్చటపడి ఛాలెంజ్‌గా తీసుకుని రాయడంతో బాటు మేధావుల మధ్యనే తమ రచన తిరుగాడకుండా ప్రజల మధ్యకు వెళ్లడం వాళ్లను ఆకట్టుకుంది. పత్రిక అన్నాక ప్రశంసలే కాదు, విమర్శలు కూడా రాక తప్పదు. "హాసం" ఎదుర్కొంటున్న ప్రధాన... కాదు, కాదు..ఏకైక విమర్శ - కవర్‌పేజీలపై వేస్తున్న సినిమా తారల ఫొటోల గురించి, అదీ అతి కొద్దిమంది పాత సినిమాల అభిమానుల నుండి మాత్రమే! మార్కెట్ అవసరాల గురించి అవగాహన ఉండే అవకాశం వారికి లేదు. ఉంటే ఖర్చుకు వెరవకుండా మేము పత్రిక ముఖపత్రాన్ని రోజురోజుకూ ఆకర్షణీయంగా ఎందుకు తీర్చిదిద్దుతున్నామో గ్రహించి వుండేవారు.

మేం సంపూర్ణంగా విజయం సాధించినట్లేనా? మేము అలా అనుకోవటం లేదు. పత్రిక ప్రారంభించి ఏడాది అయిన దాని ఉనికి గురించి తెలియని పాఠకులు లక్షల సంఖ్యలో ఉన్నారు. ఇటువంటి పత్రిక ఇదే ప్రథమం కావడంతో దీని స్వరూపస్వభావాలను అర్థం చేసుకోలనివారు, ఒక సంచిక మాత్రమే చూసినవారు వీళ్లు ప్రతీ సంచికా ఇంత అందంగా తీర్చిదిద్దుతున్నారా అని సందేహించినవారు, పత్రిక ఎక్కడ లభ్యమవుతుందో తెలియనివారు ఉన్నారు. ఈ అభిరుచి ఉన్న వాళ్లందరికీ "హాసం" పరిచయం అయినప్పుడు మా కృషి ఫలించినట్టు అనుకుంటాం. ఆ కృషిలో పాలు పంచుకొనవలసిన వారు "హాసం" అభిమానులే! ఈసారి బంధుమిత్రులు ఎదురయినప్పుడు కుశల ప్రశ్నలు వేయడం జరిగాక "హాసం" అనే పత్రిక వస్తోంది, చూశావా?" అని అడిగిచూడండి.



ఇదే "హాసం"కు మీరు ఇచ్చే తొలి జన్మదిన కానుక!


HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82

కామిడీ స్కిట్

# సారీ... మేమిద్దరం ఇష్టపడ్డాం

గురువు కళ్ళు మూసుకుని తపస్సు చేసుకుంటూ ఉంటాడు.

-రాజా

శి : చేతిలో గరిటెతో శిష్యుడు ప్రవేశిస్తాడు.
గురువుగారూ! గురువుగారూ! (ధ్యానంలో ఉండడం చూసి వెనక్కి వెళ్ళిపోబోతూ) ఓహ్.... క్షమించండి గురుదేవా....

గు : ఫరవాలేదు నాయనా ... రా...

శి : మీరు ధ్యానంలో ఉన్నారని తెలీక...

గు : లేదు నాయనా... మేం ధ్యానంలో లేం.

శి : మరి?

గు : పరధ్యానంలో ఉన్నాం.

శి : (ఆశ్చర్యంగా) అదేమిటి గురుదేవా?

గు : ఈ రోజు మాకేవో అపశకునములు గోచరించుచున్నవి. మా మనసు వికలమగుచున్నది. పూజ అంతయు అస్తవ్యస్తముగా సాగినది.

శి : అందుకే గురుదేవా నేనో నిర్ణయానికి వచ్చితిని.

గు : ఏమది?

శి : నా మదే గురుదేవా! నా మదే... నాకా సలహా ఇచ్చింది... పెళ్ళి చేసుకోమంటోంది.

గు : తప్పు నాయనా.... మగవాడిలో గల మహిమాన్విత శక్తులను క్షణంలో మట్టి కరిపించగల శక్తి ఒక్క మహిళకే ఉంది. అందుచేత ఆడవారికి, ఆ ఆలోచనలకు ఆమడ దూరంలో ఉండటం ఎంతైనా మంచిది నాయనా.

శి : లేదు గురుదేవా... నేను పెళ్ళి చేసుకుని నా భార్యతో సహా మీ సేవలు చేసుకుని తరిస్తాను.

గు : పిచ్చివాడా... పెళ్ళి చేసుకుంటే నీ సమయం అంతా నీ భార్య సేవలకే సరిపోతుంది. అప్పుడు నీవు తరించవు నాయనా... అంతరిస్తావు.

శి : కాదు గురుదేవా... నేను పెళ్ళి చేసుకుంటే మనిద్దరికీ చెయ్యి కాల్చుకునే బాధ తప్పుతుంది.

గు : కానీ బ్రతుకు కాలిపోతుంది నాయనా... మగనికి వంట చేయుట వచ్చునని తెలిసిన ఏ మగువా వంటింటిలోనికి అడుగు పెట్టదురా!

శి : ఏమిటి గురుదేవా... మీరు మరీనూ...

గు : అవును నాయనా... వివాహము అయిన నాటి నుంచి శ్రీవారి మతి పోగొట్టును కనుక పెండ్లిఅయిన ఆడుదానిని 'శ్రీమతి'అని అందురు.

శి : మీ నిర్వచనములు ఎందుకో నమ్మ బుద్ధియగుట లేదు గురుదేవా! పూజకొద్దీ పురుషుడు, దానం కొద్దీ బిడ్డలు అన్నారు పెద్దలు. కానీ ఖర్మ కొద్దీ పెళ్ళాం అని ఎవ్వరూ అనలేదు కదా... అందుచేత నాకు అనుమతీయండి గురుదేవా.

గు : పిచ్చివాడా

శి : మళ్ళీనా గురుదేవా?

శి : అవునురా... పెళ్ళిమాట ఎత్తినప్పుడల్లా నీవు పిచ్చివాని వలెనే నాకు కనిపించెదవు. ఈ ఆడువారు పేరుకు మాత్రమే ఆడువారు. వారు మన కిష్టమైన రీతిలో ఆడువారు కాదు; మనలను ఆడించువారు.

శి : ప్రేమించినా అంతేనా గురుదేవా?

గు : శిష్యా .... ప్రేరేపించి మత్తులో పడవేయటం జరుగును కనుక ఆ చర్యను 'ప్రే-మ' అని అన్నారు. అంతియే గాని ప్రేమ అనునది ఏదీ ప్రత్యేకముగా లేదు నాయనా... పైగా....వెంటపడిన వారిని ఆడువారు వెకిలి చేయుదురు.

శి : ఛా... నిజమా గురుదేవా
కానీ నాకు పెళ్ళి వేస్తోంది... గురుగారూ.

గు : పెళ్ళి వేయటమా... ఏమది?

శి : అదే గురూగారు.... కడుపుకి ఆకలి వేసినట్టు ఒంటికి చలేసినట్టు మనసుకి పెళ్ళివేస్తోంది గురుగారూ.

గు : మరి బ్రహ్మచర్యము నేమి చేతువురా?

శి : సరస్వతీదేవిని ఆ బ్రహ్మ పెండ్లి చేసికొనినట్టు ఆ బ్రహ్మచర్యనే పాటించి ఈ బ్రహ్మచర్యమునకు నీళ్ళు వదిలెద

గు : హు.... ఎవరి ఖర్మము నెవరు తప్పింపగలరు? మొదట నువ్వు నీ దుస్తులను మార్చుకొని రా నాయనా... వివాహేచ్ఛ జనించిన తరువాత కాషాయము ధరించరాదు.

శి :ఇదొక్కటి నమ్మబుద్దేస్తోంది. గురూగారూ... అందుకే పొద్దున్నుంచి ఈ కాషాయం కషాయంలా ఉంటోంది నాకు.
(దుస్తులు మార్చుకొని వచ్చి)

శి :ఇప్పుడు చెప్పండి గురూజీ...

గు :ఇంతకూ నీవు వివాహమాడదలచిన ఆ కన్య ఎవ్వరై ఉండనోపు?

శి :గురూజీ... ఒక్క చిన్న రిక్వెస్ట్... అండ్ డొంట్... మీరీ సన్యాసాశ్రమం స్వీకరించకముందు ఇదే భాష మాట్లాడేవారా.

గు :లేదు నాయనా... అందరి వలెనే మాట్లాడెడివాడను. ఆంగ్లము అభ్యసించితిని.

శి :మరైతే ఇంకేం గురూజీ... దయచేసి మామూలుగానే



మాట్లాడండి.

గు : ఈ వస్త్రధారణలో మామూలు భాష మాట్లాడిన ఎబ్బెట్టుగా ఉండును నాయనా.

శి : మరి బెట్టు చెయ్యకండి గురూజీ... నాకు మీ భాష ఆ కాషాయం గెటప్పులో ఉంటే కొంతైనా అర్థం అయ్యేది. రైల్వేస్టేషన్‌లో అనౌన్స్‌మెంట్‌లా బొత్తిగా అర్థమై చావట్లేదిప్పుడు.

గు : సరే... అలాగే కానీ... ఇప్పుడేం చేద్దాం అనుకుంటున్నావు?

శి : ఎలాగైనా నా లవర్‌కి నేను ప్రేమిస్తున్న సంగతి తెలియ చెయ్యాలి... దానికో ఉపాయం చెప్పండి గురూజీ...

గు : నేరుగా చెప్పెయ్.... దానికింత సంకోచం ఎందుకూ.

శి : దవడ పగుల్తుందేమోనని భయం... అంచేత ఏదైనా ట్రిక్కు చెప్తే....

గు : అంటే...

శి : నాకా అమ్మాయితో అస్సలు పరిచయం లేదు గురూజీ... పరిచయం ఉంటేనే కదా నేనడిగిన ప్రశ్నలకు ఆ అమ్మాయి సమాధానం ఇస్తుంది. అందుకే ఓ లవ్‌లెటర్ ఇద్దామనుకుంటున్నాం.

గు : ప్రేమలేఖా... సరే అలాగే కానీ...

శి : అలాగే కానిద్దును కానీ నాకు ప్రేమలేఖ రాయటంలో ఎక్స్‌పీరియన్సు బొత్తిగా నిల్లు గురూజీ... చిన్నప్పుడిలాగే ఓసారి రాసి...

గు : ఏంటీ... చిన్నప్పుడే ప్రేమలేఖ రాశావా...? వార్నీ.... ఈ లెక్కన నువ్వు పుట్టగానే పురుడు పోసిన నర్సుకే కన్నుకొట్టి ఉంటావ్ అవునా....

శి : అబ్బే.... అంతగొప్పవాణ్ణి కాదు గురూజీ.... అయామ్ ఎ ఫెయిల్యూర్... అంచేత ఇప్పటికీ ఇప్పటికీ ప్రేమలేఖ రాయాలంటే హైదరాబాద్ రోడ్డు మీద నడిచినంత భయం నాకు.

గు : మరేం చేస్తానంటావ్?

శి : నేనేం చెయ్యలేను గురూజీ.... ఆ పుణ్యం ఏదో మీరే కట్టుకోవాలి.

గు : అంటే?

శి : ఆ ప్రేమలేఖేదో మీరే రాసి...

గు : నేనా... శిష్యా... నన్ను మరీ మైలపరుస్తున్నావురా.

శి : తప్పులేదు గురూజీ... మీరేగా చెప్పేరు... 'భావన మనసుకి అంటనప్పుడు మైలపడినట్టు కాదు' అని. అంచేత మీరే రాసి నన్నో ఇంటి వాణ్ణి చెయ్యండి... ప్లీజ్... ఇన్నాళ్ళు మీకు సేవలు చేసేనే... నా గురించి ఆ మాత్రం చెయ్యలేరా గురూజీ...

గు : హుం విధి విలాసం... ఎలా ఉంటే అలాగే జరుగుతుంది.

గు : (రాసిన లెటర్ ఇస్తూ) ఊ... తీసుకో... వెళ్ళి ఇచ్చిరా.... శీఘ్రమేవ కళ్యాణ ప్రాప్తిరస్తు.

శి : గురూజీ...

గు : మళ్ళీ ఏమైంది?

శి : మా కుటుంబంలో ప్రేమలేఖలు రాసినా తీసుకెళ్ళి ఇచ్చినా ఇప్పటి దాకా అచ్చిరాలేదుట.

గు : ఆశ్చర్యంగా ఉందే.

శి : నిజం గురూజీ... మా చిన్నాన్న చెప్పేడు....

గు : అందుకని....

శి : ఈ లెటర్ కూడా మీరే వెళ్ళి ఇచ్చి వస్తే...

గు : నేనా... శిష్యా.... ఏం మాట్లాడుతున్నావో తెలుస్తోందా నీకు?

శి : తెలుసుగురూజీ.... మీరైతే పెద్దవారు కనుక...

గు : ఆ పిల్ల చెంప పగల గొట్టదంటావ్...

శి : ఓ విధంగా అంతే అనుకోండి...



గు : ఆ!

శి : అహహహ అది కాదు గురూజీ.... ఆ అమ్మాయి కాస్త రెస్పెక్ట్ ఇచ్చి వింటుంది మీరు వెళితే! ఆ లెటర్ చదివి నన్ను పెళ్ళి చేసుకోడానికి ఒప్పుకుంటుందన్న నమ్మకం కూడా ఉంది. ఈ శిష్యుడు గురించి ఆ మాత్రం చేయలేరా గురూజీ.

గు : సెంటిమెంటు పెట్టి నా చేత ఎటువంటి పనులు చేయిస్తున్నావు శిష్యా!? హుం ఏం చెప్పగలవు. విధి విలాసం.... ఇంతకీ చెప్పు. ఎక్కడ ఆ

అమ్మాయి విలాసం అండ్ నివాసం.

***

శి : దేవుడా... నా ప్రేమ ఫలించి... పెళ్ళి జరగాలి. నీకు వంద కొబ్బరి కాయలు కొడతా... దేవుడా దేవుడా దేవుడా దేవుడా...

గు : శిష్యా... శిష్యా...

శి : (ఉలిక్కిపడి) ఎవరు మీరు.... అచ్చం మా గురువుగారిలాగే పిలిచారు. మిమిక్రీ వచ్చా మీకు.

గు : లేదు శిష్యా... నేనే... నీ గురువుని

శి : ఆ! ఈ గెటప్పేంటి గురూజీ.

గు : నీకు పూర్వజన్మ మీద నమ్మకం ఉందా?

శి : ఇప్పుడు అదెందుకు గురూజీ?

గు : అదే.... నాలో ఈ మార్పుకి కారణం... అదే... నన్ను తిరిగి సంసార జీవితం వైపు పయనింపచేట్టు చేసింది.

శి : ఆ: మీరు పెళ్ళి చేసుకోబోతున్నారా... ఎంత గొప్పవార్త.... ఎక్సెస్ బిల్లింగ్ కాకుండా, రాంగ్ కాల్స్ రాకుండా, రోజుకొకసారైనా డెడ్ అవకుండా వారం రోజులపాటు టెలిఫోన్ అద్భుతంగా పని చేసినంత గొప్ప వార్త ఇది.... నాకు చాలా ఆనందంగా ఉంది గురూజీ... చెప్పండి ఎలా జరిగిందిది?

గు : ముందు నీ సంగతి మాట్లాడి తర్వాత నా సంగతి మాట్లాడితే బావుంటుంది శిష్యా.

శి : లేదు గురూజీ నేను ఆనందం పట్టలేక పోతున్నాను. మొదట మీ సంగతి చెప్పండి.

గు : సరే.... విధి విలాసం ఎలా ఉంటే... అలాగే జరుగుతుంది... చెప్తా విను. పూర్వ జన్మలో నా భార్య నాకు కనిపించింది.

శి : ఆ:... నిజం.... నేను నమ్మజాల

గు : నేనూ అచ్చం ఇలాగే అన్నాను... కానీ ఆమె వినలేదు. మాది జన్మ జన్మల బంధంట... క్రితం జన్మలో కూడా నేను నమ్మలేదుట... అవన్నీ గుర్తు చేసింది... చివరకు నన్ను పెళ్ళికి ఒప్పించింది...

శి : ఇది చాలా విడ్డూరంగా ఉందే... ఇంతకూ ఆవిడ ఎవరు గురూజీ?

గు : ఇదిగో శిష్యా ఇదే ఆవిడ విలాసం అండ్ నివాసం.

శి : ఆ:... నేనిచ్చిన అడ్రసే.... అంటే...

గు : నువ్వు లవ్‌చేసిన అమ్మాయే శిష్యా... పూర్వ జన్మలో నా భార్య.

శి : మోసం... ద్రోహం.... నువ్వు గురువ్వి కాదు ద్రోణాచార్యుడిని మించి పోయిన ద్రోహాచార్యుడివి.

గు : హు.... హు..హు... ఏం చేస్తాం శిష్యా విధి విలాసం! నీ ఉత్తరం చూపించా... ఆమె నవ్వింది... ప్రేమలేఖ రాయటం చేతకాని వాడికి, ఎదురుపడి ఇచ్చే ధైర్యం లేనివాడికి ప్రేమించే అర్హత లేదని అంది. కాస్త వయసు మీరినా ఆ పని ధైర్యంగా చేశాను గనుక నన్నే పెళ్ళి చేసుకుంటానంది. నేను ఒప్పుకోపోతే జీవితాంతం కన్యగా ఉండి పోతానంది.... అంచేత... సారీ... మేమిద్దరం ఇష్టపడ్డాం.

శి : (రోషంతో రొప్పుతూ) ఉత్తరం తీసుకెళ్ళి ఇచ్చారు సరే... అది రాసింది మీరేనని ఆ అమ్మాయికి ఎలా తెలిసింది.

గు : అదే శిష్యా విధి విలాసం అంటే... ఉత్తరం రాసిన తర్వాత సంతకం పెట్టడం నువ్వు మర్చిపోయావు. నా అలవాటు ప్రకారం నేను నా సంతకం పెట్టేశా...

శి : గురూ.... ద్రోహాచార్యా... నిన్నూ.. ఉండు... ఇప్పుడే చేస్తా నీ పెళ్ళి....

ఇద్దరు పరుగెడుతుండగా

--- కట్ ---




## మహామేధావి రాంబాబు!



**నండూరి పార్థసారథిగారు సృష్టించిన విలక్షణ హాస్యపాత్ర రాంబాబు! రాంబాబు ఓ 20 ఏళ్ల కాలేజీ కుర్రవాడు. 'సుజనమిత్ర' అనే లార్జెస్ట్ సర్క్యులేటెడ్ డెయిలీ ఫ్రమ్ చింతల్‌బస్తీ (సర్క్యులేషన్ 2 వేల కాపీలు)లో పార్ట్‌టైము ఉద్యోగం. తన అరకొర తెలివితేటలతోనే తను మహామేధావిననుకుంటాడు రాంబాబు. ఇంగ్లీషు, తెలుగు సరిగా రాక కొంత, 'స్వేచ్ఛా'ను వాదాల వల్ల కొంత, కుతర్కం వల్ల కొంత, అమాయకత్వం, అజ్ఞానం, అతితెలివి వల్ల కొంత - రకరకాలుగా తనకు తెలియకుండానే బోల్డంత హాస్యాన్ని పంచాడు రాంబాబు.'రాంబాబు డైరీ' (రెండవభాగం)లో తెలుగు రాక పుట్టించిన హాస్యానికి కొన్ని మచ్చుతునకలు:**

అతను పుట్టించిన కొన్ని కొత్త మాటలు -

- ★ అనుగుణ్యాంగా
- ★ గంభీరకరముగా
- ★ విఫలీకృతుడనయ్యానని
- ★ ముమ్మరీకరించి

★ ఓ నఖచిత్ర కళాకారుడుని 'నఖక్షత కళాకారుడు' అని వర్ణిస్తే తప్పన్నారు.

★ నిర్వంద్వంగా సలహా యిచ్చాను.

★ "అర్ధాంగీకారం అంటే అర్ధాంగి కావడానికి అంగీకరించడమే కదోయ్!"

★ హాస్యాస్పదం అంటే తెలియక పోవడానికి ఏముంది? హాస్యమునకు ఆస్పదమైనది - అనగా నవ్వు పుట్టించునది అని అర్ధం" అన్నాను.



"నీ బొంద... అది నెగిటివ్ మీనింగు యిచ్చేమాట" అన్నాడు అతను. అదెలా?

★'తిరుగులేని దక్షిణాది నాయకుడు ఎన్టీఆర్' అని ఆయన హెడ్డింగు పెట్టాడు. 'దక్షిణాది' అనే మాట కొంచెం మొరటుగా ఉందనిపించి నాజూకుగా 'దక్షిణ' అని మార్చాను.

★వందలాది మంది అతిసార వ్యాధికి బలైపోతుంటే రాష్ట్రప్రభుత్వం సారా వ్యాపారాన్ని నిషేధించకుండా, మిఠాయి దుకాణాల లైసెన్సులు రద్దు చేస్తున్నామని, జలకాలుష్య నివారణకు చర్యలు తీసుకుంటున్నామనీ అనడం ఏమిటి?

(- వచ్చే సంచికలో మరికొన్ని)

# సుస్వరలక్ష్మి ఎం.ఎస్. సుబ్బులక్ష్మి

అప్పుడు పదేళ్లుంటాయి ఆ అమ్మాయికి. పాఠశాల ఆవరణలో ఇసుకలో కూర్చుని ఆడుకుంటోంది. ఇంతలో ఎవరో వచ్చి చేతులకు, బట్టలకూ ఉన్న దుమ్ము దులిపి ఎత్తుకుని తీసుకువెళ్లి వేదిక మీద వీణవాయిస్తున్న తల్లి ప్రక్కన కూర్చోబెట్టారు. ఆ పాపను దగ్గరకు తీసుకుని తల్లి పాడమని చెప్పింది. ఏవో రెండు పాటలు రాగరంజితంగా పాడిందా చిన్నారి. ఆ పాప అద్భుత గానప్రావీణ్యానికి అక్కడున్న పండితులంతా ఆశ్చర్యపోయి కరతాళధ్వనులతో అభినందనలు తెలిపారు.



ప్రజాహిత కార్యక్రమాలకై ఉచిత ప్రదర్శనలెన్నో ఇచ్చిన 'భారతరత్న'

## చాలా ఏళ్ల తరువాత....

అది ఓ అంతర్జాతీయ సంగీతోత్సవ వేదిక. ఎందరో ప్రపంచ ప్రసిద్ధ విద్వాంసులు. అప్పుడే "ఆమె" సంగీత కచేరీ ముగిసింది. తన్మయ భావనతో అందరి కళ్లలోనూ స్వచ్ఛమైన ఓ ఆధ్యాత్మికమైన వెలుగు కనబడుతోంది. "ఆమె" తరువాత సుప్రసిద్ధ ఆధునిక సంగీత సమ్మేళనంగా పిలుచుకునే "జుబిన్ మెహతా" కచేరి చేయాలి. కనీసం 150 సంగీత వాయిద్యాలతో ఆయన వేదికను అలంకరిస్తారు. ప్రపంచంలోని గొప్ప సంగీతకారుల్లో ఆయన ఒకరు. కానీ ఆ రోజున ఆయన వేదికనెక్కడానికి ముందు వెనుకా సంకోచిస్తున్నారు. కారణం ఒక స్వరంతో వేలమందిని సంగీత పారవశ్యంలో తేలియాడించిన "ఆమె" స్వరం ముందు వందలాది తన వాయిద్యాలు ఏ పాటివి. ఏమయి తేనేం అని భక్తి పూర్వకంగా వినయభావంతో జుబిన్ మెహతా "ఆమె" ముందు నిలిచి చేతులు జోడించి ఆశీర్వచనాలు తీసుకుని ధైర్యంగా వేదికనెక్కాడు.

ఈ రెండు సంఘటనల మధ్య చాలా తేడానే ఉండవచ్చు. కానీ అనితర సాధ్యమైన గాత్ర సంగీత సామ్రాజ్ఞిగా పేరుగాంచిన "ఎమ్మెస్ సుబ్బులక్ష్మి" గారే ఆనాటి ఆ "అమ్మాయి". ఆ తర్వాతి "ఆమె".

ఏడున్నర దశాబ్దాలుగా కర్ణాటక సంగీత ప్రపంచాన్ని తన గాత్ర కౌశలంతో ఐశ్వర్యవంతం చేస్తూ భారతీయ శాస్త్రీయ సంగీతానికి ఎల్లలు లేవని నిరూపించిన స్వరశిరోమణి "ఎం.ఎస్.సుబ్బులక్ష్మి". ఈ నెల 16న 87వ ఏట ప్రవేశిస్తున్న ఎమ్మెస్ స్వరానికి మాత్రం వృద్ధాప్యం లేదు. మధురైలోని సంగీత కుటుంబంలో 1916 సెప్టెంబరు 16న జన్మించిన ఎమ్మెస్ సుబ్బులక్ష్మి అసలు పేరు "కుంజమ్మ". తల్లి షణ్ముఖవడివు వీణావిద్వాంసురాలు. అమ్మమ్మ అక్కమ్మాళ్ వయొలిన్ విద్వాంసురాలు. తల్లి వీణావాదన, తరచూ తమ ఇంటికి వచ్చే సంగీతకారుల నందడి ఆమెను కళా ప్రపంచంలోకి తీసుకువచ్చాయి. కుంజమ్మ ఆరో తరగతి చదివేటప్పుడు ఏదో తప్పు చేసిందని ఉపాధ్యాయుడు తీవ్రంగా దండించడంతో బడికెళ్లడం మానుకుంది. సంగీత సాధనే ఆమెకు సర్వస్వం అయింది.

ఎమ్మెస్ సుబ్బులక్ష్మి ముసిరి సుబ్రహ్మణ్య అయ్యర్, సెమ్మంగుడి శ్రీనివాస అయ్యర్ వంటి దిగ్గంతుల వద్ద శిక్షణ పొందారు. ఆమె తల్లితో కలిసి 12వ ఏట వేదికనెక్కి పాడినప్పుడు సంగీతకాశంలో ఓ కొత్త తారక ఉదయించి నట్లయింది. 1932లో తన 16వ ఏట అనుకోకుండా ఎమ్మెస్‌కు "మద్రాస్ మ్యూజిక్ అకాడమి" వేదికపై పాడే అవకాశం వెదుక్కుంటూ వచ్చింది. ఓ సాయంత్రం అకాడమి ఒక మహా విద్వాంసుడి కోసం ఎదురు చూస్తోంది. ఆయన సుప్రసిద్ధ అరియక్కుడి రామానుజ అయ్యర్. కానీ చివరిక్షణంలో "తాను కచేరీకి రాలేక పోతున్నానని తన బదులు మరొకరిని పంపు తున్నానని" లేఖ వ్రాశారు. అయితే ఆయన

### తెరపై ఎమ్మెస్



'మీరా'గా సుబ్బులక్ష్మి

ఎమ్మెస్ తొలినాట 'సేవాసదన్', 'శకుంతల', 'సావిత్రి', 'మీరా' చిత్రాల్లో నటించారు. శకుంతలలో ముగ్ధమనోహరమైన మునికన్యగా ఆమె నటన అసామాన్యం. సేవాసదన్‌లో ఆధునిక యువతిగా నటించారు. శకుంతలలో ఆమె పాడిన పాటలన్నీ హిట్ అయినవి. దక్షిణ భారతంలో ఆమె పాటలు వినపడని ఇల్లు లేదు. సావిత్రిలో నారదునిగా నటించి పాడిన కీర్తనలు బహుళ జనాదరణ పొందాయి. ఇక మీరా సంగతి ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. సాక్షాత్తూ మీరాబాయ్ తెరపై కనుపింపజేశారు. ఈమె సరసన నటించిన వారు చిత్తూరు నాగయ్య.

## ఎమ్మెస్ - గాంధీ, నెహ్రూ

గాంధీజీ హత్యకు కొద్ది రోజుల ముందు ఆయన నుండి సదాశివం గారికి ఓ కబురు వచ్చింది. అదేమిటంటే "హరితుమ హరో జనకే" అనే పాట ఎమ్మెస్ నోట వినాలని ఉందని. అయితే ఆ పాట ఆమెకు రాదని తిరుగు సమాచారం పంపగా, గాంధీజీ "ఈ పాట ఎమ్మెస్ నోట మాటల్లో చదివినా చాలు ఆమెనే పాడాలని" మళ్లీ కబురు పంపారు. ఆయన కోరిక మేరకు ప్రత్యేకంగా పాడి చేసిన రికార్డును పంపారు. సరిగ్గా ఆ రోజు అక్టోబరు 2 గాంధీజీ జన్మదినం కావడం మరింత గొప్ప విషయం. ఆ తరువాత 1948 జనవరిలో మహాత్ముని మరణవార్త ప్రసారం చేసిన ఆకాశవాణి వారు వెంటనే ఎమ్మెస్ గానం చేసిన "హరితుమ్ హరో" భజన్‌ను ప్రసారం చేశారు. అది విన్న ఎమ్మెస్ స్పృహ తప్పి పడిపోయింది.

ఎమ్మెస్ పాట విన్న తరువాత "ఈ సంగీత



'ఆమె సామ్రాజ్ఞి నేను కేవలం ప్రధానమంత్రిని'

సామ్రాజ్ఞి ముందు నేనెవరిని. నేనొక మామూలు ప్రధానమంత్రిని మాత్రమే" అన్నారు నెహ్రూ. ఎం.ఎస్. నటించిన "మీరా" చిత్రం చూసిన తరువాత "నా నైటింగేల్ బిరుదును ఈమెకు ఇచ్చేశాను" అని సరోజినీనాయుడు, "తప్పిపోయిన నా ఆత్మను తిరిగి కనుగొన్నాను" అని పండిత గోవిందవల్లభ్ పంత్ ప్రశంసించారు. ఉస్తాద్ బడే గులాం అలీఖాన్ ఎం.ఎస్.గానం విని "బేటీ ఖూబ్ ఖావో ఖూబ్ గావో" అని, గురువు సెమ్మంగుడిచే "ఈమెను పొగిడేందుకు నావద్ద మాటలు లేవని" ప్రశంసలందు కున్నారు. తన కర్ణాటక సంగీతమే గొప్పదనే భావన లేకుండా నారాయణరావ్ వ్యాస్ వద్ద హిందుస్తానీ సంగీతం, సిద్దేశ్వరీ దేవి వద్ద టప్పాతుమ్రీ, దిలీప్‌రాయ్ వద్ద రవీంద్ర సంగీత్, భక్తిసంగీత్ నేర్చుకున్నారామె. వైవిధ్యాలున్న ఎన్నో సంగీతబాణీలను అవగతం చేసుకోవడం వల్ల పండిత పామరులను సమానంగా అలరిస్తూ ప్రపంచ వ్యాప్తంగా కచేరీలు చేశారామె.

పంపిన సంగీత విద్వాంసురాలికి 16 ఏళ్లు కూడా ఉండవు. అది చూసి అక్కడున్న వాళ్లంతా నిరుత్సాహపడి "ఈ అమ్మాయి ఏం పాడుతుందబ్బా" అనుకున్నారు. ఇవేమీ పట్టించుకోని ఎమ్మెస్ వేదికనెక్కి కచేరీకి సిద్ధమైంది. ఎమ్మెస్ వెనుక తల్లి షణ్ముఖవడివు తంబూరా వేసింది. మన సుబ్బులక్ష్మి తన స్వరంతో కోమల గంధర్వగాన సౌరభాన్ని రవళించేలా పాడింది. ఇక సంగీత ప్రపంచంలో ఉద్దండులైన టైగర్ వరదాచారి, వీణాకారైకుడి సాంబ శివయ్యర్, చెంబై వైద్యనాధ భాగవతార్ వంటి సంగీతజ్ఞు లెందరో ఎదురుగా ముందు వరసలో కూర్చుని ఉన్నారు. ఆమె కచేరీని పూర్తి చేసింది. అందరి ముఖాల్లోనూ సంభ్రమాశ్చర్యాలు తొణికిసలాడాయి. అంత చిన్న వయసులో మ్యూజిక్ అకాడమీ వేదికపై పాడి అందరి ప్రశంసలు అందుకున్న కళాకారులు చాలా అరుదు. అందరినోటా పొగడ్తలే. "అమ్మడూ నీ కంఠంలో వీణ తంత్రులు మ్రోగు తున్నాయి" అని కారైకుడివారు అభినం దించారు.

ఎమ్మెస్ పాడుతుంటే ఆమె వదనంలో ప్రశాంతత, ప్రసన్నతలాస్యం చేస్తుంటాయి. రాగాలాపన, కీర్తన, నెరవు, స్వరకల్పన ఏదైనా సరే నాద సౌందర్యంతో నిండి ఉంటాయి. కర్ణాటక సంగీతంలో తలమానికమైన "పల్లవి"ని పాడటంలో తల్లి ఆమెకు ప్రత్యేకంగా శిక్షణనిప్పించారు. అందుకే ఆమెకు మృదంగ సంబంధమైన లెక్కలన్నీ తెలుసు. "పల్లవి" పాడటమంటే పాండిత్య ప్రకర్షతో కూడిన పని. నిర్దిష్టమైన లయ జ్ఞానం, ధారణశక్తి, గణిత శాస్త్ర సూక్ష్మాలు ఇవన్నీ కలిగి ఉండాలి. అవన్నీ ఆమెలో పుష్కలంగా ఉండటం వల్ల సాధ్యమైంది.

ఎమ్మెస్ జీవితంలోకి ఒక చురుకైన యువ పాత్రికేయుడు త్యాగరాజన్ సదాశివం ప్రవేశించాడు. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొంటూ కాంగ్రెస్ వాలంటీర్‌గా సుబ్రహ్మణ్య భారతి గేయాలు పాడుతూ ప్రజలను ఉత్తేజితులను చేసిన ఆయన ఎమ్మెస్ సంగీత జీవితంలో నిర్వహించిన పాత్ర విశిష్టమైనది. వీరి పరిచయం 1940లో పరిణయానికి దారి తీసింది. అప్పటికే ఆయన వివాహితుడు. అయితే ఎమ్మెస్‌కు సంతానం లేదు. మొదటి భార్య పిల్లలనే తన స్వంత బిడ్డలుగా చూసుకుంటోందామె. ఎమ్మెస్ కచేరీల నిర్వహణలో సదాశివం మార్గదర్శకత్వం ఎంతైనా ఉంది. ఎక్కడ, ఎప్పుడు కచేరీ చేయాలో ఎక్కడ ఏ ఏ కీర్తనలు పాడాలో ఆయనే నిర్ణయించేవారు.



మార్గదర్శి, భర్త 'కల్కి' సదాశివంతో

గడచిన 75 ఏండ్ల కాలంలో ఎమ్మెస్ విశ్వ వ్యాప్తంగా చేసిన కచేరీలు రెండు వేలపైచిలుకే ఉంటాయి. వాటిలో తన స్వలాభం కోసం చేసినవి పాతిక శాతం కూడా ఉండవు. గాయనిగా సంపాదించినదంతా ప్రజాహిత కార్యక్రమాలకు, దానధర్మాలకు వినియోగించిన నిస్వార్థ

### ఎమ్.ఎస్.. అంటే...

ఎమ్ఎస్ అంటే
మంగళ స్వరం
ఎమ్ఎస్ అంటే మధురస్వరం
మెస్మరిజం
ఆవిడెప్పుడు సుప్రభాతం
పాడుతుందా అని
శివకేశవులిద్దరూ
మగతగా నిద్దరోతారు
పరమశివుడి ఢమరుకంలోంచి
జాలువారిన శివసూత్రం ఆమె గాత్రం
ఆమె భజగోవింద శ్లోకాలు
ఆదిశంకరుల మెళ్లో రుద్రాక్షమాలలు
ఆమె విష్ణు సహస్రం
ఏడుకొండల వాడికి క్షీరాభిషేకం
ఆమె మీరా భజన్లు
గిరిధర గోపాలుడికి వెన్నముద్దలు
ఆమె భరతధాత్రి గౌరవ పతాకాన్ని
భూగోళం మీద పాతిన త్రివర్ణ గాత్రి.
ఆమె సంగీత త్రయాన్ని అర్చించిన గాయిని
ఆమె సంగీత సామ్రాజ్ఞి
ఆమె సాక్షాత్తూ
వరవీణా మృదుపాణి....

**- తనికెళ్ళ భరణి**



## ఎవార్డుల ఎమ్మెస్

ఎమ్మెస్ సుబ్బులక్ష్మి 60 ఏళ్లుగా అందుకున్న అవార్డులు, సన్మానాలు అనేకం. ఇసైవాణి (1940), పద్మభూషణ్ (1954), రాష్ట్రపతి అవార్డు (1956), సంగీత కళానిధి (1968), తమిళ ఇసై సంఘం - "ఇసే పేరంజ్ఞర్" (1970), 1967లో శాంతినికేతన్ పురస్కారం. ఢిల్లీ, తిరుపతి వెంకటేశ్వర వర్సిటీల గౌరవ డాక్టరేట్లు (1973), రామన్ మెగసేసే అవార్డు (1974), పద్మవిభూషణ్ (1975), టి.టి.డి. వారి 'సప్తగిరి సంగీత విద్వన్మణి' (1975) 1998లో 'భారత రత్న'తో సన్మానితురాలైనారామె. ఇవన్నీ కూడా ఆమెను వరించి తమ గౌరవాన్ని పెంచుకున్నవే.

కర్ణాటక సంగీత త్రయంలో మొదటి విద్వన్మణిగా పేరొందిన సుబ్బులక్ష్మి గాయనీ. ఒక భారతీయ స్త్రీ విశ్వవేదికపై ఎన్ని విజయాలను సాధించగలదో వాటిని సాధించి చూపిన మహనీయురాలు. అందుకు భారతీయులమైన మనమంతా గర్వించాలి.

పరురాలమె. కచేరీల ద్వారా ఆమె సేకరించిన సొమ్ము రెండు కోట్లకు పైమాటే అని ఓ అంచనా. ఎమ్మెస్ గానమంటే మహాత్మాగాంధికి సైతం ఇష్టంగా ఉండేది. "భక్తిభావం ఆమె కంఠంలో ద్యోతకమైనట్టు మరే గాత్రంలోనూ ఉండదని" ఆయన భావించేవారు.

"అసలు నేను పాడగలనని ఏనాడూ అనుకోలేదనే" సుబ్బులక్ష్మికి సంగీతం తరువాత భర్తే దైవం. 'ఆయనను భర్తగా పొందే విషయంలో తానెంతో అదృష్టవంతురాలినని ఆమె చెబుతుంటారు. తన భర్త ఎంపిక చేసుకునే విషయంలో, తాను తప్పటడుగు వేసి ఉంటే తన జీవితం దుర్భరమయ్యేదని ' ఆమె భావిస్తారు. ఆయన తోడుగా నీడగా ఉండటం వల్లే తనకిలాంటి ఉజ్వల భవిష్యత్తు సాధ్యమైందని ఆమె ఉద్దేశ్యం. సుమారు 56 ఏళ్ల తోడూ, నీడగా గురువుగా, మార్గదర్శి మాణిక్యాన్ని కాపాడే ఆదిశేషునిలా ఉన్న భర్త సదాశివం 1997లో మృతి చెందారు. ఆయన పోయిన తరువాత ఆమె తంబూరానైనా తాకలేదు.

**-వి.మాలతి**

## యాహ్యా 'హారెమ్ కాబినెట్'లో నూర్జహాన్ ఉందా?

బంగ్లాదేశ్ ప్రజలను ఊచకోత కోసి, 1971లో భారత్‌తో యుద్ధానికి కాలు దువ్వి పరాజయం పాలయి పాకిస్తాన్ రెండు ముక్కలు కావడానికి కారణభూతుడైన వాడు జనరల్ యాహ్యాఖాన్. స్త్రీ లోలుడయిన యాహ్యా పాలించే రోజుల్లో అతని చుట్టూ ఉన్న స్త్రీలు రాజ్యాన్ని ఏలేవారు. ఇందిరా గాంధీకి 'కిచెన్ కాబినెట్' ఉన్నట్టు 'యాహ్యాకు హారెమ్ (అంత:పురం) కాబినెట్' ఉందనే వారు.

ఆ సన్నిహితురాళ్లల్లో నూర్జహాన్ కూడా ఒకరని అంటారు. ఈ విధంగా పాలకులకు చేరువై చక్రం తిప్పిన గాయనీమణులు అరుదు. నూర్జహాన్‌కి ఆ (అ) గౌరవం దక్కింది. ఆ యాహ్యా 'హారెమ్' కాబినెట్‌లో తరానా అనే ఆమెను 'మినిస్టర్ ఆఫ్ సప్లయిస్ అండ్ స్టోర్స్' (అంటే యాహ్యాకు మందు, మగువలు సప్లయి చేయడమని అర్థంట) అని, నూర్జహాన్‌ను 'మినిస్టర్ ఆఫ్ ఫారిన్ అండ్ కల్చరల్ ఎఫైర్స్' అనీ వ్యవహరించే వారు.

1973లో అంటే యాహ్యాఖాన్ గద్దె దిగి భుట్టో పదవిలోకి వచ్చాక 'పాకిస్తాన్‌ను నాశనం చేసిన స్త్రీలు వీరే' అంటూ పార్లమెంటులో చర్చ జరిగింది. పత్రికల్లో వార్తలు ప్రచురించబడ్డాయి. యాహ్యాకు అతి సన్నిహితంగా మెలిగిన బేగం అక్లీమ్ అఖ్తర్ రాణి - (ఆమె నిక్‌నేమ్ 'జనరల్ రాణి') ఒక ఏడాది పాటు యాహ్యాను కంట్రోలు పెట్టానని చెప్పుకుంది. "ఇండియాతో యుద్ధం వద్దని, భుట్టోకు ప్రభుత్వం అప్పగించమని యాహ్యాకు చెప్పాను. కానీ అప్పటికే అతను నూర్జహాన్ మత్తులో పడ్డాడు. నా మాట వినలేదు.

"అసలు నూర్జహాన్‌ను అతనికి పరిచయం చేసింది నేనే. నూర్జహాన్ పాటలు విని యాహ్యా ముగ్ధుడై ఆ అమ్మాయిని చూస్తానన్నాడు. 'అమ్మాయి కాదు, అరడజను మంది మగాళ్లను హరాయించుకున్న మహమ్మారి' అని చెప్పాను నేను. కానీ అతను వినలేదు. మిలటరీ ఇంటెలిజెన్స్ చీఫ్ జనరల్ ఉమ్మర్ ఇంట్లో పార్టీకి నూర్జహాన్ పాట కచ్చేరీ ఏర్పాటు చేశాను. 5,000/- రొక్కంగా ఇచ్చి మరో 5,000/- నగల రూపంలో ముట్ట చెప్పాను. పాట విని మైమరచిపోయాడు. ఇద్దరూ ఓ గదిలోకి వెళ్లి 5 గంటల తర్వాత గానీ బయటకు రాలేదు. ఇక అప్పణ్నుంచి నూర్జహాన్‌ను పట్టుకోలేక పోయాం." అని పత్రికలకు చెప్పింది జనరల్ రాణి.

నూర్జహాన్ నడిగితే "గదిలోకి లాక్కెళ్లిన మాట నిజం. ఆ పైన ఏమీ జరగలేదు. అతను తప్పతాగి ఉన్నాడు. పైగా నేను అలాటిదాన్ని కాను" అని ప్రకటన ఇచ్చింది. రాణి ప్రచారం వల్ల నూర్జహాన్ వివాహం భగ్నమయింది. భుట్టో అధికారంలోకి వచ్చిన తర్వాత కోర్టు డైవోర్సు కేసు పునః విచారణ ప్రారంభించినా నూర్జహాన్ విడాకులు కోరింది.





ఒక గాయని, ఒక నటుడు - మధ్య నియంత నీలి నీడలు:

ఈ విధంగా రాజుతో స్నేహం మొగుడ్ని దూరం చేసింది!

**-కమ్యూనికేటర్ ఫీచర్స్**

అలనాటి ఆణిముత్యాల
గురించి నేటి తరానికి అనువైన
శైలిలో తెలిపే

క్లాసిక్స్ రీటోల్డ్

# నవ్వుటద్దాలు

- ఆచార్య తిరుమల

## సాహిత్యంలో వంటకాలు

"కోటి విద్యలు కూటి కొరకే" అనే సామెతతో బాటు "జిహ్వాకో రుచి పుర్రెకో బుద్ధి" అనే సామెత కూడా ఉంది. ఎవరి రుచి వారిది. ఎవరి బుద్ధి వారిది. అసలు విషయమేమిటంటే - ఆకలిని బట్టి ఆహారం, ఆహార నియమాన్ని బట్టి ఆయుర్దాయం ఉంటాయి. బాగా ఆకలిగా వున్న వానికి రుచితో సంబంధం లేదు. తిండి దొరికితే చాలు. దప్పికవేసిన వాడికే గదా మబ్బు విలువ తెలిసేది! పుట్టిన ప్రతి ప్రాణికి ఆహారం నియమితమై వుంటుంది. "జీవో జీవస్య జీవనమ్" అన్నది ప్రాకృతిక ధర్మ సిద్ధాంతం. అలాగని గుహలో కూర్చున్న ఎంతటి సింహానికైనా ఏ ప్రయత్నం లేకుండా ఆహారం నోటి దగ్గరకు రాదు. ఏ పాటు పడినా సాపాటు కోసమే గదా! మనిషి అత్యవసరాల్లో కూడు గూడు గుడ్డ - ముఖ్యం. వీనిలో కూడు మరీ ముఖ్యం. అన్నం పరబ్రహ్మ స్వరూపమే కాదు ఆత్మస్వరూపం. అన్నపూర్ణ - అన్నదేవత. అందుకే ఏ యింట్లో అయినా వంటిల్లు ఆడవారిదే అయి వుంటుంది. "అమ్మ నీ చేతి తాలింపు కమ్మదనము - భారతదేశాన ఘుమఘుమా పరిమళించె" అని కరుణశ్రీ గారు ఘుమ్మెత్తించారు. కమ్మని భోజనాన్ని చూస్తే ఎవరికి నోరూరదు! అందుకే అప్పుచేసైనా పప్పుకూడుతినమన్నారు. కానీ బమ్మెరపోతన "అప్పడుపుకూడు భుజించుట కంటె సత్కవుల్ హాలికులైననేమీ?" అని అనాత్మీయాహారాన్ని నిరశిస్తే, శ్రీశ్రీ "సత్కవుల్ హాలికులైననేమీ? "ఆల్కహాలికులైన నేమి?" అని తన కోసం, తనలాంటి వారి కోసం దిద్దుకున్నాడు.

కవులకి సుష్టుగా భోజనం చేయటమంటే ఎంత యిష్టమో, భోజనం తయారు చేయటమంటే కూడా అంత యిష్టమని తెలుస్తుంది. అంతేకాదు, భోజన పరాక్రమం కవులకి తెలిసినంతగా మరెవరికి తెలియదేమో! కవుల వంటలు, రుచులు, అభిరుచులెలా వుంటాయో, ఆ చమత్కారాలెంత గంభీరంగా ఉంటాయో పరిచయం చేస్తాను.

**"పదునుగ మంచి కూర నలపాకము జేసిననైన గాని నిం**
**పొదవెడు నుప్పు లేక, రుచిబుట్టగ నేర్చునటయ్య భాస్కరా!"**

అని భాస్కర శతకకారుడు 'ఉప్పు'ని ప్రస్తావిస్తే కొరవి గోపరాజు-

**"గరిత లేని యిల్లు దొరలేని తగవును**
**చింతపండు లేని వింత చవియు**
**చనువులేని కొలువు శశిలేని రాత్రియు**
**ముక్కులేని మొగము నొక్కరూపు"**

అని చింతపండుకి అగ్రతాంబూలమిచ్చాడు. బసవరాజు అప్పారావు "గుత్తివంకాయ్ కూరోయ్ బావా, కోరి వండినానోయ్ బావా" అని వెర్రిపిల్ల నోట అనిపించి, పాయసం, పూరీలు కూడా ఎలా వండాలో చెప్పాడు. ధూర్జటి మహాకవికి శాకాహార, మాంసాహారాల తయారీలు రెండూ తెలుసు. శ్రీకాళహస్తీశ్వర శతకంలో తిన్నడి ఎంగిలి మాంసం తిన్న శివుణ్ని ఇలా ప్రశ్నిస్తాడు. ఎంత చమత్కారమో చూడండి:-

**నీకున్ మాంసము వాంఛయేని కఱవా! నీ చేత లేడుండగా**
**జోకైనట్టి కుఠారముండ ననల జ్యోతుండ నీరుండగా**
**పాకం బొప్ప ఘటించి చేతి పునుకన్ భక్షింపకా బోయే చే**
**చే కొంటెంగిలి మాంసమిట్లు దగునా? శ్రీకాళహస్తీశ్వరా!!**

లేడి, దాన్ని చంపటానికి గొడ్డలి, ఆ మాంసం ఉంచటానికి గిన్నెలాంటి పుర్రె, ఉడికించడానికి నీరు, నిప్పు - అన్నీ నీ దగ్గరే వున్నాయి కదా ఆ బోయవాడి ఎంగిలి మాంసమెందుకు తిన్నావని ధూర్జటి ప్రశ్న. ఈ విషయంలో శ్రీనాథ మహాకవి మరో అడుగు ముందుకు వేసి తన హరవిలాస కావ్యంలో నరమాంసాన్నెలా వండాలో చెప్పాడు. అలా వండితే అది బాగుంటుందో లేదో నాకు తెలియదు గానీ ఆ పద్యమిది:-

**మిరియము నుల్లియన్ బసుపు మెంతియు నింగువ జీరకర్ర శ**
**ర్కరయును చింతపండును గరాంబువు కమ్మని నేయి తైలమున్**
**పెరుగును మేళవించి కడుపెక్కు విధంబుల పాక శుద్ధి వం**
**డిరి శిరియాళునిం గటికి దెందమునం దరళాక్షులిద్దరున్!!**

శ్రీనాథుడంటే అలాంటిలాంటి కవి కాదు "పరమేశా! గంగ విడుము పార్వతి చాలున్" అని శివుణ్ని డబాయించి నీరు పుట్టించుకున్నవాడు. కన్నడ రాజ్యలక్ష్మికి "రుచుల దోసం బంచుపోనాడితిన్" అని తెలియ జెప్పినవాడు. కాబట్టి, శ్రీనాథుని వంటకాన్ని తప్పుపట్టలేం. ఇక,

**"షట్ శాస్త్రములు జెప్పె చర్ల బ్రహ్మయ శాస్త్రి**
**వంట నేర్పించె గద్వాల రాజు"**

అని చెప్పుకున్న తిరుపతి వేంకట కవులకి పకోడీలు చేయ టం బాగా తెలుసు. ఒకసారి చిలకమర్తి వారి కోరిక మేరకు 'ఉత్సాహం'గా-

**శనగపిండి ఉల్లిపాయ చిన్ని మిర్పకాయలన్**
**జునిపి అందు అల్లమంత దొనిపి ముద్దచేసినన్**
**అనల తప్తమైన నేతియందు వైచి వేచినన్**
**జను పకోడి అనెడు పేర చక్కనైన ఖాద్యమౌ!!**

అని పకోడిని అక్షరాల చేసి చూపించారు.

అంబలి, చింతకాయ, కూరగాయ, పాల నేతి వంటి తెలుగు మాటలు ఉపయోగించి ఒక సంస్కృత కవి చమత్కార గర్భితంగా మహావిష్ణు స్వరూపుడైన శ్రీకృష్ణునిలా కీర్తించాడు:-

**అంబలి ద్వేషిణం వందే**
**చింతకాయ శుభప్రదం**
**కూరగాయ కృతత్రాసం**
**పాలనేతి గవాం ప్రియం!!**

ఈ శ్లోకాన్ని అం+బలి ద్వేషిణం, చింత+కాయ, కు+ఊరగాయ, పాలన+ఇతి - అని విడదీసుకొని అర్థం చేసుకుంటే - బలి చక్రవర్తిని అణచినట్టి, (ఆలోచించు) చింతించువారికి శుభం కలిగించునట్టి, విషసర్పమైన కాళీయుని భయం నుండి రక్షించినట్టి, ఆవుల్ని పాలించటానికి యిష్టపడే వాడైన శ్రీకృష్ణునికి (విష్ణుమూర్తికి) నమస్కారమని తెలుస్తుంది. ఇదొక తినుబండారాల శ్లోకం.

ఇలా ఎంతో పచన సాహిత్యం ఉంది. ఇప్పుడు హోటళ్లు వచ్చిన తర్వాత చమత్కారాలు కూడా మారాయి. 'తినటం' అనేది నోటి నుండి మాటకి, కంటికి మారింది. "బుర్ర తినేస్తున్నాడు"అనీ, "తిన్నాడురా" అనీ, "తినేసేలా చూస్తున్నా"డనీ కూడా అంటున్నారు. పైగా, భోజనం చేశాడు. సాపాటు చేశాడు - అనే మర్యాదలు పోయి "పిండాకూడు తిన్నా"డని అనే వాళ్లు కూడా లేకపోలేదు.

"ఇక్కడ భోజనము పెట్టబడును" అనటానికి బదులుగా ఒక అరవ హోటలు ముందు "ఇక్కడ కూడు వేయబడును" అని బోర్డు ఉంది. మరో చోట "భోజనం తయారుగా ఉంది" అనటానికి బదులుగా "భోజనం - తాయారు ఉంది" అని బోర్డుంది. చదివి హాయిగా నవ్వుకున్నాను.




హోటల్ని గూర్చి 'నవ్వుల పువ్వులు' కావ్యంలో ఇలపావులూరి సుబ్బారావు గారొక పద్యమిలా రాశారు.

**వింతగ హోటలందొకట "ప్రీతిగమే మిడిసినంత" "మీరు**
**తిన్నంత" యనంగ వ్రాతలును అందుకు తగ్గట్టు రేట్లు రెండు మూ**
**డింతలు వేయజూచి గిరి "ఏమిది?" చెప్పుమటన్న సర్వరొ**
**క్కింత హసించి "ప్లేటు" "ఫులు" - ఇంగ్లీషు మాటల యర్థమే యనెన్**

'మేమిడినంత' అంటే ప్లేట్ మీల్సనీ, "మీరు తిన్నంత" అంటే ఫుల్ మీల్సనీ అర్థంట!

కొన్ని వంటలు కొందరికి నచ్చవు. అరవ వారింట విందుకు వెళ్లి తిని శ్రీనాథుడిలా మండిపడ్డాడు:

**తొలుతనే వడ్డింత్రు దొడ్డ మిర్యపు చారు**
**చెవులలో పొగవెళ్లి చిమ్మరేగ**
**పలు తెరంగులతోడ పచ్చళ్లు చవిగొన్న**
**బ్రహ్మరంధ్రము దాక పారునావ**
**యవిసాకు వేచిన నార్నెల్లు పసిలేదు**
**పరిమళమెంచిన పండ్లు సొగచు**
**వేపాకు నెండించి వేసిన పొళ్లను**
**కంచాన గాంచిన కక్కువచ్చు**
**అరవ వారింట విందెల్ల నాగడంబు**
**చెప్పనత్తురు తమతీరు సిగ్గులేక**
**చూడవలసెను ద్రావిళ్ల కీడు మేళ్లు!!**

ఇలా చిర్రెత్తుకు రావటం సాహిత్య స్రష్టలకే కాదు సామాన్యులకూ పరిపాటే. తినగతినగ వేము తియ్యగుండటం, తినగా తినగా గారెలు చేదెక్కటం నిత్య వ్యవహార విషయాలే కదా!

కొత్తగా కాపురానికొచ్చిన భార్య భర్తతో "ఏవండీ! నేను రోజూ మీకిలా వంటచేస్తే నాకేం బహుమతిస్తా"రని గోముగా అడిగే సరికి ఆయనగారు నిక్కచ్చిగా నిజాన్ని మొహం మీద చెప్పలేక - "ఏడాది తిరక్కుండానే - నేను చేసిన ఇన్సూరెన్సు తాలూకు లక్ష రూపాయలూ నీ చేతికొస్తాయి" అన్నాడుట!

తిండి విషయంలో ఇలాంటి రాజీలు తప్పవు మరి.



# రాంపండు లీలలు

## రాంపండూ - నవలామణీ

**"ఒరేయ్, మన క్లబ్బులో లేడీ వెయిటర్లను పెట్టారట. చూశావా?" అన్నాడు రాంపండు పోతుటీగల క్లబ్బులోకి అడుగుపెడుతూ.**

**"చూశాను. కానీ అంతా వేస్టు కాండిడేట్లే వాళ్లను చూసి క్లబ్బుకి ఎక్కువమంది వస్తారన్న ఐడియా ఎవడిదో కానీ, పాపం...," అంటూ చప్పరించేశాడు అనంత్.**

కొన్సేపటిలోనే అనంత్ లంచ్ ఆర్డరిస్తున్నాడు. ఆర్డరు తీసుకోడానికి వచ్చిన అమ్మాయిని చూడగానే రాంపండుకి ఇంట్రస్టు పోయింది. "ఏదో ఒకటి నువ్వే చెప్పేయరా" అని టాయిలెట్‌కి వెళ్లిపోయాడు.

ఆ వెళ్లినవాడు పావుగంటైనా తిరిగిరాకపోవడంతో అనంత్‌కు అనుమానం పట్టుకుంది. క్షుద్బాధతో మనవాడు ఎక్కడైనా కూలిపోయాడా అని. వెతుక్కుంటూ వెళితే మరో టేబుల్ దగ్గర కూచున్నాడు. ఏరా ఇక్కడున్నావ్? అంటే మండిపడ్డాడు.

"నువ్వొకడివి. ఏదీ తెలిసీ తెలియకుండా మాట్లాడతావ్. వెయిట్రసులందరూ వేస్టని చెప్పేశావ్. ఇక్కడ చూడు. ఈ టేబుల్ దగ్గర డ్రింక్స్ సప్లయి చేసే అమ్మాయి ఎంత బాగుందో చూడు. సన్నగా, పొడుగ్గా, చేపల్లాటి కళ్లతో.."

అనంత్ నుదురు కొట్టుకున్నాడు. "సరే, ఆ నల్ల..పొన్లే..చామనచాయ అమ్మాయేనా? సరే, బాగానే వుందిలే. కొత్తగా చేరిందేమో, నేను చూడలేదులే కానీ..అవతల లంచ్ వచ్చేసి వుంటుంది. రా."

"ఆ లంచ్‌నగరుకు రాను. ఈ డ్రింకు నగరులోనే ఉంటాను. టా, టా, వీడుకోలు." పాడాడు రాంపండు.

"తంతాను. అదంతా ఎవడు తింటాడు? ఇక్కడ డ్రింక్స్ మాత్రమే ఇస్తారు." మొత్తుకున్నాడు అనంత్.

"కావాలంటే తన్నులు తింటా గానీ ఇక్కడే తాగుతా. ఆ అమ్మాయి చేతుల మీదుగా విషం ఇచ్చినా ఓకే." మొండికేశాడు రాంపండు.

"ఒరే, నువ్వు ఆమెను చూసి పావుగంట కూడా కాలేదు. బహుశా టాయిలెట్ నుండి వస్తూ చూసి వుంటావు. అప్పుడే ప్రాణత్యాగం దాకా పోతున్నావే!" అని తెల్లబోయాడు అనంత్.

"ఒరేయ్, నువ్వు ఈ జన్మలో లెక్కే చూస్తున్నావ్. క్రితం జన్మల ఎక్కౌంటు మర్చిపోకు. బుద్ధుడి జాతకకథల్లా ఫ్లాష్‌బ్యాక్‌లోకి వెళ్లు. నేను బాబిలోనియాలో యువరాజు అవతారంలో ఉండగా, ఆమె అరబ్బీ బానిస. తను క్లియోపాత్రా అవతారంలో ఉండగా నేను ఆమె ఐదో నంబరు ప్రియుణ్ణి. ఇలా జన్మజన్మల.."

***

ఇంటికిరాగానే అచలపతిని పిలిచి అనంత్ చెప్పేశాడు - "అచలపతీ, రెడీగా ఉండు. ఈ రాంపండు గాడు సహాయమో, గాడిదగుడ్డో అంటూ మళ్లీ తయారవుతాడు చూస్తుండు."



"రాంపండు గారు మళ్లీ ప్రేమలో పడ్డారా సర్? దీనితో ఇప్పటివరకూ ఏభైమూడు సార్లయింది సర్."

"మై గాడ్, ఏభై దగ్గర ఆపినా బాగుండేది. గుర్తుగా ఓ హాఫ్ సెంచరీ అనుకునేవాళ్లం. ఇప్పుడు ఏ అర్థనూటపదార్ల దగ్గరో అపుతాడు కాబోలు. వాడు వస్తే నేను లేనని..హలో రాంపండూ, మాటల్లోనే వచ్చేశావే.."

"విన్నానురా మిత్రద్రోహీ..నేను వస్తే లేనని చెప్పిద్దామని కదా నీ యెత్తు. ఎక్కడున్నా వెతికి పట్టుకోగలడురా వీడు. అయినా అదంతా పక్కన బెట్టు. నా ప్రేమకథ టీవీసీరియల్ కాదురా, ఏళ్లూపూళ్లూ సాగడానికి. ఇదే లాస్ట్ ఎపిసోడ్. నువ్వో ఉపకారం చేస్తే.."

"అదేమిటో చెప్పేస్తే నేనూ, పాఠకులూ కూడా తెరిపిన పడతాం."

"చెప్తా. నేనూ ఊహా..అదేరా ఆ క్లబ్బులో అమ్మాయి పేరులే.. తన



డ్యూటీ అయిపోయాక కబుర్లు చెప్పుకుంటూ ఒకరి మనసులు మరొకరికి ఇచ్చిపుచ్చుకున్నామా..? మీ ఇంటికి వస్తూంటే నా మనసులో ఒక అనుమానం వచ్చింది. ఇలాటి సంఘటన ఇంతకు క్రితమే జరిగిందా అని. బహుశా పూర్వజన్మ వృత్తాంతమేమో నని అనుకుంటూండగా.."అని రాంపండు చెప్తూ ఉండగానే -

"నీ బొంద పూర్వజన్మా లేదు, పరజన్మా లేదు. ఆ పెసరట్ల సుబ్బి ప్రేమలో పడ్డావు కదరా నువ్వు. అదీ ఇలాటిదేగా. అక్కడ తిండి, ఇక్కడ తాగుడు. అమ్మాయిల లెవెల్‌లో తేడా లేదు. అయినా సుబ్బిని ఎలా మర్చిపోయావురా? దాని కోసమే నేను నేను కాదనీ, ఆ పుస్తకాలు రాసే ఆవిడ..పేరేమిటి చెప్మా..ఆ..కల్పనారాణి. నేనే ఆ కల్పనారాణి అని మీ బాబయ్య దగ్గర అబద్ధం చెప్పడం. అనలెలా మర్చి..'' అని విరుచుకుపడ్డాడు అనంత్.

"ఊరికే డైలాగులు అప్పజెప్పకు. నేను మర్చిపోయానని చెప్పానా? అదంతా గుర్తుకు వచ్చిందని చెప్పబోతున్నాను. అందుకే మళ్లీ నిన్ను కల్పనారాణి వేషం కట్టమంటున్నాను. మా బాబయ్య దగ్గరి కెళ్లి.."

ఆ పైన రాంపండు ఏం చెప్పాడో అనంత్ వినిపించుకోలేదు. అప్పటికే వణుకుతున్నాడు. "నో, నో" అంటున్నాడు.

ఇక రాంవండు వివిధ ఉపాయాలు మొదలుపెట్టాడు -

"అనంతూ, మనం ఇద్దరం ఒకే స్కూలులో చదువుకున్నాం."

"అది నా పొరబాటు కాదు, మా నాన్నది. నీలాటివాడు అదే స్కూలులో చేరతాడని ఊహించలేకపోయాడు."

"పదిహేనేళ్లుగా నేను నీ ఫ్రెండుని."

"అదిమాత్రం నా పొరబాటే! ఆ పాపానికే జన్మంతా అనుభవిస్తున్నాను."

అది దొరకబుచ్చుకున్నాడు రాంపండు - "ఒరేయ్, నీ జన్మ ఇంకా పూర్తికాలేదు. అందువల్ల నాకు సాయం చేయకతప్పదు."

అనంత్ ఓడిపోయినట్టు తలవాల్చేశాడు - "అయితే ఏం చేయాలంటావ్?"

"సింపుల్. నీ నవల..అదే కల్పనారాణి నవల ఒకటి మార్కెట్లోకి కొత్తగా వచ్చింది. ఒకటి కొని కాంప్లిమెంటరీగా మా బాబాయ్‌కి పంపు. ఆయన కల్పనారాణి నవలలంటే పిచ్చికదా! పైగా నువ్వే కల్పనారాణి అని ఇదివరకు పరిచయం చేశాం. దెబ్బకి గుమ్మై పోతాడు. లంచ్‌కి పిలుస్తాడు. శుబ్భరంగా కడుపునిండా తిని, ఆ తర్వాత మీ రాంపండు ఫలానా ఊహ అనే అమ్మాయిని ప్రేమిస్తున్నాడు. మీరు ఆశీర్వదించేయండి. అని చెప్పు."

"సుబ్బి విషయంలో ఇదే జరిగింది. కల్పనారాణి నవలలు చదివి, ఆయన వంటావిడను పెళ్లి చేసుకుని నీ నోట్లో కరక్కాయ కొట్టాడు. ఇప్పుడెవరిని చేసుకుంటానంటాడో?"

"ఎవరినీ చేసుకోనివ్వదులే ఆ వంటావిడ..అదే మా కొత్త పిన్ని..! ఇదివరకు ఇలా బార్‌లో అమ్మాయిని పెళ్లి చేసుకుంటానంటే కర్ర పట్టుకునేవాడు. ఇప్పుడు కల్పనారాణి నవలల ప్రభావం వల్ల సులభంగా ఒప్పుకుంటాడు. పైగా సాక్షాత్తూ నువ్వు..అంటే కల్పనారాణివి... రికమెండు చేసినప్పుడు..! ఆయన అనుమతితో చేసుకుంటే నెలనెలా కాస్త డబ్బు ఇస్తాడురా. ఈ ప్రైవేటు మాష్టారి ఉద్యోగాలు చేయలేక ఛస్తున్నానుకో!" అని గొల్లుమన్నాడు రాంపండు.

ఆ బాధ చూడలేక అనంత్ సరేనన్నాడు. కల్పనారాణి కొత్తపుస్తకం కొని చచ్చేట్లా చదివి దాన్ని 'కల్పనారాణి' పేరుతో ఆటోగ్రాఫ్ చేసి రాంపండు బాబయ్య గారయిన సింహాద్రి గారికి పంపాడు. అనుకున్నట్టే ఆయన వద్దనుంచి మూడోరోజుకే

పిలుపు వచ్చింది. అనంత్‌ను చూడగానే సింహాద్రి గారు దండకం మొదలుపెట్టారు.

"మీ కొత్తపుస్తకం 'లోకాన్ని ఎదిరించిన లలిత' మీరు పంపేనాటికే మూడుసార్లు చదివాను. అయినా మీరు ఎంతో ఆదరంతో ఫ్రీ కాపీ పంపితే మళ్లీ చదవకుండా ఉంటానా? అసలు మీ పుస్తకాలు లోకం పట్ల నా దృష్టినే మార్చేశాయనుకోండి. అంత స్ట్రిక్టుగా ఉండేవాణ్ని!? ఇప్పుడు జనం పట్ల ప్రేమ, వాత్సల్యం, క్షమ ఉట్టిపడుతున్నాయనుకోండి."

అందివచ్చిన అవకాశాన్ని అనంత్ వదలదలచుకోలేదు. "ఆ జనంలో రాంపండు కూడా ఉన్నాడా?" అన్నాడు చటున.

బ్రేకు వేసినట్టు ఆగిపోయాడు సింహాద్రిగారు. "వాడా?" అన్నాడు. కాస్త ఆలోచించాడు. "ఒకే వాడూను..వాడు మాత్రం..సరే వాణ్నీ.. కానీయండి. వాణ్ని కూడా క్షమిద్దాం...మీ అంతటివాళ్లు రికమెండ్ చేశాక.."అని గుండె చేత్తో పట్టుకుని "సరే..ఏం చేస్తాం?" అని నిట్టూర్చాడు.

"అయితే ప్రతీనెలా ఇంతని ఇస్తారా? పాపం ట్యూషన్ల మీద పెద్దగా రావటం లేదు. ఎంతైనా మీ వంశం వాడు.."అన్నాడు అనంత్ ఆదుర్దాగా.

"సరే, ఇద్దాం. ఇదివరకు ఇచ్చేవాణ్నిగా.." అన్నాడు ఆయన ఇంకేమీ అనలేక.

"ఇదివరకంటే వేరు..ఇప్పుడు తను పెళ్లి చేసుకోబోతున్నాడు. ఖర్చులు పెరుగుతాయి."అన్నాడు అనంత్ కోర్కెల నిచ్చెనలో పై మెట్టు ఎక్కుతూ.

"పెళ్లా? ఎవరా అమ్మాయి?" అడిగాడు బాబాయ్.

"హోటల్లో పనిచేస్తుంది."

అంతలావు సింహాద్రి గారూ ఉలిక్కిపడి లేచాడు. "నిజమా? మా రాంపండులో ఇంత మంచి లక్షణం ఉందని నాకెప్పుడూ తెలీదు. అసలు అనుమానం కూడా లేదు. పద్దెనిమిది నెలలుగా ఒకే అమ్మాయిని ప్రేమిస్తున్నాడంటే గ్రేట్! మీకు గుర్తుందా ఈ హోటల్ అమ్మాయి గురించే కదా వాడు మిమ్మల్ని పరిచయం చేయడం, మీ స్నేహభాగ్యం నాకు కలగడం.." పెద్దాయన ఫ్లాష్‌బ్యాక్‌లోకి వెళ్లిపోవడం చూసి అనంత్ కంగారు పడ్డాడు. ఆ హోటల్ అమ్మాయి, ఈ హోటల్ అమ్మాయికి మధ్య చాలా మంది ఉన్నారని చెప్పాల్సి వచ్చింది.

అనంత్ ఇంటికి వచ్చిన కాసేపటికే రాంపండు



వచ్చిపడ్డాడు. 'ఏమయిందిరా?' అంటూ.

'అలవెన్సు ఓకే కానీ పెళ్లి విషయంలోనే మొహం మాడ్చుకున్నాడు.'

'నువ్వు సరిగా అడిగివుండవు.'

'పోనీ కదాని సాయం చేయబోతే ఇలాగే ఉంటుంది. నీ పెళ్లికి ఆయన రాడు ఫో.' అని కసురుకున్నాడు అనంత్.

'ఆయన వచ్చేదేముంది నా బొంద! పెళ్లి అయిపోతేనూ' అన్నాడు రాంపండు ఆముదం తాగినవాడిలా మొహం పెట్టి.

తను బతికివుండగా రాంపండు పెళ్లి వార్త వింటాననే ఆశ పెట్టుకోని పాతకుల్లా అనంత్ ఉలిక్కిపడ్డాడు.

ఐదు నిమిషాల్లో కథంతా తెలిసింది. రాంపండు తన బాబయ్య గురించి ఊహకు చెప్పేడట. 'అయితే నన్ను తక్షణం గుళ్లో పెళ్లి చేసుకుని మీ బాబయ్య దగ్గరకి తీసుకెళ్లి చూపించాలి. లేకపోతే నా మీద ప్రేమ లేనట్టే' అని పట్టుబట్టిందట ఆ అమ్మాయి. గత్యంతరం లేక ఎవరికీ చెప్పా పెట్టకుండా పెళ్లి చేసుకోవలసి వచ్చిందట.

ఇందరు అమ్మాయిలను ప్రేమిస్తే అదే గతి! అని అన్నా అనంత్ స్నేహితుడి దుస్థితి చూసి జాలి పడ్డాడు. అతని అభ్యర్థన మన్నించి వాళ్ల బాబయ్య దగ్గరకి వెళ్లి ఆయన కోపాన్ని చల్లార్చడానికి ప్రయత్నిస్తానని హామీ ఇచ్చాడు.

రాంపండు వెంటనే ఎగిరి గంతేసి బయట వెయిట్ చేస్తున్న భార్యను పిలిచి అనంత్‌ను పరిచయం చేశాడు.

చూడబోతే హోటల్ అమ్మాయి చౌకబారుగా ఏమీ లేదు. మర్యాదస్తురాలిగా, చదువుకున్నదానిలా ఉంది. 'చెప్తేగానీ ఫలానా అని తెలియదు. అనవసరంగా చెప్పాం. ' అన్నాడు అనంత్.

'చూడబోతే డబ్బున్నదానిలా వుంది. నా డబ్బెందుకు, అని అలవెన్సు పెంచకపోగా కట్ చేసేస్తాడు కూడా' అన్నాడు రాంపండు.

కాస్సేపటిలో అనంత్ సింహాద్రి గారి హాల్లో సతీసమేతంగా రాంపండు వరండాలో కాచుకున్నాడు. భార్య ఏదైనా మాట్లాడబోయినా కసురుకుంటున్నాడు.

సింహాద్రిగారి టీపాయ్ మీద 'లోకాన్ని ఎదిరించిన లలిత' పుస్తకం సగం తెరిచివుంది. ఆయన వచ్చేలోపున అనంత్ ఓ పేరా చదివేడు - లలిత జమీందారు భుజంగరావుని నిలదీస్తోంది -'ప్రేమకెదురు నిలబడి సూర్యుడు ఉదయించలేడు, సముద్రం పొంగలేదు, చుక్కలు మెరవలేవు. జమీందార్, నువ్వు మానవమాత్రుడివి. మా ఇద్దరిమధ్య ప్రేమ పుట్టాలని రాసివుంటే విధి నెదిరించడానికి నీవెవరివి?'

'హలో అనంత్ గారూ, మళ్లీ వచ్చారే! ఇవాళ రెండుసార్లు మీ దర్శనం. మా అదృష్టం.." అంటూ సింహాద్రిగారు హాల్లోకి వచ్చారు.

"రావలసివచ్చింది. మీ రాంపండు నిర్వాకం వల్ల. పాపం.."అంటూ పరిస్థితి క్లుప్తంగా చెప్పాడు అనంత్.

ముసలాయనకి ఒళ్లు మండింది. అనంత్ కల్పనారాణి కాక మామూలు అనంతే అయివుంటే తన్ని తగిలేసేవాడు. ముక్తాయింపుగా అనంత్ తను అప్పుడే చదివిన ముక్కలు



వల్లించాడు, గుర్తున్నంతవరకు. .

"సార్, మనం మానవమాత్రులం. వాళ్లిద్దరి మధ్య ప్రేమ చిగురించాలని రాసిపెట్టివుంటే విధి నెదిరించడానికి మనం ఎవరం? ప్రేమ నెదిరిస్తే సూర్యగ్రహణాలు జరగవు. నక్షత్రాలు రాలిపోవు...చంద్రుడేమో.."

"ఆగండి. అనంత్. నాకు గుర్తొచ్చింది. మీరు 'లోకాన్ని ఎదిరించిన లలిత'లో డైలాగులు చెబుతున్నారు. నా వీక్ పాయింటు పట్టేశారు మీరు. కానీ నేను జమీందారు భుజంగంలాటివాణ్ని కానండోయ్. నాకూ ప్రేమంటే తెలుసు. అందుకే వంటలక్కను పెళ్లాడడానికి కూడా వెరవలేదు. రేపే రాంపండుని పంపండి. ఆశీర్వదిస్తాను." అన్నాడు సింహాద్రి గారు.

"రేపటిదాకా ఆగనక్కరలేదు. మీ వంశాకురం వరండాలోనే వెయిట్ చేస్తున్నాడు. మీ మధ్య నేనెందుకు? వస్తా"అంటూ అనంత్ వరండాలో రాంపండుకి షేక్‌హాండ్ ఇచ్చేసి పరుగు, పరుగున ఇల్లు చేరాడు. ఇంకాస్సేపు ఉంటే రాంపండు ఇంకేం పని చెబుతాడోనన్న భయంతో.

తెల్లారి లేచేసరికి అచలపతి కబురు మోసుకొచ్చాడు - రాంపండు వెయిట్ చేస్తున్నాడని. వచ్చిచూస్తే ఎప్పట్లాగానే ఏడుపు మొహం.

"శుభమాని పెళ్లి చేయించి, మీ బాబయ్యను చల్లార్చిన తర్వాత కూడా ఈ ఏడుపు ఏమిట్రా? నీ అంతటి జన్మదరిద్రుడిని ఎప్పుడూ చూడ లేదు."అన్నాడు అనంత్ విసుగ్గా.

"వినాయకుడి పెళ్లికి అన్నీ విఘ్నాలే అన్నారు. నాకు పెళ్లి తర్వాత కూడా విఘ్నాలే! " అన్నాడు రాంపండు పళ్లు గిట్టకరిచి.

"విషయం చెప్పి ఏడు. లేదా ఏడ్చి విషయం చెప్పు."అన్నాడు అనంత్ చికాకు పెరుగుతూండగా.

జరిగినదిది - రాంపండూ, ఊహా హాలులోకి వెళ్లారు. సింహాద్రిగారు అనంత్‌కు మాట ఇచ్చిన ప్రకారం వాళ్లను ఆశీర్వదించడానికి అక్షింతలు తెమ్మన్నాడు. ఆయన కాళ్లకు నమస్కారం పెట్టడానికి వంగబోతున్న ఊహకు టీపాయ్ మీద పుస్తకం కనబడింది.

"లోకాన్ని ఎదిరించిన లలిత' పుస్తకం చదివేరా? అంకుల్?" అంది ఊహ.

"నాలుగుసార్లు."అన్నాడు ఆయన హుషారుగా.

'చాలా సంతోషంగా ఉంది.' అంది ఊహ.

"ఎందుకు? నీక్కూడా కల్పనారాణి నవలలు ఇష్టమా?" అడిగాడు సింహాద్రి కుతూహలంగా.

ఊహ పగలబడి నవ్వింది. "నా రచనలు నాకు ఇష్టం కాకపోవడమేం?" అంది.

అక్కడున్న అందరికీ మతిపోయింది.

ఇక్కడదాకా విన్న అనంత్‌కే మతిపోయింది. 'ఆవిడే కల్పనారాణి అయితే మరి క్లబ్బులో ఆ ఉద్యోగం దేనికి?" అడిగాడు.

'హోటల్ వాతావరణంతో కొత్తనవల రాయబోతోందట. దానికి మెటీరియల్ గురించి ఆ ఉద్యోగం చేస్తోందట. బీదదాని వేషంలో ఉన్నా నేను తనని ప్రేమించినందుకు ముగ్దురాలయి పోయింది. వెంటనే గుళ్లో పెళ్లి చేసుకోమని అగ్నిపరీక్ష పెట్టింది. నేను దాంట్లో నెగ్గడంతో ఆనందంతో తలమునకలయి పోతోంది. హనీమూన్ టైములో ఈ విషయం చెప్పి నన్ను సర్‌ప్రయిజ్ చేద్దామనుకుందిట".

'మరింకేం, హేపీ ఎండింగేగా?"

"నీ బొంద హేపీ. ఊహ ఆ మాట అనగానే మా బాబయ్య మండిపడ్డాడు. కల్పనారాణి కలం పేరుతో రాసే ఆయన నాకు బాగా తెలుసు. నువ్వు బోగస్. అసలు హోటల్ ఉద్యోగం కూడా బోగస్సేమో! అలగాజనానికి అలగా బుద్ధులు ఎక్కడ పోతాయ్? అన్నాడు."

"ఊహ ఊరుకుందా?" అనంత్ అడిగాడు.

"ఎందుకూరుకుంటుంది? పబ్లిషర్ల దగ్గర్నుంచి ఋజువులు చూపిస్తుందంట. తర్వాత పరువునష్టం దావా వేస్తానంటోంది."

"అమ్మో! ఎందుకొచ్చిన గొడవ, నేనే ఆ వేషం కట్టేశానని చెప్పేస్తా."

'ఉండరా త్యాగమూర్తీ, నిదానించి ఆలోచించు. ముందు మా బాబయ్యకు కోపం వస్తుంది. మనం ఇద్దరం కలిసి తనను ఫూల్ చేసామని మండిపడతాడు. నువ్వు దొర్కుండా పోతావనుకో .. నా అలవెన్సు కట్...అదీ ఫరవాలేదు. అనుకోకుండా డబ్బున్నమ్మాయి నా భార్య అయింది.

కానీ ఆసలు గొడవ ఎక్కడ వస్తుందంటే కల్పనారాణి పేరు ఎక్కడ, ఎందుకు ఉపయోగించవలసి వచ్చిందని ఊహ అడిగితే నేను ఇదివరకు సుబ్బిని ప్రేమించిన విషయం బయటకు వస్తుంది. దాంతో నేను ఫట్! అసలు ఊహ నన్ను ప్రేమించిన దెందుకో తెలుసా? లోకంలో ఇప్పటివరకు నేను ఎవర్నీ ప్రేమించలేదని నేను చెప్పడం వల్ల, దాన్ని తను నమ్మడం వల్ల!" ఊపిరి పీల్చుకోవడానికి ఆగాడు రాంపండు.

"వార్నీ ఇంత అబద్ధమా!? నాకు తెలిసి నీ లవర్స్ సంఖ్య ఆఫ్ సెంచరీ దాటి ఆర్నెల్లయింది. " అని తెల్లబోయాడు అనంత్.

"వెధవ లెక్కలూ నువ్వూనూ. అదంతా ప్రేమ కాదురా అంటే వినిపించుకోవు గదా! ఇంతకీ నేను గట్టెక్కే మార్గం చూడు. ఇపుడు నా దారేమిటి?"

"గోదారే!"

"థాంక్స్‌రా, గొప్ప ఐడియా. అదీ ప్రాసతో.." అన్నాడు రాంపండు కసిగా.

***

మర్నాడు పొద్దున్నే ఫోన్. రాంపండు నుండి.

"అనంత్. అనుకున్నట్టే జరిగింది. ఊహ ఇచ్చిన ఋజువులు చూసి మా బాబయ్య కన్విన్స్ అయ్యాడు. తనే కల్పనారాణి అని ఒప్పుకున్నాడు. వాళ్లిద్దరి మధ్యా సంధి కుదిరింది."

"వెరీగుడ్"

"అప్పుడే గుడ్డెట్టకు. మా బాబాయ్ నన్ను పిలిచి జన్మలో తనతో మాట్లాడద్దన్నాడు. మనిద్దరం కలిసి తనను వెర్రివెధవను చేసినందుకు కోపంగా ఉందన్నాడు. నా అలవెన్సు కట్ చేసిన ప్రకటన జనాంతికంగా చేశాడు."

"పాపం. ఐ యామ్ సారీ."

'కంగారు పడకు. ఆ సారీ నీకే ఉపయోగించుకో. ఆయన కొద్దిసేపట్లో మీ ఇంటికి వస్తున్నాడు. నువ్వే కల్పనారాణి అని ఎందుకు అబద్ధం చెప్పావో సంజాయిషీ అడుగుతాడట."

"చచ్చాం."



"చావకు. ఇంకో విజిటర్ కూడా రాబోతోంది."

"ఎవరు?'.

"ఊహ! తన పేరు ఎందుకుపయోగించుకున్నావని నిన్ను సంజాయిషీ అడగబోతోంది."

అనంత్‌కి నోట మాట రాలేదు.

రాంపండు విచారం వ్యక్తపరిచాడు - "సారీరా, వచ్చి తమాషా చూద్దామంటే నాకో అర్జంటు పని పడింది. తర్వాతైనా వివరంగా చెప్పు - నువ్వు ఇద్దర్నీ ఎలా హేండిల్ చేశావో, వాళ్లేమేం తిట్లు తిట్టారో.."

విసుగుపుట్టి అనంత్ ఫోన్ పెట్టేశాడు. ఆ తరువాత అనంత్‌కి, అచలపతికి జరిగిన అత్యవసర సమావేశంలో అనంత్ బొంబాయి పారిపోవాలని, పరిస్థితి చక్కబడ్డాకనే తిరిగి రావాలనీ నిర్ణయించబడింది. బొంబాయి ట్రయిన్ టైము అయ్యేదాకా క్లబ్బులో దాక్కుంటానన్నాడు అనంత్. శరవేగంతో తయారయి, ఇంట్లోంచి పారిపోయాడు.

బొంబాయిలో వారం రోజులుండేసరికి మొహం మొత్తింది అనంత్‌కి. పైగా ఇంకో ఆలోచన ఒకటి అతన్ని తినేసింది. అసలు తప్పంతా రాంపండు గాడిది. చీటికీ, మాటికీ ప్రేమించడం, తన చేత అబద్దాలు ఆడించడం వాడివంతు, కాందిశీకుల్లా ఊరొదలి పారిపోవడం తన వంతా? నాన్సెన్స్! వెళ్లి మొహాన్నే అడిగేస్తే సరి అనుకుని ఊరొచ్చి పడ్డాడు.

ఊరికి వస్తూనే స్టేషన్నుంచే రాంపండు ఇంటికి వెళ్లాడు. తలుపు కొడితే తీసినది - సింహాద్రి గారు! ఇద్దరి మధ్యా సయోధ్య ఎలా కుదిరిందాని అనంత్ తెల్లబోతే, అనంత్‌ను చూసి సింహాద్రిగారు తెల్లబోవడమే కాదు, బెదిరిపోయాడు కూడా. 'రాంపండు ఉన్నాడా?' అని అనంత్ అడిగేలోపునే హడావుడిగా ధడాలున తలుపు మూసేశాడు.

అనంత్‌కి ఏమీ అర్థం కాలేదు. తనతో మాట్లాడాలన్న పెద్దమనిషి ఏమీ మాట్లాడక పోవడమేమిటి? పైగా రాంపండు ఇంటికి రాకపోకలేమిటి? ఆలోచిస్తూ వస్తూండగానే వీధి మొగలో రాంపండు ఎదురయ్యాడు.

"ఏరోయ్ కనబడ్డం మానేశావ్? ఊరెళ్లావుట." అంటూ పలకరించాడు.

"హుషారుగా కనబడుతున్నావ్. నీ ప్రాబ్లెమ్సన్నీ సాల్వ్ అయిపోయాయా?' అని అడిగాడు అనంత్.

"ఎప్పుడో..! మన అచలపతి లేడూ! రెండు నిమిషాలలో సాల్వ్ చేసి అవతల పడేశాడు. ఇప్పుడు మా బాబాయ్, ఊహ్ బెస్ట్ ఫ్రెండ్సు తెలుసా? నాల్రోజులకోసారి వచ్చి సాహిత్యం గురించి కబుర్లు చెప్పి పోతూవుంటాడు..."

"ఇవాళా ఆ పనిమీదే వచ్చివుంటాడు. ప్రస్తుతం మీ ఇంట్లో ఉన్నాడు. అవునుగానీ, మీ బాబాయ్‌కేమైనా పిచ్చేమిట్రా? నన్ను చూసి అలా హడిలిపోయాడేమిటి?"

రాంపండు హాయిగా నవ్వాడు. హడిలిపోడూ, పిచ్చాణ్ని చూస్తే ఎవరికైనా భయమే కదా!"

"పిచ్చెవరికి?" అయోమయంగా అడిగాడు అనంత్.

"నీకే, అందుకే నువ్వే కల్పనారాణివని మా అందరితోనూ,.. ముఖ్యంగా నాతో చెప్పావు. నేను నమ్మాను. అదే మా బాబాయ్‌తో చెప్పాను..."

'ఇదెక్కడ అన్యాయంరా, నేనెక్కడ.."

"అబ్బ, ఉండరా, అచలపతి ఐడియారా ఇది. నీకు హెల్యూసినేషన్స్ జాస్తి అని చెప్పమన్నాడు. స్క్రూ కాస్త లూజనమన్నాడు. బాబాయ్‌కి అలాగే చెప్పాను. మనిషి పైకి బాగానే కనబడతాడే అంటూ నా మాట నమ్మడానికి సందేహించాడు. అచలపతికి చెప్తే శాండో షాలిని నాన్నగార్ని అడగమన్నాడు. వాళ్ల అబ్బాయి బుజ్జిని బ్రిజ్ మీదనుండి కాలవలోకి తోసేశాడా లేదా అని అడగమన్నాడు. అడిగితే ఆయన అవును నిజమేనన్నాడు. ఇక బాబయ్య నమ్మక ఛస్తాడా?"

"..దుర్మార్గుడా, నువ్వు షాండో షాలినిని ప్రేమించబట్టే కదురా, నీకోసం నేను వాణ్ని కాలవలోకి తోసినది. నాకు పిచ్చాడని ముద్ర వేస్తారా? అసలు ఈ వెధవ ఐడియా ఇచ్చినందుకు అచలపతి ననాలి. నువ్వు మాత్రం..ఒరే శాపం ఇస్తున్నా కాసుకో! నీ సంసారజీవితం మాత్రం సజావుగా సాగుతుందనుకుంటున్నావా? నా ఉసురు పోసుకుంటావొరే" అనంత్ రొప్పుతున్నాడు.

(రాంపండు వైవాహిక జీవితం ఎలా సాగిందో
కొన్నాళ్లు పోయిన తర్వాత తెలుసుకుందాం.
ప్రస్తుతానికి సెలవ్!)

**-ఎమ్బీయస్ ప్రసాద్**

**(పిజి ఉడ్‌హౌస్ రాసిన 'బింగో అండ్ ది లిటిల్ ఉమన్', 'ఆల్ ఈజ్ వెల్' కథల ఆధారంగా)**

# ఒక రాగసుధ...
# ఒకే ఒక స్వరస్రవంతి...
# ఏకైక గానవాహిని - లతా!!!



**అది స్వరం కాదు... భారతీయుల పాలిట వరం. అది గాత్రం కాదు... సంగీత సరస్వతి తన ప్రతిభను రసజ్ఞులకు అందించడానికి పదే అస్త్రం. ఆ గళం ఒక ప్రాంతానికి సంబంధించినదే అయినా ఆమెను తమ జాతీయ గాయకురాలిగా, మేలురకం జాతి గాయకురాలిగా భారతీయులు గర్వంగా చెప్పుకుంటారు. ఆ కంఠం గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డ్స్‌లోకెక్కింది. ఆ రికార్డ్స్‌లోనున్న వారందరి గొప్పదనాన్ని ప్రపంచంలో అందరూ చవిచూసేరా అనే ప్రశ్న వస్తే ఎవరి విషయంలోనైనా భేదాభిప్రాయం ఉంటుందేమో గాని ఆమె కంఠం విషయంలో 'కంఠాపథంగా' ఎవరికీ ఎటువంటి అభిప్రాయభేదం ఉండదు. ఆమెయే లతామంగేష్కర్. ఒక రాగసుధ.... ఒకే ఒక స్వర స్రవంతి... ఏకైక గానవాహిని...!**

"లతా లేకుంటే 'గైడ్' చిత్రం ద్వారా తిరిగి నేనా ఉన్నత శిఖరాల్ని అందుకొని ఉండేవాణ్ని కానేమో!?" అన్నారు స్వర్గీయ యస్.డి. బర్మన్.

"భగవంతుడు మా సంగీత దర్శకులకిచ్చిన వరం లత! ఆమె కంఠాన్ని నమ్ముకునే మేం ఎన్నో ప్రయోగాలు చేస్తున్నాం. ఇంకా క్లిష్టమైన ప్రయోగాలు చేస్తాం. ఆమె స్వర సంపదకు అవధులు లేవు" అన్నారు అనిల్ బిశ్వాస్.

"లతా లతాయే" అన్నారు నౌషాద్.

ఇలా పేర్చుకుంటూ పోతే లత గురించి చెప్పకుండా ఉండలేని సంగీత దర్శకుణ్ని పట్టుకోవటం అసాధ్యమైన పనుల్లో ఒకటవుతుంది.

ఆమె ముప్పైవేలకు పైగా పాటలు పాడి ఉండవచ్చు. ఎన్నో పాటలు హిట్ అయిఉండవచ్చు. ఫిలిం ఇండస్ట్రీలో ప్రవేశించి అరవై సంవత్సరాలు అయి ఉండవచ్చు. అయినా అన్ని వేల హిట్ గీతాల్ని ఎలా పాడగలిగింది? ఏ ఆత్మస్థైర్యం ఆమెనీనాడు భారతదేశపు అగ్రశ్రేణి గాయకురాళ్ళలో మొట్టమొదటి స్థానానికి అర్హురాల్ని చేసింది? ఆమె పాటల వెనుకనున్న ప్రతిభా 'పాట'వాలు ఎటువంటివి?

1929 సెప్టెంబరు 20 శనివారం రాత్రి ఇండూర్‌లో దీనానాథ్ మంగేష్కర్ దంపతుల ప్రథమ సంతానంగా జన్మించింది లత. మరాఠీ రంగస్థల నటుడిగా, గాయకుడిగా దీనానాథ్ అప్పటికే లబ్ధప్రతిష్టుడు. ఆయన ముఖకవళికలు, కంఠస్వరం ఎక్కువ స్త్రీ పాత్రలకు ఉపయోగపడేవి. 'సాంగ్లీ'లో పదమూడు గదులు గల రెండంతస్థుల మేడ, ఖాందేశ్‌లో ఇరవైనాలుగెకరాల స్థలం, గోవాలో జీడి, పనస, మామిడి తోటలు, పూనాలో ఓ చిన్న ఇల్లుతో వైభవంగా ఉండేది వాతావరణం.

అయిదేళ్ళకే లత 'స్వర కిరణాలు' నలుదిక్కుల ప్రసరించ నారంభించాయి. దీనానాథ్ శిష్యులలో ఒకతను పాడుతున్నప్పుడు పడిన అపస్వరాన్ని సరిదిద్దింది లతా. ఓ రోజున అది దీనానాథ్ చెవినపడింది. మర్నాడు ఉదయాన్నే నాలుగు గంటలకి లతను లేపి చేతిలో 'తాన్‌పురా' (తంబూర) పెట్టి 'పూర్యధనశ్రీ' రాగాన్ని ఉపదేశించాడాయన. అది మొదలుకొని రోజూ క్రమం తప్పకుండా సంగీత సాధన సాగేది.

అనుకున్న స్వరం అనుకున్నట్టుగా రాకపోతే అది తన సంతృప్తిమేరకు వచ్చే వరకు ఎన్ని సార్లయినా పాడించేవాడు దీనానాథ్.

దీనానాథ్ రోజూ ఇచ్చిన ఆ రెండుగంటల శిక్షణేకాదు క్రమశిక్షణ కూడా లత మనో వికాసానికి తోడ్పడింది. చిన్నతనంలో ఒకే ఒకసారి చెల్లెని నాణాన్ని కిరాణా వర్తకునికి అంటగట్టి తనకు కావలసిన సరుకులు తెచ్చేసుకుంది లత. ఆ సంగతి విన్న దీనానాథ్ లతను తీవ్రంగా చివాట్లెయ్యడమే కాకుండా ఆమెను తీసుకువెళ్లి ఆ కిరాణా వర్తకునికి క్షమాపణ చెప్పించాడు కూడా!

లత ఎంతో సున్నితమైన మనసుగల వ్యక్తి. ఎక్కువగా తమ్ముణ్ని, చెల్లెళ్ళనీ ఆడించటంలోనూ, ఇంటిని సర్దడంలోనూ కాలం వెళ్ళబుచ్చేది. ఓ వినాయక చవితినాడు పూజకోసమని వంటిల్లు సర్దబోతూవుంటే ప్రమాదవశాత్తూ ఓ ఎలుక ఆ హడావుడిలో చనిపోయింది. ఆ రోజంతా లతా కుములుతూనే ఉంది - "వినాయకచవితినాడు ఆయన వాహనమైన ఎలుకనే చంపేసిన పాపాత్మురాల్ని" అంటూ.

తమ్ముడన్నా, చెల్లెళ్ళన్నా లతకు ఎంతో ప్రేమ. ఒకనాడు చెల్లెలు ఆశాను తనతో కూడా స్కూలుకు తీసుకువెళ్ళింది లత. పిల్లల్ని తీసుకురావడానికి వీల్లేదంటూ వెనక్కి పంపేశారామెని. ఆనాడే లత ఒట్టేసుకుంది - ఇక చస్తే స్కూలు ముఖం చూడనని. అదేమాట ఈనాటివరకూ నిలబెట్టుకుందామె. అందుకే డిగ్రీల పరంగా ఆమె ఏమీ చదువుకోలేదు. విషయం తెలిసిన దీనానాథ్ లతా ఆత్మగౌరవాన్ని కాపాడదలిచాడు. ఆమెను ఎన్నడూ స్కూలుకి వెళ్లమని బలవంతపెట్టలేదు. తను ఊళ్ళోలేని ఓ రోజున లతను స్కూలుకు పంపడానికి తనభార్య ప్రయత్నించిందని తెలుసుకుని, కోపగించుకుని, అలిగి, భోజనం ముట్టనని కూచున్నాడు కూడా!

లతా పెద్దగా చదువుకోకపోయినా తన తమ్ముడు, చెల్లెళ్ళు ఎంతో చదువుకోవాలని ఎన్నో కలలు కన్నది. వారందరూ బారిష్టర్లు, డాక్టర్లు కావాలనుకున్నది. కానీ అందరూ సంగీతంలోనే స్థిరపడిపోయారు.

1935 తర్వాత దీనానాథ్ ఆర్థిక పరిస్థితి క్రమక్రమంగా క్షీణించడం మొదలుపెట్టింది. బల్వంత్ థియేటర్ కంపెనీలో అప్పటికే ఆయన అయిదులక్షల రూపాయల వాటాదారుడు. మిగిలిన వాటాదారులందరూ తమ దారులు తాము వెతుక్కుంటూ అప్పుల్ని ఈయన నెత్తికి రుద్దేసి తప్పుకున్నారు.

కళాకారుడిగా తన తపనను చంపుకోలేకపోయాడాయన. ఈ నష్టాల్ని పూడ్చడానికి 'బల్వంత్ పిక్చర్ కార్పొరేషన్‌ను స్థాపించి 'కృష్ణార్జునయుద్ధ' అనే సినిమాను తన మొదటి ప్రయత్నంగా తీసి మరింత నష్టపోయాడు. ఎన్నో లావాదేవీల్లో, దావాల్లో, లాలూచీలలో ఇరుక్కున్నాడు. ఒకసారి కోర్టు వారంటుని తప్పించుకోవడానికి తింటున్న అన్నాన్ని సగంలో వదిలేసి కూడా పరుగెత్తాడు పాపం!

అతని కున్న టాలెంట్‌కి, పేరుకి ఈ నష్టాన్ని ఎప్పుడో పూడ్చివుండేవాడు. కానీ మళ్ళీ మరికొంతమంది మిత్రుల ప్రోత్సాహంతో 1938లో తన కంపెనీని ఒక టూరింగ్ కంపెనీగా



మార్చి మహారాష్ట్ర అంతటా ప్రదర్శనలివ్వడం మొదలుపెట్టాడు.

ఆ సమయంలో అతనితో కూడా లత, చిన్న చెల్లి మీనా వెళ్ళేవారు. వాళ్ళిద్దరికీ పాడాలన్న ఉత్సాహం ఎంత ఉండేదంటే ప్రార్థనాగీతమైనా ఇమ్మని కాళ్ళావేళ్ళా పడేవారు.

ఓసారి మన్మాడ్‌లో 'సౌభద్ర' నాటకాన్ని ప్రదర్శిస్తున్నారు దీనానాథ్ బృందంవారు. నారద పాత్రధారి గైర్‌హాజర్. గత్యంతరం లేక ధైర్యంగా ఆ పాత్రను లతాయే పోషించింది. అప్పుడామెకు తొమ్మిదేళ్ళు. ఆరోజు ఆమె పాడిన 'భజనలు' ప్రేక్షకుల్ని ఉర్రూతలూగించాయి. ఆ నాటకంలో దీనానాథ్ అర్జునుడి పాత్ర ధరించాడు. తన కూతురి అభినయ విన్యాసాన్ని, గానమాధుర్యాన్ని, వాటికి లభించిన ప్రశంసల్ని చూసి కన్నీళ్ళాపుకోలేక పోయాడు. 'తన తర్వాత తన కుటుంబాన్ని లాక్కు రాగలదీమె ఒకర్తే' అని మొదటిసారి అనిపించిందాయనకా రోజు.

లత పదేళ్ళ ప్రాయంలో షోలాపూర్‌లో ఇంకొక ప్రదర్శన నిచ్చింది. ఆనాడు ఆమెకు లభించిన కరతాళధ్వనులు అమోఘం. కార్యక్రమం చివర్న తిరిగి లతా పాటలు కావాలన్నారు. అవేమీ తెలియని చిన్నారి లత అమ్మ ఒడిలో అప్పటికే గాఢనిద్రలో ఉంది.

కానీ ఇవేమీ దీనానాథ్ దురదృష్టాన్ని అడ్డుకోలేకపోయాయి. ఆస్తి అంతా హరించుకుపోగా కంపెనీని మూసెయ్యక తప్పలేదాయనకి. అన్నీ అమ్ముకొని పూనాలో గల చిన్న ఇంట్లోకి మారేరందరూ.

1941లో 'ఖజాంచీ' అనే చిత్రం విడుదలయింది. ఆ రోజుల్లో అదొక గొప్ప మ్యూజికల్ హిట్ చిత్రం. ఆ విజయోత్సాహాన్ని పురస్కరించుకుని 'ఖజాంచీ' పాటల పోటీని కూడా కొందరు నిర్వహించారు.

ఆ చిత్రంలోని సంగీతం లతను విపరీతంగా ఆకట్టుకుంది. ఆ చిత్రాన్ని ఆమె ఎన్నిసార్లు చూసిందో లెక్కలేదు. ఆ ఉత్సాహాన్ని అణుచుకోలేకే ఆ పోటీకి ఆమె తన పేరుని కూడా ఇచ్చేసింది తన తండ్రికి తెలియకుండా!

ప్రముఖ సంగీత దర్శకుడు గులామ్ హైదర్, నిర్మాత మాస్టర్ వినాయక్ ఆనాడు పోటీకి హాజరయినవారిలో ఉన్నారు. లతకు మొదటి బహుమతిగా 'దిల్‌రుబా' అనే వాద్యాన్ని బహూకరించారు ఆనాడు.

1942 ఏప్రిల్‌లో ఒకరోజు చెవినుండి ధారాపాతంగా రక్తం కారుతుంటే ఇంటికి చేరాడు దీనానాథ్. అలా ఎనిమిదిరోజులు మంచంమీదే ఉన్నాడాయన. జాతకాలలో ఆయనకున్న ప్రవేశంకొద్దీ తనింక ఎక్కువ రోజులు బతకనని గ్రహించుకున్నాడు. ఆరోజు లతాను పిలిచి 'ఆ మూలనున్న తంబూర, నా తలగడ కిందనున్న స్వరగ్రంథం, శ్రీ మంగేషీ దేవత ఆశీర్వాదాలు



తప్ప నేనింకేమీ నీకీయలేకపోతున్నాను' అంటూ అప్పగింతలు మొదలుపెట్టేడు. ఆ రాత్రే ఆయన పరిస్థితి విషమించింది. పూనాలోని 'సాసూన్' హాస్పిటల్లో చేర్పించారుగానీ మర్నాడు ఉదయం పదకొండున్నరకి మరణించాడు దీనానాథ్.

ఆ స్థితిలో దీనానాథ్ స్నేహితులలో ఒక్కరు కూడా సహాయానికి ముందుకు రాలేదు. అన్నీ లతా, ఆమె తల్లి శ్రీమతి దగ్గిరుండి చూసుకోవలసి వచ్చింది. మధ్యాహ్నం మూడున్నరకి హాస్పిటల్ నుంచి తీసుకువచ్చారు దీనానాథ్ మృతదేహాన్ని. ఆయన్ని కప్పివుంచిన వస్త్రం కూడా హాస్పిటల్ వారిదే. అవి యుద్ధం రోజులు... సాయంత్రంకల్లా లైట్లు ఆర్పేసి 'బ్లాక్ అవుట్' చేసేస్తారు. మూడున్నరకి తీసుకువచ్చిన మృతదేహానికి సాయంత్రం ఆరులోగా అంత్యక్రియలెలా జరిపించారో, ఎవరాదుకున్నారో కేవలం ఒక్క లత ఆత్మ విశ్వాసానికే తెలుసు. అప్పుడు సరిగ్గా లతకు పదమూడేళ్లు. ఇంట్లో గడవడం కష్టంగా ఉంది. ముగ్గురు చెల్లెళ్లు, తమ్ముడు, తను, తల్లి - ఇంతమందికి గడవాలి. దానికి తోడు తమ్ముడు హృదయ్‌నాథ్‌కి బోన్ టి.బి. వచ్చింది. ఆ పరిస్థితుల్లో లతకు ఉద్యోగం తప్ప మరోమార్గం లేకపోయింది.

మాస్టర్ వినాయక్‌గారి 'ప్రఫుల్లా ఫిల్మ్ కంపెనీ'లో నెలకు ఎనభైరూపాయల జీతం మీద చేరింది పదమూడేళ్ల లతా! ఆ కంపెనీ కొల్హాపూర్‌లో ఉండేది. కనుక లత కుటుంబం కొల్హాపూర్‌కు మారాల్సివచ్చింది. ఓ గరాజ్‌పైన కట్టిన మూడు గదుల ఇంట్లో అద్దెకు దిగింది పదమూడు గదుల ఇళ్ళలో గడిపిన లత కుటుంబం!

లతకు తను తీసిన ప్రతి చిత్రంలోనూ ఏదో ఒక వేషం ఇస్తూనే ఉండేవాడు మాస్టర్ వినాయక్. 'పెహలీ మంగళాగౌర్' (మరాఠీ) నుండి 'మందిర్' (హిందీ) వరకు ఆరేళ్లలో నాలుగు మరాఠీ, నాలుగు హిందీ చిత్రాల్లో నటించింది లత! 1943లో 'మజేబాల్' (మరాఠీ) అనే చిత్రంలో నటిస్తున్నప్పుడు లతతోపాటు ఆమె తమ్ముడు, చెల్లెళ్లు కూడా పాల్గొన్నారు. అనాధ బాలబాలికలు రోడ్డుమీద పాడుకుంటూ వెళ్లే సన్నివేశం అది. "మాస్టర్ వినాయక్ గురించి కాకుంటే ఇంకా సహజంగా నటించేసి ఉండేవాళ్ళమేమో అప్పుడు" అని అంటుంది లత ఆ రోజులు గుర్తొచ్చినప్పుడల్లా. ఆ రోజుల్లోనే 'కథకళి'లో లతను ట్యూషన్స్‌కు పంపించేవాడు మాస్టర్ వినాయక్. తర్వాత వినాయక్ తన కంపెనీని బొంబాయికి మార్చేశాడు.

ఆమె నటించిన 'చిముక్లా సంసార్', 'గజేభూ' (మరాఠీ) చిత్రాలలో లతకు పాడే అవకాశం కూడా వచ్చింది. ఆ రోజుల్లో లతకు సైగల్ అన్నా, నూర్జహాన్ అన్నా విపరీతమైన పిచ్చి. 'బడీమా' (హిందీ) చిత్రంలో నూర్జహాన్‌తో కలిసి నటించే అవకాశం వచ్చింది లతకు. ఈ చిత్రం పూర్తవడానికి సరిగ్గా సంవత్సరం పట్టింది. ఆ పన్నెండు నెలలూ లత నూర్జహాన్‌ను నీడలా వెన్నంటి ఉండేది. ఆమె ఎలా మాట్లాడుతుందో, ఎలా పాడుతుందో అన్నీ అలాగే అనుకరించేది లత. అందుకే లత తొలి రోజుల్లోని పాటల్లో నూర్జహాన్ కనిపిస్తుంది. 1947లోనే 'బడీమా' చిత్రం పూర్తయిపోయింది. నూర్జహాన్ పాకిస్థాన్ వెళ్ళిపోయింది. అదే సమయంలో మాస్టర్ వినాయక్ మరణించాడు.

లత జీవితం మళ్ళీ మొదటికొచ్చింది. స్టూడియోల చుట్టూ సంచారం... నిరాశ... నిస్పృహ... తిరిగి ప్రయత్నం... అయినా తన పట్టు విడువలేదు. పీలగా, చాయ తక్కువగా, మొఖం మీద అయిదో ఏట వచ్చి మంగేషీ దేవత అనుగ్రహంతో తగ్గిన స్ఫోటకం మచ్చలతో ఉండే లతకు ఎవరూ ఛాన్సు ఇచ్చేవారుకాదు.

ఆ సమయంలో... ఆరేళ్ళ క్రితం తనకు బహుమతినిచ్చిన గులామ్ హైదర్ కనిపించాడామెకు. శశిధర్ ముఖర్జీ తీస్తున్న 'షహీద్' చిత్రంలో పాడిస్తానని మర్నాడు లతను రమ్మన్నాడు. మర్నాడే లత వచ్చి బైట కూర్చొని ఉంటే లోపల మ్యూజిక్ కంపోజ్ చేస్తున్న గులామ్ హైదర్ లత సంగతే మర్చిపోయాడు. ఆకలి దహిస్తున్నా, ఎండ మాడుస్తున్నా అలాగే కూర్చుంది లతా. కదిలితే ఛాన్సు ఎక్కడ పోతుందోనని అస్సలు లేవలేదామె. మధ్యాహ్నం ఎప్పుడో అన్నీ అయిపోయాక గులామ్ హైదర్ బైటికివచ్చి లతను చూసి ద్రవించిపోయాడు. అప్పటికప్పుడు తీసుకువెళ్లి నిర్మాత శశిధర్‌కు పరిచయం చేశాడు. ఏదైనా పాడమన్నారామెను. 'జీనత్' చిత్రంలో నూర్జహాన్ పాడిన ఒక పాటను పాడింది లత. 'ఆమె కంఠం చిన్నగా, సన్నగా ఉంది. హీరోయిన్‌కి నప్పదు' అన్నాడు శశిధర్ ముఖర్జీ. గులామ్ హైదర్ ఆవేశం తారస్థాయినందుకుంది. "ఈమెను కాదనడం ఎంతో తెలివైన పని అని అనుకుంటున్నావేమో! చూస్తూ ఉండు - నిర్మాతలు, దర్శకులు ఈమె కాళ్ళ చుట్టూ మూగి



కిశోర్‌కుమార్, హేమంత్‌కుమార్‌లతో

ప్రాధేయపడే రోజు రాకపోదు" అంటూ లతను తీసుకొని బైటకి నడిచాడాయన.

అదే రోజు... మలాడ్‌లో ఉన్న బోంబే టాకీస్ స్టూడియోకు లతను తీసుకువెళ్ళాడు గులామ్ హైదర్. అక్కడికి వెళ్తుంటే లోకల్ ట్రైన్‌లోనే ఒక పాట కంపోజ్ చేసి తిరిగి పాడమన్నాడు లతను. ఆమె పాడుతుంటే తన సిగరెట్ టిన్‌మీద రిథమ్ కొట్టాడు కూడా! తిరిగి అదేపాట 'మజ్‌బూర్'లో ఉపయోగించినప్పుడు పాడిన లతాను, స్వరపరిచిన గులామ్ హైదర్‌ను ఆకాశానికెత్తేశారు ప్రేక్షకులు. ఆ చిత్రం తర్వాత గోల్డెన్ జూబ్లీ జరుపుకుంది కూడా.

ఎలాగయితేనేం లతా బతుకు దారినపడింది. ఇల్లు గడవడం ఎలాగనే సమస్య తీరింది. ఇంకా గుర్తింపు రావాలి... అదే ఆమెకు కావాలి... ఒకే రోజున మలాడ్, అంధేరీ, గోర్‌గావ్‌లలో రికార్డింగులు ఉండేవి. వాటిక్కూడా ఓ నిర్ణీతమైన సమయం ఉండేది కాదు. లతకు సరియైన వేళకు తిండీ తిప్పలు, ఆహారం, నిద్ర ఏమీ ఉండేవికావు. ఆమెను దాటుకుంటూనే స్టూడియో కార్లు వెళ్ళిపోయేవి. ఆమె మాత్రం లోకల్ ట్రైన్ ఎక్కి స్టూడియో, స్టేషన్... స్టేషన్..., స్టూడియో అంతే!

అలాంటి సమయంలో 'మహల్' చిత్రంలోని ఖేమ్‌చంద్ ప్రకాశ్ స్వరపరిచిన 'ఆయెగా ఆయెగా ఆయెగా ఆనేవాలా ఆయెగా' పాట విడుదలయి ఆల్‌టైమ్ రికార్డ్‌ని సృష్టించింది. పుష్పవృష్టి... కనక వర్షం...! గులామ్ హైదర్ మాటల్ని రుజువు చేస్తూ నిర్మాతలు, దర్శకులు ఆమె చుట్టూ మూగసాగేరు.

తన సంపాదనలో ఆమె కొన్న మొట్టమొదటి వస్తువు - ఇంట్లో అందరూ బట్టలు పెట్టుకోడానికి ఓ బీరువా! తనకు మాత్రం ఎప్పుడూ తెల్లని బట్టలే కొనుక్కునేదామె. కొన్నాళ్ళకు సంపాదన పెరిగాక పాదాలకు బంగారు పట్టీలు కొనుక్కుంది లత! ఆ రోజుల్లోనే లత ఓ పాటకు తీసుకునే పారితోషికం రెండువేల అయిదువందలు.

లతాకు షాపింగ్ అంటే ప్రాణం. హాండ్ కర్చీఫ్ నుంచి బంగారం వరకు ఆమెకు అక్కర్లేని వస్తువు లేదు - అది రోడ్‌సైడ్‌న దొరికినా సరే, పెద్ద షాపులో దొరికినా సరే! ఒకంతట రాజీ పడలేదామె ఎంపిక విషయంలో. ఒకే ఒక చీర కొనడానికి వందలకు వందలు చీరలు తీయించి చూసేదామె.

తనకు నచ్చలేదని ఒకసారి ఆశాభోంస్లే కొన్న కారుని తిరిగి పంపించేసింది డీలర్‌కు.

ఫిల్మ్ ఇండస్ట్రీలో జరిగే పార్టీలకు, ఫంక్షన్‌లకు దూరంగా ఉంటుంది లత! తన ఫ్రెండ్స్‌కి పార్టీ ఇవ్వాల్సివస్తే ఊరికి దూరంగా తీసుకునిపోయి మరీ ఇస్తుందామె. ఆమె మంచి సంభాషణా చతురురాలు. మిమిక్రీ ఆర్టిస్టు కూడా! ఎవరైనా - బోరుకొట్టే అతిథిగాని, నిర్మాతగాని ఎదురయితే తను ఎలా ప్రవర్తిస్తుందో, వారు తనతో ఎలా ప్రవర్తిస్తారో వంటి అంశాన్ని తీసుకొని వారి మేనరిజమ్స్‌ని పట్టుకొని పొట్ట చెక్కలయ్యేలా అనుకరించి చూపిస్తుంది లతా!

సంస్కృతం, మరాఠీ, పంజాబీ, బెంగాలీ, అస్సామీ, హిందీ, వ్రజ, అవధీ, భోజ్‌పురీ, గుజరాతీ, మైథిలీ, ఒరియా, నేపాలీ, కన్నడ, తెలుగు, సింహళ, ఉర్దూ, మార్వారీ, తమిళ, కొంకణి భాషలలో పాడిన లతామంగేష్కర్‌ను భారతప్రభుత్వం 1969లో 'పద్మభూషణ్'తో సత్కరించింది.

ఓసారి ఢిల్లీలో ప్రభుత్వ కార్యక్రమంలో 'ఏ మెరె వతన్‌కె లోగో' పాటను పాడినప్పుడు ఆమెను వేలాది జనులు చుట్టుముట్టారు. ఇంతలో ఒకరు అందర్నీ తోసుకువచ్చి ఆమెను పక్కకు తీసుకువెళ్ళి 'ఈయన మీతో మాట్లాడాలని చాలా చాలా సేపట్నించీ అనుకుంటున్నారు' అని ఒకర్ని చూపించారు. అంతవరకు లత గురించి ఎదురుచూస్తున్నది ఎవరో కాదు... అప్పటి భారత ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ.

'నిన్ను మళ్ళీ కలవాలనుందమ్మా! నా కంట నీరు తెప్పించావు' అని అన్నారాయన ఎంతో ఆప్యాయంగా.

మర్నాడే లతాకు ఆహ్వానం వచ్చింది - ప్రధాని ఇంట విందుకు రమ్మని! ఎందరో వచ్చారా సమావేశానికి. దూరంగా నిలబడి ఉన్న లతను చూసి తనను అభినందించడానికి వచ్చినవారినందర్నీ దాటుకొని వచ్చి చేయిపట్టుకొని తన ఇంట్లోకి తీసుకువెళ్లారు నెహ్రూ. తన కుమార్తె, నాటి ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీని, మనమడు రాజీవ్‌గాంధీని స్వయంగా పరిచయం చేసి, తన మనమడు నేర్చుకున్న లత పాటల్ని తిరిగి ఆమెకే వినిపించారాయన. ఆ ఆప్యాయతని, అభిమానాన్ని తన జీవితంలో ఓ మరపురాని అనుభూతిగా చెప్తుంది లత!

ఆమె గురించి ఎంత చెప్పినా, చెప్పుకున్నా దానికి కామాలే తప్ప ఫుల్‌స్టాపులుండవు. ఆమె పాటలలాగే ఆమె స్వరజీవితం గురించి కూడా తలచుకుంటూ, తరచుకుంటూ ముందుకు పోవలసిందే. అది ఒక స్రవంతి... దానికి మలుపులు, విరుపులేతప్ప...

అలుపులు, ఆపుదలలు ఉండవు.

— రాజా



చిత్రం: పేయింగ్ గెస్ట్
రచన: మజ్రూహ్ సుల్తాన్‌పూరి సంగీతం: యస్.డి.బర్మన్

చాంద్ ఫిర్ నిక్‌లా
మగర్ తుమ్ న ఆయే
జలా ఫిర్ మెరా దిల్ కరూఁ క్యా మైఁ హాయే (2) ॥చాంద్॥
యే రాత్ కెహ్‌తీ హై వొ దిన్ గయే తేరే
యే జాన్‌తా హై దిల్ కి తుమ్ నహిఁ మేరే (2)
ఖడీ హుఁ మైఁ ఫిర్ భీ నిగాహేఁ బిఛాయే
మైఁ క్యా కరూఁ హాయే కి తుమ్ యాదాయే ॥చాంద్॥
సులగ్‌తే సీనే సే ధువా సా ఉఠ్‌తా హై
లో అబ్ చలే ఆవో కి దమ్ ఘుట్‌తా హై (2)
జలా గయే తన్ కో బహారోఁ కె సాయే
మైఁ క్యా కరూఁ హాయే కి తుమ్ యాదాయే ॥చాంద్॥

చిత్రం: చోరీచోరీ
రచన: హస్రత్ సంగీతం: శంకర్‌జైకిషన్

రసిక్ బల్‌మా హాయే
దిల్ క్యోఁ లగాయా
తోసే దిల్ క్యోఁ లగాయా
జైసే రోగ్ లగాయా ॥రసిక్॥
జబ్ యాద్ ఆయె తిహారీ
సూరత్ వొ ప్యారీ ప్యారీ (2)
నేహా లగాకే హారీ ఆ ..............
తడ్‌పూఁ మైఁ గమ్ కీ మారీ ॥రసిక్॥
ఢూంఢే హై పాగల్ నైనా
పాయే న ఇక్ పల్ చైనా (2)
డస్‌తీ హై ఉజ్‌లీ రైనా ఆ ..............
కాసే కహూఁ మైఁ బైనా ॥రసిక్॥

శంకర్-జైకిషన్ స్కేల్‌లో యస్.డి.బర్మన్ ట్యూన్ చేశారా అని అనిపించేటంత దగ్గరగా ఉంటాయి. ఈ రెండు పాటలూ రెండింటిలోనూ నాయిక విరహమే ద్యోతకమవుతుంది. ఈ ట్యూన్‌పై ఆధారపడిన తెలుగుపాట - 'దేవుడున్నాడా?' (నిండు సంసారం - మాస్టర్ వేణు)లో శోకమే ఎక్కువ కనబడుతుంది.

చిత్రం: మహల్
రచన: నక్షబ్ సంగీతం: ఖేమ్‌చంద్‌ప్రకాష్

ఆవో యే జమానా ఛుప్ జా యే సితారే
ఆరామ్ సే హై దునియా బేకల్ హైఁ దిల్ కె మారే
ఐసే మెఁ కోయీ ఆహట్ ఇస్ తరహ ఆ రహీ హైఁ
జైసే కి చల్ రహా హో మన్ మే కోయీ హమారే
హమారా యే దిల్ ధడక్ రహా హై.... ఇస్ ఆస్ కే సహారే

ఆయెగా ఆయెగా ఆయెగా
ఆయెగా ఆనే వాలా ఆయెగా ఆయెగా ఆయెగా ॥ఆయెగా॥
దీపక్ బగైర్ కైసే పర్వానె జల్ రహే హైఁ (2)
కోయీ నహీఁ చలాతా ఔర్ తీర్ చల్ రహే హైఁ (2)
తడ్‌పేగా కోయీ కబ్ తక్ బేఆస్ బేసహారే (2)
లేకిన్ యె కెహ్ రహే హైఁ దిల్ కే మెరే ఇషారే ॥ఆయెగా॥
భట్‌కీ హుయీ జవానీ మంజిల్ కో ఢూంఢ్‌తీ హై (2)
మాఝీ బగైర్ నైయ్యా సాహిల్ కో ఢూంఢ్‌తీ హై (2)
క్యా జానె దిల్‌కీ కష్తీ కబ్ తక్ లగే కినారే (2)
లేకిన్ యె కెహ్ రహే హైఁ దిల్ కే మెరే ఇషారే ॥ఆయెగా॥

చిత్రం: లవ్ ఇన్ టోక్యో (1966)
రచన: హస్రత్‌జైపురి సంగీతం: శంకర్-జైకిషన్

సయోనారా సయోనారా
వాదా నిభావూంగీ సయోనారా
ఇఠ్ లాతీ ఔర్ బల్‌ఖాతీ
కల్ ఫిర్ ఆవూంగీ సయోనారా (2)
ఛోడ్ దె మేరీ బాహోం కో
రోక్ న మేరీ రాహోం కో (2)
ఇత్‌నీ భీ బేతాబీ క్యా
సమ్‌ఝూ ఆప్‌నీ నిగాహోంకో ॥సయోనారా॥
చంచల్ షోఖ్ బహారోం మేఁ
రస్ బర్‌సాతె నజారోం మేఁ
తుఝ్‌కో భూల్ న పావూంగీ
హోగా మిలన్ గుల్‌జారోం మేఁ ॥సయోనారా॥
హోంగీ రోజ్ ములాకాతేఁ
అప్‌నీ దిన్ అప్‌నీ రాతేఁ (2)
కౌన్ హమేఁ ఫిర్ రోకేగా
జీ భర్‌కర్ కర్‌నా బాతేఁ ॥సయోనారా॥

లతాను గాయకురాలిగా ఎస్టాబ్లిష్ చేసిన పాట ఇది. కెమాల్ అమ్రోహీ ఒక అందమైన 'కామినీ పిశాచాన్ని' (మధుబాల) తెరపై సృష్టిస్తే ఒక 'హాంటింగ్ ట్యూన్'తో ఆ పాత్రకు జీవం పోశాడు ఖేమ్‌చంద్ ప్రకాష్. మధుబాల లేతదనానికి లత లేత వాయిస్ తోడయింది. పాట అజరామ రమయింది. ఈ గేయ రచయితతో, లతాకు ఎదురయిన చిత్రమైన అనుభవం పక్కపేజీలోనే ఉంది. చదవండి.

జపనీస్ భాషలో సయోనారా అంటే 'గుడ్‌బై'. 'లవ్ ఇన్ టోక్యో' అన్నారు కాబట్టి జపానుమాట ఒక్కటైనా చేర్చిన పాటొకటి ఉండాలనుకున్నారేమో ఈ పాటలో ఉపయోగించారు. జపాన్ సంగీతంలో సాధారణంగా వినిపించే గంటలు, చిరుమువ్వలు (బౌద్ధం వ్యాపించిన అన్ని దేశాల సంస్కృతిలోనూ గంట ప్రాధాన్యం చాలా ఉంటుంది) వినిపించి జపాన్ పాటే అనిపిస్తుంది. చాలామంది సినీ సంగీతాభిమానులు ఈ రాగంలో మరొకపాట వినిపించినప్పుడు 'టోక్యోమోహన్' అని కూడా అనే వారట.

శ్రీమతి ఘంటసాల గారి ఆర్టికల్ చాలా స్వీట్‌గా వుంది. శ్రీ బడేగులాం ఆలీఖాన్ వారింట రెండు నెలలున్నారు కదా. ఆయన సంగీతం ఏదైనా రికార్డ్ చేశారా?

-బాపు, చెన్నయ్

మీ ఉత్తరం చూశాక శ్రీమతి ఘంటసాల సావిత్రి గారిని మళ్ళీ కాంటాక్ట్ చేసి అడిగాం. బడే గులాం ఆలీఖాన్ గారు వారింటనున్న ఆ రోజులలో ఎంతోమంది సంగీత ప్రముఖులు వచ్చేవారట. కానీ ఎవ్వరూ ఏదీ రికార్డు చెయ్యలేదట. ఆయన ఘంటసాల గారికి కొన్ని రాగాలు నేర్పించినప్పుడు కూడా ఏదీ రికార్డుగా దాచుకోలేదట

పాశ్చాత్య బాణీ స్ఫురణతో అద్భుత గీతాలు మన రాజేశ్వరరావు (హలో హలో ఓ అమ్మాయి, అందెను నేడే అందని జాబిల్లి, ఈ రేయి తీయనది) చేసినట్లే సలీల్‌దా మొజార్ట్ బాణీ అనుకరించి 'ఇత్‌నన మురుఝుకో' అనే తలత్, లతల యుగళ గీతాన్ని పాప్యులరైజ్ చేసారు.

-డా॥ తాతిరాజు వేణుగోపాల్, పూనే

సెప్టెంబరు(1-15) 2002 సంచికలో భువన చంద్ర గారు, సలిల్ చౌధురిపై వ్రాసిన వ్యాసంలో




పారబాట్లు - 'బర్‌ఖా' చిత్రానికి సంగీతం కంపోజ్ చేసినది చిత్రగుప్త. అదే వ్యాసంలో చెప్పిన "పూర్ణిమ" చిత్రానికి సంగీతం కళ్యాణ్‌జీ - ఆనంద్‌జీ. చెమ్మీన్ చిత్రానికి ఉపయోగించిన బిజీఎమ్ "మధుమతి"లోనిది కాదు. "చాంద్ ఔర్ సూరజ్" చిత్రంలో చేసిన "బాగ్ మే కలీ ఖిలీ' ట్యూన్. దీనినే "పూనమ్ కీరాత్" చిత్రంలో "సాథీ .రే" అన్న పాటకు కూడా సలిల్‌దా బిజీఎంగా వినిపించారు.

- ఎం.వి.వి.ప్రసాదరావు, విశాఖపట్నం

ఇలాగే చాలా మంది రాశారు. వచ్చిన ఉత్తరాలలో ఈ ఉత్తరాలు మాత్రమే క్లుప్తంగాను, ఇన్ఫర్మేటివ్ గానూ ఉండడంచేత ప్రచురించాం.

యమ్.దయానంద్ -కర్నూలు

(1) సత్యం సంగీత దర్శకత్వంలో ఘంటసాల గారు పాడిన పాటలేమైనా ఉన్నాయా?

'వాడేవీడు' సినిమాలో సినారె రచన 'వయసే ఒక పొరం వలపే ఒక పొరం' అనే పాట ఘంటసాల గారు సత్యం సంగీత దర్శకత్వంలో పాడేరు.

(2) భానుమతి, శ్రీలేఖ కాక ఇంకెవరయినా స్త్రీలు తెలుగులో సంగీత దర్శకత్వం వహించారా?

సావిత్రి దర్శకత్వం వహించిన 'చిన్నారి పాపలు' చిత్రానికి గాయని పి.లీల సంగీత దర్శకత్వాన్ని వహించారు.

-ఎడిటర్

## హిందీ పాటలను అనుకరించిన / అనుసరించిన కొన్ని తెలుగు పాటలు

| వ.నెం. | చిత్రం పేరు | పాట | తెలుగుచిత్రం | పాట |
|---|---|---|---|---|
| 25. | జంగ్లీ | -కాష్మీరి కీ కలీహుమై | లక్షాధికారి | "దాచాలంటే దాగదులే" |
| 26. | సెహరా | -పంఖ్ హోతేతో ఉడ్ ఆతీరే | మంగమ్మ శపథం | "వయ్యారమొలికే చిన్నది" |
| 27. | ఏక్ ముసాఫిర్ ఏక్ హసీనా | -ఆ...ముజే దేఖ్‌కర్ ఆప్‌కా | శ్రీకృష్ణతులాభారం | "ఓ చెలీ కోపమా" |
| 28. | జబ్‌ప్యార్‌కిసీసే హోతాహై | -జియావో జియవోకుఛ్ | కులగోత్రాలు | "అయ్యయో చేతిలో డబ్బులు" |
| 29. | మిలన్ కీ రాత్ | -నీంద్ చురాయెనా, చైన్ | గండికోట రహస్యం | "మరదలు పిల్లా" |
| 30. | మధుమతి | -దయ్యారె దయ్యారె | గండికోట రహస్యం | "వయ్యారి భామ వచ్చింది" |
| 31. | సూరజ్ | -ఇత్‌నాహై తుంసెప్యార్ | గండికోట రహస్యం | "నీలాల నింగి ఎగిసిపడే" |
| 31. | భూత్ బంగ్లా | -ఆవో ట్విస్ట్‌కరే | భలే మాస్టారు | "అదిగో చిన్నది" |
| 33. | జ్యూయల్ తీఫ్ | -దిల్‌పుకారే ఆరె అరె అరె | భలే మాస్టారు | "నేను నీవై నీవు నేనే" |
| 34. | పారస్ మణి | -హస్‌తా హువా నూరానీ | గుడిగంటలు | "నీలికన్నుల నీడలలోన" |
| 35. | షికారి | -ఓ తుంకో పియా దిల్ దియా | అంతస్తులు | "వినరా విస్సన్నా" |
| 36. | మైచుప్ రహూంగీ | -మైకౌన్ హూ మై కహా హూ | మూగనోము | "నిజమైనా కలయైనా" |
| 37. | దోకలియా | -తుంహారీ నజర్ క్యా కహా | మూగనోము | "ఈ వేళ నాలో ఏదో" |
| 38. | వక్త్ | -దిన్‌హై బహార్ | భలే అబ్బాయిలు | "గులాబీలు పూచేవేళా" |
| 39. | వక్త్ | -కౌనాయాకె నిగాహోంమే | భలే అబ్బాయిలు | "ఎవరో ఈవేళ" |
| 40. | వక్త్ | -ఆగేభీ జానేన తూ | భలే అబ్బాయిలు | "ఏమౌనో" |
| 41. | చైనాటౌన్ | -బార్ బార్ దేఖో | భలే తమ్ముడు | "ఎంతవారుగాని" |
| 42. | చైనా టౌన్ | -యమ్మా యమ్మా యమ్మా | భలే తమ్ముడు | "గుమ్మా గుమ్మా గుమ్మా" |
| 43. | షాగిర్ద్ | -దిల్‌విల్ ప్యార్ వ్యార్ | బొమ్మలు చెప్పిన కథ | "మెమ్మె మేకలన్నీ" |
| 44. | ఓ కౌన్‌థీ? | -నైనా బర్‌సే రింజిం రింజిం | ఆమె ఎవరు? | "ఓ నారాజా రావా" |
| 45. | ఓ కౌన్ థీ? | -షోక్ నజర్‌కి బిజిలియా | ఆమె ఎవరు? | "నీవు చూసే చూపులో" |

-సేకరణ: ఎస్.శ్రీనివాసరావు, ఎమ్మిగనూరు

సీరియల్

4

# సినీతిచంద్రిక

రావి కొండలరావు



## జరిగిన కథ

ఒక ఊళ్లో ఒక ధనవంతుని కుమారుడు సినిమా తీస్తానని పట్టుబడతాడు. ఒక మాజీ దర్శక నిర్మాత వచ్చి వాళ్ళకు సినిమా తీయడంలో సాధక బాధకాలు చెప్పుకోసాగాడు. "విశ్వాస్ అనే అతనూ నేను ఓ నిర్మాతను పట్టుకుని సినిమా తీయించాం' ' కానీ అతను హీరోయిన్ మోహంలో పడి కథ తానే రాసాడు. చివరికి సినిమా ఫెయిలయింది. నా మొదటి డైరక్షన్ సినిమా ఫెయిలవడంతో నా మొహం ఎవడూ చూడలేదు. ఆకలికి మాడుతుండగా ఎవరో వచ్చి మరో కొత్త నిర్మాత వద్దకు తీసుకెళతానన్నాడు. మర్నాటికి అపాయంట్ మెట్

(ఇక చదవండి)

"కష్టాలు కలకాలం కాపురం వుండవు. కష్టం వచ్చినా సుఖం వచ్చినా మానవుడు చిరునవ్వుతో ఎదుర్కోవాలి రఘూ!" అనే నా పాత పిక్చర్లోని డైలాగు మననం చేసుకున్నాను. వెంటనే చిరునవ్వు నవ్వాను. పార్కు బెంచిమీద చేరి నిద్రపోయాను.

తెల్లవారింది. పదకొండో నెంబరు చెట్టుకింద నుంచున్నాను. పరుగెత్తుకుంటూ ఫలానవచ్చి. "అర్జెంటు పరుగెత్తండి......... లాభంలేదు..........ఇంకా స్పీడు..... అవతల ఎవడో ట్రైచేస్తున్నాడు... మనం




ముందువెళ్ళాలి. లేకపోతే ఛాన్సు......పో...తుంది..." అంటూ పరిగెత్తించాడు. క్లయిమాక్సు సీను అనుకోండీ....కెమేరా వంకరగా తిప్పి షాట్లుతియ్యండి... ఐపోతుంది క్విక్....క్విక్........డండండండడాం..... ఇది బ్యాక్ గ్రౌండ్ మ్యూజిక్‌లెండి..." అని ఏదో చెప్పుకుపోతున్నాడు. ఇద్దరం మొత్తానికి చేరుకున్నాము-

అదో పెద్ద దివ్యభవంతి. డ్రీమ్‌సీక్వెన్స్‌లో వచ్చే టాపులేని స్తంభాలూ మెరిసే నక్షత్రాలూ పువ్వులూ......బెలూన్లు అన్నీ వున్నాయి. నిర్మాత గంభీరంగా ఎత్తుగా ఉన్నాడు. "కమాన్ డైరెక్టర్ " అని నాకు సీటు ఇచ్చాడు. "టేకు ది సిగరెట్" అన్నాడు..."చాయ్, ఓవల్టీన్ అన్నాడు. అన్నీ అయ్యాక. "నువ్వు చాలా ఇంటల్జెంటువి. నీకు కారులేదా?...ఐతే నా కారు తీసుకో....ఫర్వాలేదు ...అది అంత పొడుగుందని భయపడకు.... టర్నింగుల్లో కాస్త కష్టం! ఇంతే. ఈ సూట్లన్నీ నీ కోసం కుట్టించినవే" అన్నాడతను. ఓ సూటు వేసుకున్నాను. నేనే మారిపోయాను... తెల్లగా అంత ఎత్తున ఉన్నాను. నోట్లో సిగరెట్ పెట్టుకుని, ఆ కార్లోంచి వెళ్తూఉంటే పాండీ బజార్లో అందరూ నాకు సలాంలు కొట్టేవాళ్లే....కారు నేనే డ్రైవింగ్...జోరుగా నడవగా నడవగా అది వెళ్ళి ఢాంమని చెట్టుక్కొట్టుకుంది. పెద్దశబ్దం అయింది. కేక వేశాను.

చట్టున కళ్ళువిప్పాను....ఏముంది? పార్కు బెంచిమీదే ఉన్నాను! 'డ్రీమ్ సీక్వెన్స్' అనుకున్నాను. ఎట్లావుంది సస్పెన్సు! సరి, మరి అట్లాగే నిద్ర పోయాను. ఎవరో తట్టినట్టయి లేచాను-ఫలానా!

'ఏవిటిసార్ మీరూ-పదకొండో నెంబరూలేదు ఏమీలేదు. నా లక్ అంతా పాడుచేశారుగదండీ-లెండి లెండి ఇంకా నిద్రేమిటి రాత్రి బాగా హెవీ భోజనం పడినట్టుంది-చూశారా? సూర్యభగవాన్లు ఎట్లా కాల్‌షీటు ఇచ్చాడో

అది కాయితముక్కగా మారిపోయింది. ఎవడేనావచ్చి, ఐదు రూపాయలు వట్టిపుణ్యానికి తీసుకోమని ఇవ్వరాదా! లేకపోతే ఇంకెవడేనా పరుగెత్తి వచ్చేసి - ఎప్పుడో నేనిచ్చానని చెప్పి - ఒకరూపాయి తెచ్చి యిచ్చి బాకీ తీర్చరాదా? తెలిసిన వాడెవడైనా ఇట్లా వెళ్ళరాదా? పోనీ ఎవరన్నా స్నేహితుడు 'పదరా భోంచేద్దాం' అనరాదా? అని ఇట్లా అనుకోసాగాను. ఐతే భోజనం చేసేవాళ్ళు ఇటురారు. హోటలుదగ్గర నించుంటే ఎవడన్నా రాకపోతాడా అని హోటలు గేటుముందు నుంచున్నాను - భోజనం చేసినవాడల్లే ఠీవిగా. చాలాసేపటిదాకా ఎవడూ కనిపించలేదు. తర్వాత ఒకడు కనిపించాడుగాని, వాడు భోజనంచేసేసి వస్తున్నాట్ట పైగా పదపోదాం అంటాడు. నాకు పనుంది వెళ్ళమన్నాను. రాత్రి చాలాసేపయింది. హోటలు కుర్రాడొచ్చి 'మీల్సు రడీ' అన్న బోర్డు తీసుకెళ్ళిపోయేంతవరకూ అక్కడే నుంచున్నాను. ఇంక లాభంలేదు. తెలిసిన వా డెవడన్నా వచ్చినా, అసలు హోటల్లోనే కూడులేదు!

అవుట్‌డోర్‌కు ప్రశస్తమైన ఎండ! లెండి' అన్నాడు.

నేను లేచాను. బాగా పొద్దెక్కిపోయింది.

"లేదు తెల్లవారుజామున ఇట్లావచ్చి కూచున్నాను- నిద్ర పట్టింది...అంతే" అన్నాను నీరసంగా.

'కాస్త కొళాయిదగ్గర మొహం కడగండేం.... కాఫీ తాగుదాం' అన్నాడు ఫలానా. ఆ మాట వినగానే ఎక్కడలేని శక్తి వచ్చింది. గబగబాలేచి వెళ్ళి మొహం కడు క్కున్నాను. ఫలానా నాకు రెండు ఇడ్లీ, కాఫీ ఇప్పించాడు. అతనూ తాగాడు. తప్పకుండా యీ పిక్చర్లో ఫలానాకు పెద్దవేషం ఇవ్వాలనుకున్నాను. ఇద్దరం బయల్దేరాం......

ఫలానా ఒక చిన్నహోటలుకు తీసుకెళ్ళాడు. 'ఇందులోనే వుంటున్నారు- ఉండండి...అట్లా వెళ్ళండి- కొత్త నిర్మాతగారెవరు అని అడగండి



చెప్తారు... భయం లేదు. ధైర్యే సాహసే లక్ష్మి డాబుకొట్టండి, లేక పోతే నెగ్గంలే. ఖచ్చి తంగా అన్నివిషయాలూ మాట్లాడనీయండి. జాగ్రత్త - అన్నాడు ఫలానా. నేను వెళ్ళబోతూవుంటే, ఆపి మళ్ళీ అన్నాడు! "నేను చెప్పానని మాత్రం చెప్పకండి. మీరు ఎక్కడో విన్నట్టు చెప్పండి....వెళ్ళండి"

నేను వెళ్ళి అడిగాను ఒకతన్ని. "నేనే కొత్త నిరమాతను ఏంకావాలి? ఏషాలు ఇంకా ఏం అనుకోలేదు. నెలాఖరుకు కనిపించండి. ఏయో చిన్నయేషాలుంటాయి."అని తొరతొరగా అనేసి వెళ్ళిపోతున్నాడు.

"వేషం కోసం కాదండి - నా పేరు మహాశయుడు; చిత్ర దర్శకుడిని" అన్నాను.

నిర్మాత నాకేసి వో క్షణం అదోలాచూసి రమ్మన్నాడు. నన్ను చాలా విషయాలు అడిగాడు. అన్నింటికి సమాధానాలు చెప్పాను.

"రైటో, రేపు షూటింగు ప్రారంబిద్దాం" అన్నాడు నిర్మాత.

నేను నవ్వాను, "కథో-తారలో-మ్యూజిక్కో" అన్నాను.

"దాందేవుందిలేవయ్యా, కతలకేముచ్చె ఇప్పుడు! మనకు తెలీని కతలా ఇవి! సాంగికం కిట్టుద్ది. ఆడూ,ఆదీ పేమించుకుంటారు-ఆళ్ళ నాన్న ఒద్దంటాడు-ఇద్దరూ లేసిపోతారు-ఆళ్ళ నాన్న ఎతుకుతాడు- ఇట్లాగేగా!"అన్నాడతను సాగదీస్తూ.

"ఏదైనా, రైటరుఅంటూ ఒకడుండాలిగా."

"సూదాం లేవయ్యా, ఇంకా కొత్త. మొదట్లోనే ఇయ్యన్నీ పెట్టమాక. ఆనక డబ్బులుండవు. సరే నువ్వేం తీసుకుంటా?" అని అడిగాడు.

"మీ ఇష్టం." అన్నాను.

"సరే మూడొందలు తీసుకో-డైరక్షనంతా నీదే"

"మూడొందలా-అంటే నెలకా?" అని అడిగాను.

"బలేవాడివయ్యా, నెలకు మూడొందలు నీకేయిస్తే నేనేం తినను? మొత్తానికే"అన్నాడు.

'నాకు గిట్టదు' అనబోయే సమయంలో ఫలానా వచ్చాడు. రావలసిన సమయానికి నారదుడొచ్చినట్లు.

"ఏంది సిన్నాడా-రా" అన్నాడు నిర్మాత.

"నమస్కారంసార్" అన్నాడు నావేపు తిరిగి.

"ఈయనెవ్వరుగుదువా చిన్నాడా?" అన్నాడు నిర్మాత.

"ఎరక్క? మంచిమాటన్నారు-పెద్ద డైరక్టరుగదండీ-వారేగనక మీ చిత్రానికే గనక నిజంగానే గనక డైరక్టరే గనక ఐతే గనక........"

"గనకేటయ్యా - ఆరే!" అన్నాడు నిర్మాత.

ఫలానా ఒక్క ఎగురు ఎగిరి. 'భేష్' అని కేక వేశాడు.

"మీ చిత్రం హిట్టే పాండి, నా సామిరంగ. శతదినోత్సవాలు ఆరేసి ... తస్సదియ్యా" అన్నాడు సంతోషంగా ఫలానా.

"అట్టాగా - అయితే అయిదొందలు తీసుకో, మహాశయా," అన్నాడు నిర్మాత.

"ఐదువందలు....." అని గొణిగాను.

"వొదులుకోకండి గురూ! మీకేం భయంలేదు, ఛాన్సుపోతే మళ్ళీరాదు. ఏమొస్తే అది రానీయండి. మంచి సంస్థ - మంచి ప్రొడ్యూసరు-ఆలోచించు కోండి," అన్నాడు ఫలానా.

"ఆలోచించుకొని గావాలంటే రేపొచ్చి చెప్పు" అన్నాడు నిర్మాత.

"ఇంకా రేపొచ్చి చెప్పేదేముంది? నా మాటలు వినండి ఇట్లాగే వెనక

ఒకడు వచ్చిన ఛాన్సు పోగొట్టుకుని, నానా తిప్పలు పడ్డాడు. మీకా కథ చెప్పమంటారా?"అని సమాధానం కోసం కూడా చూడక మొదలెట్టాడు ఫలానా.

"రెండేళ్ళ కిందట హీరో వేషాలువేసే ఒక ఆయన తనకో బుకింగొస్తే కాలదన్నిన కథ. ఆ హీరో ఒకప్పుడు మంచి హీరో. కాలక్రమాన పిక్చర్లు తగ్గిపోయినాయి. మరుగునపడ్డాడు. అట్టి సమయంలో ఒక నిర్మాతగారు, పోని తక్కువ డబ్బుల కొస్తాడుగదా అని బుక్ చెయ్యబోయాడు. అతను యిదివరకు తీసుకునేదానికి అయిదు వేలు తగ్గించాడు. "నాకు పిక్చర్లు లేకపోతేనేం - నాకున్న పేరు నాకుంది - నా రేటుకు కనీసం నయా పైసాకూడా తగ్గదు" అన్నాడు హీరో. నిర్మాత చాలా చెప్పిచూసాడు. అతను లొంగలేదు. ఫ్లాప్ లక్షణాలుగల సినిమా తీసానని విడుదలైన మొదటిరోజే తెలుసుకున్న నిర్మాతలాగ ఎక్స్‌ప్రెషన్ పెట్టుకుని నిర్మాత వెళ్ళిపోయాడు. హీరో ఆలోచన ఏమిటి - ఆ నిర్మాత తిరిగి మళ్ళీవచ్చి తను కోరిన డబ్బుఇస్తాడని! నిజానికి అతనికి ఒప్పుకోవాలని వుంది. కానీ. ఆశ ! మూడురోజులదాకా చూసాడు. నిర్మాత రాలేదు. హీరోకు కంపరమెత్తింది రాక రాక వచ్చిన పిక్చరును ఇట్లా వదులుకున్నానే చెప్మా అని దిగులుపడి, శాడ్‌సాంగ్‌కు పెదవులు కలుపుని, 'హుఁ'అని బరువుగా అని, తలవెంట్రుకలు నాలుగుతీసి నుదుటిమీదకు లాక్కుని, తలవంచుకుని సోఫాలో - అది ఒకప్పుడు సోఫాలెండి - కూలబడి సారోప్లస్ పాథాస్‌లోపడి, అరగంట పోయాక లేచాడు. లేచి ఉషారుగా నిర్మాత దగ్గరకు వెళ్ళాడు.

"ఏం ఇలా వచ్చారు?" అన్నాడు నిర్మాత - గడ్డం గీసుకుంటూ.

"హీరో ఏం చెబుతాడు' "ఊరికే!"అని నసిగాడు.

"ఏ ఊరికీ?"అన్నాడు నిర్మాత నవ్వుతూ. ఇతనూ శ్రుతి కలిపి, ఇద్దరూ యుగళంగా నవ్వుకున్నారు, ఆ తర్వాత.

"ఓ గంట కూచుంటారా - నేను స్నానంచేసి, టిఫిన్‌చేసి, బట్టలు వేసుకుని వీధిలోకివెళ్ళి పని చూసుకుని వస్తాను." అన్నాడు నిర్మాత నిష్కర్షగా.

అక్కడేమనాలో హీరోకు తెలియలేదు. ఏ భావం ప్రకటించాలో కూడా తెలియలేదు. అందుకని, ప్రేమిస్తున్న హీరోయిన్, ఒక్కసారి నిరాకరిస్తే హీరోలు ఇచ్చే ఎక్స్‌ప్రెషన్ ఇచ్చాడు ! నిర్మాత చాపకింద నీరులా ప్రవహించి - 'హుఁ హుఁ హుఁ.....' అన్నాడు అని - "నాకు తెలుసు బ్రదర్, నువ్వెందుకు వచ్చావో కాని, నేను ఎంత బతిమాలినా బామాలినా నువ్వు విన్నావుకావు. నీ కాళ్ళమీద పడి తల బ్రద్దలుచేసుకుని .... "అమ్మా అమ్మా" అని అరచినట్టు అరచి - వేడుకుంటాననుకున్నావు కాబోలు. నేనేం కథలోని హీరోయిన్‌నుకాను.

ఇంకో ఆరువేలు తగ్గింపుకే ఒక కొత్తవాడిని పెట్టుకున్నాను. ఎగ్రిమెంటుకూడా ఐపోయింది. నేనేం చెయ్యలేను-సారీ అనటం కూడా దండగ అనుకుంటాను" అన్నాడు నిక్కచ్చిగా.

ఈసారి హీరో లేచి నించున్నాడు.

"ఇది సినిమా ఇండ్రస్టీ. ఇక్కడ బిగింపులు పనికిరావు. ఎవరికీ ఒక రేటంటూ ఉండరాదు. పిండికొద్దీ రొట్టె. వచ్చిన ఛాన్సును పోగొట్టుకుంటే అంతే! ఇంకెప్పుడూ ఇటువంటి పన్లు చెయ్యకు. చేస్తివా - ఇంతే ఇట్లాగే జరుగుతుంది! నువ్వే కావాలని నేననుకున్నప్పుడు - నువ్వు ఇష్టం వచ్చినట్టు కోరవచ్చును. కాని ఆ పట్టింపు నాకు లేదు. మూలనడి వున్నావు కదా నిన్ను ఉద్ధరిద్దామనీ కాదు - నాకో నాలుగురాళ్ళు తగ్గుతాయనీ, నీకో నాలుగురాళ్ళు ముడతాయని అనుకుంటావనీ అనుకున్నాను. పెద్దతారలు బిగించుకున్నారని నువ్వూ బిగించుకోకు. పులినిచూసి నక్క వాతలెట్టుకుంటే, దాని ఒళ్ళే కాలుతుంది!" అన్నాడు నిర్మాత లోపలకు నిష్క్రమిస్తూ. జాలీగా వచ్చిన హీరో జాలిగా వెళ్ళిపోయాడు!

అంచాత డైరక్టరుగారూ - ఇది ఒదులుకోకండి, ఆ తర్వాత మీ ఇష్టం!" అని ముగించాడు ఫలానా.

"ఓరినీ....గట్టోడివేనే" అని మెచ్చుకున్నాడు నిర్మాత.

"గట్టికాక-ఏఁవనుకున్నారండీ - చిన్నప్పుడు చేసిన కసరత్తు ఊరికేపోతుందా?" అని అడిగాడు నిర్మాతను.

"పోదురో" అన్నాడు నిర్మాత కనుబొమలు జుట్టుకు తగిలేట్టు ఎత్తి.

"అయ్యా - నా మాట వినండి. వారూ కొత్త ప్రొడ్యూసరు. ఇదే వారికి ప్రథమం. రెండు మూడు అనుభవాలు కలిగితే, మీరు కోరినంత ఆయన ఇవ్వొచ్చును. ఇప్పుడంతగా పట్టుపట్టకండి. మీవర్కు బాగుంటే, సంతోషించి మరో పదో, పాతికో ఆయనే ఎక్కువ యివ్వొచ్చును - పైగా, హిట్‌గాని, కొంపదీసి తీశారంటే - శత దినోత్సవంలో పెద్ద షీల్డొకటి ఇస్తారు. అదొకటి కిడుతుంది.... ఏమిటి మాట్లాడరేమిటి? మీ పోర్షను ఐపోలేదు. అసిస్టెంటు డైరెక్టరు డైలాగులు తెచ్చి ఇవ్వాలిగావును.. ఒప్పుకోండి" అన్నాడు ఫలానా.

నేను పైకి చూశాను. 'ఒప్పుకో' అని వినిపించింది. ఇంకో మూల చూశాను. 'ఒప్పుకో' అని వినిపించింది - ఆ మూల చూశాను 'ఒప్పుకో' - క్రింద చూశాను 'ఒప్పుకో ఒప్పుకో ఒప్పుకో' అని అంతటా గోలగోలగా వినిపించేశాయి.

"ఒప్పుకుంటాను. ఒప్పుకుంటాను" అన్నాను ఆవేశంగా ఈ గోల భరించలేక.

"అట్టాగొప్పుకో-" అన్నాడు నిర్మాత.

"ఆవేశపడకండి - ఆవేశపడకండి! ఆవేశాలు ఆరంభంలో అంత అచ్చిరావు" అన్నాడు ఫలానా 'సంభాషణ'గా పలుకుతూ.

"ఒరే ఒరే - నువ్వేందిరా సినిమాలో మాటాడినట్టు ఆడుతున్నావూ - నువ్వే రాసేత్తావేట్రా మన సినిమాకు - పన్లోపని" అన్నాడు నిర్మాత.

ఫలానా కొద్దిగా నీరసించి దిగులుగా అన్నాడు: "రాయడానికి అభ్యంతరం ఏముంటుందిలెండి - తీరా రాశాక ఆ స్క్రిప్ట్‌ని ఇంకో బరువు రచయిత దగ్గరికి పంపిస్తారని భయంగాని"

"సరేలేవయ్యా డేరట్టరూ - మరి పని మొదలెట్టూ" అన్నాడు నిర్మాత.

"కథండీ - కథకావాలి కదా! ఎవర్నయినా రైటర్ను చూడాలి".

"మళ్ళీ కతంటాడు - కతకోసమో రైటరెందుకయ్యా - మనం లేమూ సిన్నోణ్ణి కూడా ఏసుకుందాం గావాలంటే, లేదా, మా ఊళ్ళో ఎంకట్రావున్నాడు - ఆడిని పిలుద్దాం. ఆడోసారి పత్రికలో కత రాశాట్ట" అన్నాడు తనే నిర్ఘాంత పోతూ నిర్మాత.

-(ఇంకా వుంది)





# నీవ్వులేవ్వు నీ పాట ఉంది

"మోర్టల్‌మెన్ అండ్ ఇమ్మోర్టల్ సాంగ్స్" పేరిట బొంబాయిలో పదునాలుగేళ్ల నాడు జరిగిన ఓ ఉత్సవంలో ఏడు పదులు నిండిన ఆ కళామూర్తి ఆపుకోలేని భావోద్వేగంతో మహానటుడు దిలీప్‌కుమార్‌ను ఆలింగనం చేసుకొని కంట తడిపెట్టిన దృశ్యం వందలాదిగా గుమికూడిన కళాభిమానులను ఒక్కసారిగా కదిలించింది. కవులు, కళాకారులకు పరిమితులు, సరిహద్దులుండవని వారు ప్రపంచమంతా తమదేననే భావనతో సాంస్కృతిక వారధులుగా జీవిస్తారని ఈ సంఘటన రుజువు చేసింది. అలా కంటనీరు పెట్టిన ఆమె పేరు 'నూర్జహాన్'.

'నూర్జహాన్' అనగానే మనకు అనితర సాధ్యగమకాల ఆరోహణావరోహణల గంధర్వ గాన ప్రవాహం గుర్తుకు వస్తుంది. శ్రోతలను ఒక మహదానంద మైకంలోకి తీసుకెళ్లే స్వరం గుర్తుకు వస్తుంది.

**'జవాహై మొహబ్బత్ హసీ హై జమానా'**
**"ఆవాజ్ దే కహా హై"**
**"ఆజ్ మెరీ బర్‌బాద్ మొహబ్బత్‌కీ "**

పాటలు ఎవరు మర్చిపోతారు? నూర్జహాన్ 1929 సెప్టెంబర్ 21న నాటి అవిభక్త భారతంలోని, నేటి పాకిస్తాన్‌లోని లాహోర్‌లో పుట్టారు. అయిదవ ఏటనే నాటకాల్లో నటించారు. ఏడేళ్ల వయసులో సినీరంగ ప్రవేశం చేసి 1936 నుండి 1938 దాకా షీలా, నరెరాజ్, మిస్టర్ 420, తరన్‌హర్, ఫక్రీ ఇస్లాం, కిస్‌కీ ప్యారీ, హీర్‌స్యాల్ చిత్రాల్లో చిన్నచిన్న వేషాలు వేసింది. అయితే ఆమెకు నటిగా గాయనిగా గుర్తింపు తెచ్చిన చిత్రం "గులేబకావళి" (1939) అనే పంజాబీ చిత్రం.

నూర్జహాన్ హీరోయిన్‌గా నటించిన తొలి చిత్రం 'ఖాందాన్' (1942). హీరో ప్రాణ్. ఈ చిత్రం ఆ రోజుల్లో బ్రహ్మాండమైన విజయం పొందింది. గులాం హైదర్ సంగీతంలో నూర్జహాన్ పాడిన పాటలన్నీ క్లాసిక్సే. "ఉడ్‌జా పంఛీ ఉడ్‌జా" "షోక్ సితారోం సే హి మిల్ హం ఖేలేంగే", "మేరేలియే జహా మై చెయిన్ న కరార్ హై" "తూ కోన్ సీ బర్‌లీ మే మేరి చాంద్ హై" పాటలన్నీ నాడు అమృత గుళికలే. అలనాటి టీనేజర్స్‌కి అభిమాన నటగాయని అయింది.

1942లోనే "దుహాయ్"లో నటించేందుకు నూర్జహాన్ తొలిసారిగా బొంబాయి వచ్చారు. ఆ తరువాత ఆమె నౌకరీ, నాదాన్, దోస్త్, మీర్జా సాహెబ్, లాల్ హవేలీ, భాయిజాన్, దిల్, గావ్‌కిగోరీ, హమ్‌జోలీ చిత్రాలు హిందీ చిత్రసీమలో అగ్రశ్రేణి తారను చేశాయి. 1945లో "జీనత్"లో ఆమె నాయికగా చేసిన తరువాత 1946లో మెహబూబ్‌ఖాన్ తీసిన "అన్ మోల్ ఘడీ"లో నూర్జహాన్ నటన హిమాలయ శృంగాన్ని అందుకుంది. నౌషాద్ సంగీతంలో ఆమె పాడిన "ఆవాజ్ దే కహాహై", "జవాహై మొహబ్బత్ హసీ హై జమానా", 'మేరే బచ్ పన్‌కె సాథీ ముఝె భూల్ న జానా" పాటలు సంగీత ప్రియులను అలరించడమే గాక నాటి నుండి నేటి దాకా నూర్జహాన్‌ను ఈ పాటలు గాయనిగానే గుర్తు పెట్టుకున్నారు.

40 దశకంలో ఒక వైపు సురయా మరో వైపు నూర్జహాన్‌లు హిందీ హీరోయిన్ అన్న పదానికి రెండు పార్శ్వాలుగా ఉండి పోయారు. ఇంతలో లతా మంగేష్కర్ నట గాయనిగా తన కెరీర్‌ను ప్రారంభించి 1945లో "బడీమా" చిత్రంలో నూర్జహాన్ హీరోయిన్‌గా నటించగా మరో చిన్న పాత్రలో నటించింది. తొలినాట లత గాయనిగా నూర్జహాన్‌ను ఆదర్శంగా తీసుకొని



'అన్‌మోల్‌ఘడీ' చిత్రంలో హీరో సురేంద్రతో

అనుకరించేది. వీరి అనుకరణల నుండి దూరమై స్వంత వ్యక్తిత్వాన్ని నిలబెట్టు కోవడానికి తనకు కొంత సమయం పట్టిందని లతాయే చెప్పుకున్నారొక సందర్భంలో.

నూర్జహాన్ స్వర విన్యాసానికి పులకరించని సంగీతాభిమానులు లేరు. "ఓ కౌన్ హసా దిల్‌మె", "బైరీ హు తేరి యాద్‌కా", "కిస్ తరహ్ భూలేగా దిల్", (గావ్ కీ గోరీ 1945), "బుల్ బుల్ మత్ రో యహా" (జీనత్), "తేరీయాదాయె సవరియా" (లాల్ హవేలి), 'క్యా యహీ తేరీ ప్యార్', 'ఆజా తుఝె అఫ్సానా దిల్‌కా జుదాయీ (మీర్జా సాహిబ్), 'ఆజ్‌కీ రాత' "ఆజామేరీ బర్‌బాద్ మొహబ్బత్ కా సహారే", "క్యామిల్ గయా భగవాన్" (జుగ్ను), "దియా జలాకర్ ఆగ్ భుజాయా", "ఆ ఇంతిజార్ తేరాహై" (బడీమా) పాటలన్నీ మరుపురానివి.

1947లో నటించిన "జుగ్ను" ఆమె చివరి చిత్రం. హీరో దిలీప్‌కుమార్. 'ఉమంగే దిల్‌కీ ధడకన్' అని పాడిన గళమే "మహబద్లా వఫాకా బేవఫాయికే సివా క్యాహై కభీ సుఖ్ కభీ దుఖ్ అభీ క్యాహై" అని అదే సినిమాలో పాడటం ఆమెకే సాధ్యమైంది. నాటి రాజకీయ పరిణామాల దృష్ట్యా ఆమె పాకిస్తాన్ వెళ్లిపోయి దర్శకుడు హుస్సేన్ రజ్వీని పెళ్లాడింది. అయితే ఆ బంధం ఎంతో కాలం నిలువలేదు. ఆ తరువాత ఆమె పలు రాజకీయ వివాదాల్లోకి వచ్చింది. ఆమెనే ఒకసారి "మంచి గాయని కాగలిగాను గానీ మంచి భార్యను కాలేకపోయాను. రెండు కాగలగటం కష్టమని నా నమ్మకం" అని చెప్పుకుంది. మరో వైపు పాకిస్తాన్‌లో 1951లో స్వయంగా "ఛన్ ఉయ్" తీసి తొలి మహిళా దర్శకురాలయింది. ఆ తరువాత 1963 వరకు ఆమె "దుపట్టా", "గుల్నార్", "పటీఖాన్", "పరదేశన్" "నీంద్", "కోయల్", "గాలీబ్", "బాజీ" చిత్రాల్లో నటించారు. 1980 'తరన్నుమే' టి.వి సీరియల్‌కు పని చేశారు.

నూర్జహాన్‌ని పాక్‌లో "ఓహాన్" అని ముద్దుగా పిలుచుకునే వారు. "మెలోడీ క్వీన్", "మాలిక్-ఎ-తాతన్నుమ్, పాక్ ప్రభుత్వమిచ్చే "ప్రైడ్ ఆఫ్ పెర్‌ఫార్మెన్స్" దిలీప్‌కుమార్‌తో బాటు "నిషాన్-ఎ-పాకిస్తాన్" పురస్కారంతో సన్మానితులైనారు. 1947లో పాకిస్తాన్ వెళ్లినా ఆమెకు భారతదేశం పట్ల ఉన్న అభిమానం తగ్గలేదు. 1982లో బొంబాయి వచ్చి ఒక్కసారిగా తన గత జ్ఞాపకాల్లోకి వెళ్లిపోయారు. ఆ మహాగాయని 2000 డిసెంబర్ 22న తన పాక్‌లోని కరాచీలో అంతిమ శ్వాసవిడిచారు. అయితే ఆమె పాట మాత్రం మనలను అనునిత్యం పలకరిస్తూనే ఉంటుంది. "తిలక్" చెప్పిన "నీవు లేవు నీ పాట ఉంది" కవితా వాక్కులు నూర్జహాన్‌కు నిస్సందేహంగా అన్వయించుకోవచ్చు.

-పద్మజారాయ్

### చిత్రం: అన్‌మోల్ ఘడీ

రచన: తన్వీర్ నక్వీ　　సంగీతం: నౌషాద్

ఆజా... ఆజా.... ఆజా మేరీ బర్‌బాద్ మొహబ్బత్ కే సహారే (2)
హై కౌన్ జో బిగ్‌డీ హుయీ తక్‌దీర్ సఁవారే ॥ఆజా... ఆజా॥
ఆయే భీ న థే ఖుశ్క్ హుయే ఆంఖోఁ మేఁ ఆఁసూ
హాయ్ ఆంఖోఁ మేఁ ఆఁసూ ॥ఆయే భీ నథే॥
నిక్‌లే భీ న థే లుట్ గయే అర్‌మాన్ బిచారే ॥హైకౌన్॥
అంజామే మొహబ్బత్ హమే మాలూమ్ హై లేకిన్
హమే మాలూమ్ హై లేకిన్ ॥అంజామే॥
లేతే హైఁ తేరే గమ్ మేఁ ఉమ్మీదోం కే సహారే ॥హై కౌన్॥
థా దిల్ కో ఫకత్ తేరీ ముహబ్బత్ కా సహారా
ముహబ్బత్ కా సహారా ॥థా దిల్ కో॥
హమ్‌నే ఇసీ ఉమ్మీద్ సే దిన్ అప్‌నే గుజారే ॥హై కౌన్॥ ॥ఆజా॥

### చిత్రం: అన్‌మోల్‌ఘడీ

రచన: తన్వీర్ నక్వీ　　సంగీతం: నౌషాద్

జవాఁ హై మొహబ్బత్, హసీఁ హై జేమానా
లుటాయా హై దిల్ నే ఖుషీకా ఖజానా ॥జవాఁ హై॥
మొహబ్బత్ కరే ఖుష్ రహే ముస్కురాయే
ఖుష్ రహే ముస్కురాయే ॥మొహబ్బత్ కరే॥
న సోచే హమే క్యా కహేగా జేమానా
క్యా కహేగా జెమానా ॥జవాఁ హై॥
అభీ తక్ ముఝ్ యాద్ హై వో కహానీ
యాద్ హై వో కహానీ ॥అభి తక్॥
నా భూలే యా బచ్‌పన్ కా రంగీఁ జేమానా
వాఁ రంగీఁ జేమానా ॥జవాఁ హై॥
యా ఆంఖోఁ ఆంఖోఁ మేఁ బాతేఁహు యీ హైఁ (2)
కిసీనే న దేఖా కిసీ నే న జానా
వాఁ కిసీనే న జానా ॥జవాఁ హై॥
తుమ్ ఆయే కి బచ్‌పన్ మేరా లౌట్ ఆయా, లౌట్ ఆయా (2)
మిలా హై ముఝే జిందగీ కా బహానా,
జిందగీకా బహానా ॥జవాఁహై॥

### చిత్రం: అన్‌మోల్‌ఘడీ

రచన:తన్వీర్ నక్వీ　　సంగీతం: నౌషాద్

ఆ : ఆవాజ్ దే కహాఁ హై
దునియా మేరీ జవాఁ హై
ఆబాద్ మేరే దిల్ మేఁ ఉమ్మీద్ కా జహాఁ హై
దునియా మేరీ జవాఁ హై
ఆవాజ్ దే కహాఁ హై
ఆ రాత్ జా రహీ హై యూఁ జైసే
చాందినీ కీ బారాత్ జా రహీ హై ॥ఆరాత్॥
చల్‌నే కో అబ్ పలట్‌కే తారోం కా కార్‌వాఁ హై (2)
ఐసే మేఁ తూ కహాఁ హై.... దునియా మేరీ జవాఁ హై
ఆవాజ్ దే కహాఁ హై
అ : కిస్‌మత్ ఛా రహీ హై క్యోం రాత్ కీ సియాహీ
వీరాఁ హై మేరీ నీందేఁ, తారోం సే లే గవాహీ (2)
బర్‌బాద్ మైఁ యహాఁ హూఁ ఆబాద్ తూ కహాఁ హై ॥2॥
బేదర్ద్ ఆస్‌మాఁ హై దునియా మేరీ జవాఁ హై
ఇ: ఆవాజ్ దే కహాఁ హై ॥2॥

### చిత్రం: అన్‌మోల్‌ఘడీ

రచన: తన్వీర్‌నక్వీ　　సంగీతం: నౌషాద్

మేరే బచ్‌పన్ కే సాథీ ముఝే భూల్ న జానా
దేఖో దేఖో హఁసేన జమానా, హఁసే న జమానా ॥మేరే॥
గమ్ ఫుర్‌కత్ కే సహ్‌న సకూంగీ, సహ్ న సకూంగీ
రోవూంగీ, కుఛ్ కహ్ న సకూంగీ
దుష్మన్ హై సారా జహాఁ (2) జావూఁ కహాఁ
ఆ.... తేరీ ఉల్ఫత్ హై జీనే కా బస్ ఎక్ బహానా ॥దేఖో॥
రాత్ గుజారూఁ గిన్ గిన్ తారే, గిన్ గిన్ తారే
కైసే ఆవూఁ పాస్ తుమ్హారే
తుమ్ హో కహీఁ, మైఁ కహీఁ (2) చైన్ నహీఁ
హాయ్ దునియా నే దిల్ కా మేరే గమ్ న జానా ॥దేఖో॥
కోయీ దిల్ కా దర్ద్ న జానే, దర్ద్ న జానే
అప్‌నే భీ అబ్ హైఁ బేగానే
రోరోకే కహతా హై దిల్ (2) ఆ సాజన్ మిల్
ఆ.... బస్ ఇత్‌నా హీ సున్‌లే మేరా హై ఫసానా ॥దేఖో॥ ॥మేరే॥

### చిత్రం:జుగ్ను

రచన: అస్‌గర్ సర్హది
సంగీతం: ఫిరోజ్ నిజామ్　　గానం:రఫీ, నూర్జహాన్

అ : యహాఁ బద్లా వఫాకా బేవఫాయీ కే సివా క్యా హై (2)
మొహబ్బత్ కర్‌కే భీ దేఖా మొహబ్బత్ మేఁ ధోఖా హై
ఆ : కభీ సుఖ్ హై కభీ దుఃఖ్ హై అభీ క్యా థా అభీ క్యా హై
యూఁ హీ దునియా బదల్ తీ హై
ఇసీ కా నామ్ దునియా హై ॥కభీ॥
తడప్ నే భీ నహీఁ దేతీ హమే మజ్‌బూరియాఁ అప్‌నీ (2)
అ : మొహబ్బత్ కర్‌నే వాలోంకా తడప్ నా కిస్‌నే దేఖా హై
బడే అర్‌మాన్ సే వాదోఁ నే దిల్ మేఁ ఘర్ బసాయా థా (2)
ఆ : వో దిన్ జబ్ యాద్ ఆతే హైఁ కలేజా ముఁహ్ కో ఆతాహై
అ : యహాఁ బద్లా వఫా కా బేవఫాయీ కే సివా క్యా హై
ఆ : కభీ సుఖ్ హై కభీ దుఃఖ్ హై అభీ క్యా థా అభీ క్యా హై
అ : మొహబ్బత్ కర్ కే భీ దేఖా మొహబ్బత్ మేఁ భీ ధోఖా హై
ఆ : యూఁ హీ దునియా బదల్ తీ హై
ఇసీ కా నామ్ దునియా హై ॥కభీ॥
అ : మొహబ్బత్ కర్‌కే భీ దేఖా మొహబ్బత్ మేఁ భీ దోఖా హై
ఆ : భులాదో జమానా క్యా, ముఝే అప్‌నా బనాయా థా
అ : భులాదో నామే ఉల్ఫత్ జబ్ తుమ్హారే లబ్ పే ఆయా థా
ఆ : భులాదో... ఆ... భులాదో భులాదో
వో కసమ్ జో దిలాయీ థీ కభీ తుమ్‌నే
అ : భులాదో వో కసమ్ జోకి ఖాయీ థీ కభీ తుమ్‌నే
ఆ : భులాదో జీ కి తుమ్ గుజరే హుయే రంగీఁ జమానే కో
అ : భులాదో వాఁ.... భులాదో ఇష్క్‌కే సారే ఫిసానే తూ
ఆ : తమన్నావోం కీ బస్తీ మేఁ అంధేరా హీ అంధేరా హై
అ : కిసే అప్నా కహే కోయీ, జో అప్‌నా థా పరాయా హై
ఆ : యూఁ హీ దునియా బదల్‌తా హై ఇసీకా నామ్ దునియాహై
కభీ సుఖ్ హై కభీ దుఃఖ్ హై, అభీ క్యాథా, అభీ క్యా హై
అ : మొహబ్బత్ కర్‌కే భీ దేఖా మొహబ్బత్ మేఁ భీ దోఖా హై
॥యహాఁ బద్లా॥

# బహు భాషా సంగీత దర్శకుడు "జి.కె.వెంకటేష్"

"సినిమాకు సంగీతం వెన్నెముక వంటిది. ఎవరైనా సరే తానేదో గొప్పగా సంగీతం చేశానని అనుకోవడం కాదు. ఆ ఎఫెక్ట్‌ను చెదరనీయకుండా, రీ రికార్డింగ్‌లో కూడా విజయం సాధించిన వాడే నిజమైన సంగీత దర్శకుడు" అని చెప్పడమే కాదు అలా నడచుకున్న సంగీత దర్శకుడు "జి.కె.వెంకటేశ్". జి.కె.వెంకటేశ్ పేరు చెప్పగానే మనకు ముందుగా నాటకాల రాయుడు, శ్రీదేవి, అమెరికా అమ్మాయి చిత్రాల్లోని పాటలు గుర్తుకు వస్తాయి.

తెలుగువారిలో తొలి బహు భాషా సంగీత దర్శకుడు జి.కె.వెంకటేశ్. 1927 సెప్టెంబర్ 21న హైదరాబాదులో జన్మించిన ఆయన పసితనాన్నే సంగీతాన్ని అభిమానించారు. తన అన్నగారైన జి.కె.ఎస్.పతి వద్ద సంగీతంలో తొలిపాఠాలు నేర్చుకున్నారు. రెండేళ్ల వీణసాధన తరువాత తొమ్మిదేళ్ల వయసులోనే మైసూరులో తొలి వీణా కచేరీ చేసి విద్వాంసుల ప్రశంసలందుకున్నారు.

1940 దశకంలో సినిమాలపై మోజు పెంచుకున్న వెంకటేశ్ జూపిటర్స్ పిక్చర్ సంస్థలో ఆఫీస్ బాయ్‌గా నెలకు మూడు రూపాయల జీతంతో చిత్రరంగ ప్రవేశం చేశారు. అయితే ఆఫీసుబాయ్‌గా కన్నా మ్యూజిక్ సిట్టింగ్ విభాగం పట్ల అధిక ఆసక్తిని కనబరిచారు. కొంతకాలం తరువాత పక్షిరాజా వారి సంస్థలో వైణికుడుగా చేరారు. ఇంతలో నాటి సుప్రసిద్ధ సంగీత దర్శకుడు సి.ఆర్.సుబ్బరామన్ వద్ద సహాయకుడుగా చేరి ఓ మెట్టు పైకెక్కారు.

జి.కె.వెంకటేశ్ తొలిసారిగా 1947లో "బేబి" అనే మలయాళ చిత్రానికి సంగీత దర్శకత్వం నెరిపారు. ఆ తరువాత మరికొన్ని మలయాళ చిత్రాలకు సంగీతం అందించిన ఆయన 1954లో తొలిసారిగా "సోదరి" అనే కన్నడ చిత్రానికి సంగీత దర్శకత్వం వహించారు. ఐతే కన్నడంలో ఆయన స్వరరచన చేసిన చిత్రాలు వరుసగా విజయం సాధించడంతో ఆ తరువాత సుమారు వందకు పైగా కన్నడ చిత్రాలకు సంగీత మందించారు. తమిళంలో కూడా ఆయన సక్సెస్ అయిన సంగీత దర్శకుడు. శపథం, పొన్నుమ్, తంగమనసు తదితర తమిళ చిత్రాలకు ఆయన సంగీత దర్శకునిగా పని చేశారు.

కాగా తెలుగువాడైన జి.కె.వెంకటేశ్ సంగీత దర్శకుడైన 20 సంవత్సరాల తరువాత గాని తెలుగు చిత్రానికి పని చేసే అవకాశం రాలేదు. 1968లో వచ్చిన "అత్తగారు - కొత్తకోడలు" ఆయన సంగీతమందించిన తొలి తెలుగు చిత్రం.



ఆ తరువాత నాటకాల రాయుడు (1969), శ్రీదేవి (1970), శ్రీవారు-మావారు (1973), జమిందారు గారి అమ్మాయి (1975), అమెరికా అమ్మాయి (1976), చక్రధారి, తరంమారింది (1977), రావణుడే రాముడైతే (1979), సన్నాయి అప్పన్న, జాతర, ఓ యింటి భాగోతం, రక్తబంధం (1980) పల్లెనవ్వింది, తల్లికొడుకులు, పసిహృదయాలు (1973), మరోమలుపు (1982), ఆడవాళ్ళు అపనిందలు, సోమరిపోతు వంటి తెలుగు చిత్రాలకు సంగీత రద్శకత్వం వహించారు. ఇలా తమిళ, కన్నడ, మలయాళ, తెలుగులోనే గాక హిందీ, బెంగాలి, అస్సామి, భాషా చిత్రాలకు సంగీతం అందించారాయన.

జి.కె.వెంకటేశ్ సంగీతంలో మెలోడికి ప్రాధ్యాత ఉంటుంది. తన కిష్టమైన శైలిలో స్వరాలు కూర్చుకుని గాయకుడిగా తనకు నచ్చేలా పాడించుకోవడం ఆయనలోని ప్రత్యేకత. అందుకు ఆయన బాణీలు కట్టిన ఎన్నోపాటలు హిట్.

ఈ నేపథ్యంలో స్వరపరచిన పాటల్లో 'వెన్నెల తెచ్చాడు మా పాపకు' 'ఘాటు ఘాటు ప్రేమ ఎడబాటు లాయెనే" "చిటుకుమన్నది చిటికెమ్మా" (అత్త గారు - కొత్తకోడలు) వేళచూడ వెన్నెలాయె (నాటకాల రాయుడు), 'రాశాను ప్రేమలేఖలెన్నో', 'జననీ నయనాలు', 'ఒన్ టు త్రిఫోర్ చక్కని చిలకమ్మ' 'చిరుగాలే వింజామర', 'గుండుమల్లె చెండువేసే' (శ్రీదేవి) 'పోతే పోనీరా' (ప్రాయశ్చిత్తం), త్యాగమనే కావ్యంలో నీవు కథా నాయిక, మంచి పుట్టిన రోజిది (ఆడవాళ్ళ అపనిందలు), చాకిరేవు కాడ నీసోకు, మ్రోగింది వీణ పదే పదే హృదయాల లోన (జమిందారు గారి అమ్మాయి), విరలా విరలా నువ్వెవరయ్యా నేనెవరయ్యా, పోరా పోకిరి పిలగాడా, మానవా ఏమున్నది ఈ దేహం, హరినామమే మధురం, కనుగొంటిని హరినీ కనుగొంటిని, ఎక్కడున్నావూ ప్రభూఎక్క డున్నావూ (చక్రధారి), ఈ సన్నాయి రాగానికి ఈ అమ్మాయి నాట్యానికి (సన్నాయి అప్పన్న), పిలిచిన పలికే దేవుడివయ్యా, వేంక టేశ్వరా (పసి హృదయాలు) వంటివి మచ్చుకు కొన్ని మాత్రమే. అమెరికా అమ్మాయిలోని "పాడనా తెనుగు పాట" పాట జి.కె.వెంకటేశ్‌ను తెలుగు సినిమా పాటల్లో చిరంజీవిని చేసింది. ఈ చిత్రంలోనే "ఒక వేణువు వినిపించెను అనురాగ గీతిక" పాటలో జి.ఆనంద్‌ను పరిచయం చేశారు. ఇంకా మాధవపెద్ది రమేశ్‌ను కూడా వీరే పరి చయం చేశారు. ఇంకా కన్నడ కంఠీరవుడైన రాజ్‌కుమార్‌ను గాయకునిగా మార్చిందీ ఈయనే. రాజ్‌కుమార్, ఆ తర్వాత గాయ కునిగా జాతీయ అవార్డు పొందారు. ఈయన గాయకునిగా 'తరంమారింది' లో 'చల్లగాలి ఈస్తూ ఉంటే' పాటను పాడారు కూడా. నేటి సంగీత దర్శకులు ఇళయరాజా, శంకర్ గణేష్‌లు ఆయన వద్ద శిష్యరికం చేసిన వారే. 1993 నవంబర్ 13న చెన్నయ్‌లో మృతి చెందారు. బహుభాషా చిత్ర సంగీత దర్శ కులుగా సినీమ్యూజిక్‌లో జీనియస్‌గా పేరొందిన జి.కె.వెంకటేష్ చిరస్వరస్మ రణీయులు.

-హెచ్.రమేష్‌బాబు

### చిత్రం: శ్రీదేవి
రచన: దాశరథి  గానం: యస్.జానకి, యస్.పి.బాలసుబ్రహ్మణ్యం

రాశాను ప్రేమలేఖలెన్నో
దాచాను ఆశలన్నీ నీలో
భువిలోన మల్లియలాయే
దివిలోన తారకలాయే నీ నవ్వులే
కొమ్మల్లో కోయిలమ్మ 'కో' యన్నది
నా మనసు నిన్నే తలచి 'ఓ' యన్నది
మురిపించే ముద్దుగులాబి మొగ్గేసింది
చిన్నారి చెక్కిలికేమో సిగ్గేసింది ॥రాశాను॥
నీ అడుగుల సవ్వడివుందీ నా గుండెలో
నీ చల్లని రూపం వుందీ నా కనులలో
నాలోని సోయగమంతా విరబూసెలే
మనకోసం స్వర్గాలన్నీ దిగివచ్చెనులే ॥రాశాను॥
అందాల పయ్యెద నేనై ఆటాడనా
కురులందూ కుసుమం నేనై చెలరేగనా
నీ చేతుల వీణను నేనై పాట పాడనా
నీ పెదవుల గుసగుస నేనై పొంగిపోదునా ॥రాశాను॥

### చిత్రం: జమిందారు గారి అమ్మాయి
రచన: దాశరథి  గానం: పి.సుశీల

మ్రోగింది వీణా - పదే పదే
హృదయాలలోన - ఆ దివ్యరాగం
అనురాగమై - సాగిందిలే
అధరాల మీద - ఆడింది నామం
కనుపాపలందు - కదిలింది రూపం
ఆ రూపమే - మరీ మరీ - నిలిచిందిలే ॥మ్రోగింది॥
సిరిమల్లె పువ్వు - కురిసింది నవ్వు
నెలరాజు అందం - వేసింది బంధం
ఆ బంధమే - మరీ మరీ - ఆనందమే ॥మ్రోగింది॥

### చిత్రం: అమెరికా అమ్మాయి
రచన: దేవులపల్లి  గానం: పి.సుశీల

పాడనా తెలుగుపాట - పరవశనై - నే
పరవశనై మీ యెదుట మీ పాట ॥పాడనా॥
కోవెల గంటల గణగణలో - గోదావరి తరగల గలగలలో
మావుల తోపుల, మూపులపైన - మసలేగాలుల గుసగుసలో
మంచిముత్యాల పేట - మధురామృతాలతేట... ఒకపాట ॥పాడనా॥
త్యాగయ - క్షేత్రయ, రామదాసులు - (2)
తనివితీర వినిపించినదీ
నాడు నాడున కదిలించేది - వాడవాడలా కరిగించేదీ
చక్కెరమాటల మూట - చిక్కని తేనెల ఊట... ఒకపాట ॥పాడనా॥
ఒళ్ళంత ఒయ్యారి కోక - కళ్ళకు కాటుకరేఖ
మెళ్ళోతాళి - కాళ్ళకు పారాణి - మెరిసే కుంకుమ బొట్టు
ఘల్లు ఘల్లున కడియాలందెల - అల్లనల్లన నడయాడే
తెలుగుతల్లి పెట్టనికోట - తెనుగునాట ప్రతినోట ఒకపాట ॥పాడనా॥

### చిత్రం: చక్రధారి
రచన: ఆత్రేయ  గానం: ఆనంద్/యస్.పి.బాలు

విఠలా విఠలా పాండురంగ విఠలా
జై పాండురంగ విఠలా జై పాండురంగ విఠలా
సర్వం మరచీ నీ స్మరణము సేయ
స్వర్లోక ఆనందమే ॥విఠలా॥
అంబుజనాభా నమ్మిన వారికి
అభయము నొసగీ ఆర్తిని బాపీ
ఉభయ తారకా పథమును చూపీ
ఉద్ధరించు కరుణా సింధో ॥విఠలా॥
నిన్నెరిగించే జ్ఞానమే జ్ఞానము
నిను స్మరియించే ధ్యానమే ధ్యానము
విను కీర్తించే గానమే గానము
నీ కర్పించే జన్మమే జన్మము ॥విఠలా॥

↑ ఈ పాటను మొదట ఆనంద్‌తో పాడించారు. రికార్డులు కూడా వచ్చాయి. కానీ బాలు పాడిన వెర్షన్ సినిమాలో వుంది. ఆ తరువాత బాలు పాడిన వెర్షన్ కూడా రికార్డులుగా రిలీజయింది.

### చిత్రం: నాటకాల రాయుడు
రచన: ఆత్రేయ  గానం: సుశీల

వేళచూడ వెన్నెలాయె
లోనచూడ వెచ్చనాయె
ఎందుకో మరి తెలియాదాయె
రేయి మాత్రం గడిచిపోయె ॥వేళ॥
కొమ్మ కొమ్మకు చిగుళ్లాయె
గుడినిండా గుబుళ్లాయె
పువ్వు పువ్వున తుమ్మెదాయె
పొంగు వయసుతో పోరులాయె
ఎందుకో మరి తెలియదాయె
రేయి మాత్రం గడిచిపోయె ॥వేళ॥
కునుకుపడితే వులికి పడుటాయె
మెలకువైతే కునుకురాదాయె
వల్లమాలిన వగలతోటే
భళ్లు భళ్లున తెల్లవారే
ఎందుకో మరి తెలియదాయె
రేయి మాత్రం గడిచిపోయే ॥వేళ॥
సరసమెరుగని చందమామ
చాటుమాటుగ సాగిపోయే
వెంటనున్న చుక్కకన్నె
జంట వుండీ ఒంటరాయే
ఎందుకో మరి తెలియదాయె
రేయి మాత్రం గడచిపోయే ॥వేళ॥




విడుదల : హెచ్.ఎం.వి
వెల : 40/-

# రాజా ఆడియో రివ్యూ

శ్రీకృష్ణుని పై సినీ భక్తి గీతాలను ఒక చోట చేర్చి శ్రోతలకు వినిపించే ప్రయత్నంగా వివిధ చిత్రాలలో వచ్చిన ఓ 14 పాటలను ఆడియో క్యాసెట్‌గా తీసుకువచ్చారు హెచ్.ఎం.వి.వారు.

ఈ క్యాసెట్‌లోని పాటలలో - ఇది నీదు లీల గిరిధారి (కృష్ణప్రేమ), ఘల్లు ఘల్లు మని (సతీ సక్కుబాయి), యశోదానందనా (వినాయకచవితి), మేలుకోవయ్యా కావేటిరంగా (గృహలక్ష్మి) జయ జయ లోకావనా (సతీ సుకన్య), పాటలు మాత్రమే భక్తిని కలిగించే విధంగా ఉన్న పాటలు. పాలించరా రంగా (విప్రనారాయణ) పాట శోక రసాన్ని మాత్రమే ప్రతి ఫలింప జేస్తుంది. శ్రీకర కరుణాలవాల (బొబ్బిలి యుద్ధం), కరుణా చూడవయా (దీపావళి), నల్లని వాడా రా రారా (వీరాభిమన్యు), పాటలు ఆయా సినిమాలలోని సన్నివేశాలకు అనుగుణంగా తీర్చిదిద్దబడిన పాటలు. భక్తి పూర్వకమైన సమావేశాలలో ఆలపించదగినవి కావు. నేనే రాధనోయి (అంతా మనమంచికే) పాట సంగీత సమావేశాలలో ప్రతిభను నిరూపించు కోవడానికి పనికివచ్చే పాట. వేణుగానమ్ము వినిపించెనే(సిరిసంపదలు) పాటలోని సాహిత్యం భక్తికి దోహదం చేసే విధంగా ఉన్నా సినిమాలోని సన్నివేశం భక్తికి సంబందించినది కాదు కనుక ట్యూన్‌లో ఆ ప్రమాణాలను ఊహించలేము. యారమితా వనమాలినా(భక్త జయదేవ) అనే అష్టపదిని ఈ రకమైన ప్రమాణాలతో తూచలేము. అది భక్తిని, శృంగారాన్ని కలిపిన సబ్జెక్ట్. దీనిపై విశ్లేషణకు ఈ కాన్వాస్ సరిపోదు. నువ్వు వస్తావని (మల్లెపూవు)పాట అప్పుడూ,ఇప్పుడూ అంత ఇంప్రెసివ్ గా లేదన్నదే ఈ సమీక్షకుని అభిప్రాయం కనుక తక్కిన పాటలతో సరసన నిలబెట్టి బేరీజు వేయరాదు.

ఇక కరుణాల వాల (చెంచులక్ష్మి) పాట 'శ్రీకృష్ణునిపై సినీ భక్తి గీతాలు' అనే సబ్జెక్ట్ కి సంబందించని గీతం. సినిమా పరంగా కరుణాల వాల పాట నరసింహావతార కాలానికి చెందిన సంఘటనలకు సంబంధించినది. ఈ గీతం మరి ఈ సబ్జెక్ట్ కి పనికొస్తుందని ఎలా అనుకున్నారో హెచ్.ఎం.వి. వారికే తెలియాలి.

హర్షించదగ్గ ప్రయత్నాలలో ఇటువంటి లోపాలు - పాటలను ఎంపిక చేసేముందు ఆసాంతం వినలేదేమోనన్న అనుమానాన్ని కలిగిస్తాయి.

## ఆడియోలు .. అతి త్వరలో ...

| | | |
|---|---|---|
| ఆదిత్య | : | నువ్వే నువ్వే |
| | | జెమిని |
| | | ప్రేమలో పావని కళ్యాణ్ |
| సుప్రీమ్ | : | బాబీ |
| | | ఒక్కడు |
| | | అంజి |
| హెచ్.ఎం.వి | : | ఎ.ఎన్.ఆర్. సినీ షష్టిపూర్తి |
| | | వాల్యూమ్ 1 & 2 |










"నా అభిమాన హీరో చిరంజీవి కొత్త సినిమాకెళ్తే టిక్కెట్లు దొరకలేదురా"

"అందుకే ఏ బాధా లేకుండా పెళ్ళి చేసుకోమంటున్నాను"

"నేనన్నదానికి దీనికి సంబంధమేమిటి?"

"అదే... పెళ్లి చేసుకుంటే టిక్కెట్ల కోసం లైన్లో నువ్వు బాధపడక్కర్లేదు. బ్లాక్ టిక్కెట్లు కొని డబ్బులు లాస్ చేసుకోనక్కరలేదు. ఎంచక్కా మీ ఆవిడే అలా లైన్లోకెళ్లి ఇలా టిక్కెట్లు తెచ్చిస్తుంది కదా మరి" చెప్పాడు సలహాల్రావ్.



మమత: కౌరవుల తర్వాత నేను పుట్టి వుండి వుంటే ఎంత బాగుండేది!?

మీనా : ఏం?

మమత: ఎంచక్కా 100 మంది పెళ్ళిళ్ళకి 100 ఆడపడుచు కట్నాలు వచ్చేవి కదా మరి.



రైల్వేస్టేషన్‌లో ప్లాట్‌ఫారం మీద తమ భార్యలను రిసీవ్ చేసుకునేందుకు వచ్చిన అప్పారావ్, సుబ్బారావ్‌ల మధ్య సంభాషణ....

"ఏమిటీ! ఇప్పుడు రావాల్సిన రైలు మధ్యలోనే పడిపోతుందా? నీకెలా తెల్సు?" ఆశ్చర్యంగా అడిగాడు సుబ్బారావ్ అప్పారావ్‌ని.

"మరిప్పుడు నేను వేయింగ్ మిషన్ మీద బరువు చూసుకున్నా. ఆ టికెట్ వెనుక ప్రచురించిన జాతకంలో ఇప్పుడు మీ ఆవిడ నుండి మీకు విముక్తి లభిస్తుంది అని వుంది. మరి మా ఆవిడ పుట్టింటి నుండి ఇప్పుడు రావాల్సిన రైలులోనే వస్తుంది కదా మరి" ఆనందంగా చెప్పాడు అప్పారావ్.



"ఆ అమ్మాయిని ప్రేమించక ముందు హాయిగా బఠాణీలు కొనుక్కునే వాడ్ని"

"ఆహా! మరిప్పుడేం చేస్తున్నావ్?"

"బఠాణీలు అమ్ముతున్నాను".





'ఏమండీ మన అబ్బాయి హైజంప్‌లోను, లాంగ్ జంప్‌లోను ఫస్టొచ్చాడండీ అంది భార్య.

అయితే వాడు పెద్దయిన తర్వాత ఒక పార్టీలో నుండి మరొక పార్టీలోకి నాకన్నా బాగా జంప్ చెయ్యగలడన్నమాట' అన్నాడు రాజకీయ నాయకుడైన ఆ భర్త తెగ ఆనందపడిపోతూ.

'నేను ఛస్తేగాని నీకు బుద్ధిరాదే' భార్య మీద కోపంగా అన్నాడు బ్రహ్మానందం.

"అందుకే కదండి నేను బుద్ధిని రాకుండా చేసుకుంటున్నాను! మీరు కలకాలం జీవించి ఉండటం కోసం నేనెంత త్యాగం చేస్తున్నానో ఎప్పుడైనా గమనించారా మీరు!?"






మంత్రిగార్ని ఇంటర్వ్యూ చేస్తున్నాడు విలేఖరి.

విలేఖరి: : అప్పటికి, ఇప్పటికి గల మార్పు ఏమిటండీ?

మంత్రి : అప్పటి కాలంలో నేను జేబులు కత్తిరించేవాడ్ని. ఇప్పుడు రిబ్బన్లు కత్తిరిస్తున్నాను.

భార్య :ఏమండీ! ఆ ఎదురింటాయన తన భార్య మీద ఎంత ప్రేమో చూడండి. ఆమె చనిపోతే ఆవిడ ఫొటోని పూల దండలతో ముంచెత్తు తున్నాడు.

భర్త :దేవుడి దయవలన నాకు అలాంటి అవకాశం వస్తే కనుక అంతకు రెట్టింపు పూలతో నీ ఫొటోని ముంచెత్తనూ?





'ఏమిటయ్యా! బస్ టాప్ మీద కెక్కావ్?'

'మరి బస్సులో పొగత్రాగరాదు అని వ్రాసి వుంది కదండీ. అందుకే ఇక్కడైతే ఏ బాధా వుండదనీ".



మాస్టారు:ఏరా రామూ! నాకు దగ్గరగా ముందు బెంచీలో కూర్చునే వాడివి, హఠాత్తుగా ఆ చివరి బెంచీలోకి మారిపోయావేం?

రాము :మరి మీరే కదండి దుష్టులకు దూరంగా ఉండాలని చెప్పారు.



ఇద్దరు మహిళలు మాట్లాడుకుంటున్నారు. "వాసన వస్తుంది కదా అని పిల్లలకు పుదీనా పెట్టడం మానెయ్యకూడదు... పిల్లల ఎదుగుదలకూ... బలానికి అది బాగా ఉపకరిస్తుంది".

"పుదీనా తినీ తినీ పెరిగి పెద్దయి బలం వచ్చిన తర్వాత?"

"ఆ తర్వాతేం వుంది... పుదీనా పెట్టినందుకు చితక తంతారు ... అంతే"



'అదేంటోరా, అందరూ భోజనాలలో పెట్టినవన్నీ తినకుండా వదిలేస్తూ ఉంటారు. చూడు నేనైతే ఏదీ వదలకుండా తినేసాను"

"ఒక్కటి మాత్రం మర్చిపోయావ్‌రా"

"ఏంటది?"

"విస్తరాకు".



"ముప్ఫై ఏళ్ళుగా మా ఆయనకున్న గోళ్ళు కొరికే అలవాటు ఒకేఒక్క ట్రీట్‌మెంట్‌తో పోయింది తెలుసా...!?"

"ట్రీట్‌మెంటా.... నాకు తెలిసిగోళ్ళు పెరగడాన్ని ఆపే మందేదీ లేదే..!?"

"ఆ సంగతి నాకూ తెలుసు. అందుకే పళ్ళు పీకించేశా...."




విడుదల : ఆదిత్య

వెల : 38/-




క్లాస్ టు మాస్ అంతా - ఉన్న అన్నీ పాటలూ మెచ్చుకునేలా ఆడియో ఉండటం, ఆ ఆడియో విడుదలయి, రివ్యూలు అన్ని పత్రికలలోనూ వచ్చేలోగా అతి ఫాస్ట్‌గా ట్రిపుల్ ప్లాటినమ్ డిస్క్ ఫంక్షన్ కూడా జరుపుకోవటం అరుదుగా జరిగే సంఘటనలలో ఒకటి. ఇటీవల ఆ ఘనతను సాధించిన ఆడియోగా 'ఒకటో నంబరు కుర్రాడు'ని చెప్పుకోవాలి. తన కుమార్తె స్వప్న పేరుతో స్థాపించిన బ్యానర్‌పై ప్రముఖ నిర్మాత అశ్వనీదత్ తీసిన ఈ సినిమాకి దర్శకుడు ఎ.కోదండ రామిరెడ్డి. దర్శకత్వ పర్యవేక్షణ కె.రాఘవేంద్రరావు. ఎన్.టి. రామారావు గారి మనవడు నందమూరి తారక రత్న హీరో. సంగీతం కీరవాణి, పాటలు చంద్రబోస్, సుద్దాల అశోక్ తేజ. ఇంతమంది కలయికతో తయారైన ఈ ఆడియోను ఓ మంచి కలెక్షన్‌గా దాచుకోవచ్చు.

బాలు, గాయత్రి పాడిన 'తొడగొట్టి చెబుతున్నా తొలిమాట' పాటలో 'ఏవేవి రెండక్షరాలో' చెబుతూ చంద్రబోస్ చేసిన స్కీమ్‌తో పాటు 'ప్రేమన్నది ప్రతి ఒక్కరు చదవాల్సిన బుక్కు / ప్రేమన్నది ప్రతి ఒక్కరు తీర్చాల్సిన మొక్కు' అనే వాక్యాలు భలేగా ఉన్నాయి. దీనికి బాలు వాయిస్, కీరవాణి ట్యూన్ ఎంత ప్లస్ అయ్యాయో పాట విన్నవారికి మాత్రమే అర్థం అవుతుంది.

కీరవాణి, గంగ పాడిన 'నువ్వు చూడూ చూడకపో నే చూస్తూనే వుంటా' పాట సాహిత్యంలో మొత్తం అంతా ఒక పొయెటిక్ టచ్‌తో ఉన్నా - 'ఎదురు ప్రశ్నలే వెయ్యనుగా / ఎదురు చూపులే ఆపనుగా' అనే వాక్యాలలో 'ఎదురు' అనే పదానికి ఇచ్చిన ఎక్స్‌ప్రెసివ్ వాల్యూ బావుంది. కీరవాణి తను పాడే పాటలకు మంచి ట్యూన్ చేసేసుకుంటాడా, లేక మంచి ట్యూన్ పడిన పాటలను తన కోసం అట్టే పెట్టేసుకుంటాడా లేక ఈ రెండురకాల ఇంప్రెషన్‌లూ వినే వారిలో కలిగేటంత గొప్పగా పాడతాడా అన్నంత చక్కగా వచ్చిందీ పాట. మళ్ళీ మళ్ళీ వినాలనిపించే పాట ఇది.

'ఒరేయ్... నువ్వు నాకు నచ్చావ్‌రా.... ఒరేయ్ ... ఐలవ్ యూ రా' పాట హిట్‌సాంగ్ ఆఫ్ ది ఆడియో అండ్ ఫిల్మ్ కూడా! చనువుగా తిట్టుకునే తిట్లతో ఈ పాటను చంద్రబోస్ ఎంత లబ్జుగా రాశాడంటే - పదిమందిలో లేనిపోని పెద్దరికాలతో- 'మాది యమాటేస్టు' అనే భేషజాలతో బిగుసుకుపోయే వారు కూడా చాటుగా ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ మరోసారి వినే లెవెల్లో రాశాడు. 'చిన్నప్పుడు రతికేళిక / నున్నప్పుడు కవిత లోన యుద్ధములోనన్ / వన్నె సుమీ 'రా' కొట్టుట / చెన్నుగనో పూసపాటి సీతారామరాజా' అంటూ ఆడిదం సూరకవి రాసిన చాటువును ఈ సందర్భంగా గుర్తు చేసుకుంటే చంద్రబోస్ ఈ పాటలో చేసిన ప్రయోగం పట్ల సదభిప్రాయమే కలుగుతుంది. కొన్నాళ్ళ వరకు ఈ పాటతో చంద్రబోస్ ఐడెంటిఫై అయిపోయినా ఆశ్చర్యం లేదు.

ఇదిలా వుండగా ఈ పాటకు కీరవాణి అందించిన ట్యూన్‌ని యస్.పి.చరణ్, చిత్ర కలిసి పాడిన పద్ధతి - ముఖ్యంగా 'నచ్చావురా' దగ్గర చరణ్ నొక్కిన ఓ చిన్న నొక్కు - ఇవన్నీ పాటని మరింత ఆకర్షణీయంగా తీర్చిదిద్దాయి.

టిప్పు, కల్పన పాడిన 'అగ్గిపుల్ల గియ్యగానే భగ్గుమంటు మండినట్టు ఆడపిల్ల చేతి స్పర్శ తగిలెనయ్యా హో' పాట - కీరవాణి ప్రతిభా విశేషాలను చాటి చెప్పేపాట. ఏ రేంజ్‌లోనైనా తమ స్వరంలో అపస్వరం పడకుండా, అపశ్రుతి దొర్లకుండా ఉండాలంటే ఔత్సాహిక గాయనీ గాయకులు తప్పనిసరిగా సాధన చెయ్యాల్సిన పాట ఇది. మధ్యమావతి రాగానికి మంచి ఉదాహరణగా నిలిచిపోదగ్గ ఈ హుషారైన గీతంలో 'గిచ్చుహో'కి ప్రాసగా 'చచ్చుహో' లాంటి ప్రయోగాన్ని సరదాగానే తీసుకోవాలి. కాదంటే అన్నపూర్ణ వారి 'దొంగ రాముడు'లో 'ఒరే ... భద్రుడూ నే చచ్చిపోతా' అంటూ వేధించే తల్లితో 'చచ్చుకమ్మా' అంటూ కొన్నాళ్ళు 'సరే చచ్చు' అంటూ ఆఖరున అనే రేలంగిని గుర్తు చేసుకోండి చాలు.

ఉదిత్‌నారాయణ్, చిత్ర పాడిన 'నెమలి కన్నోడా నమిలే చూపోడా' పాట ఓపెనింగ్ - ఇదివరలో మాల్‌కౌస్ రాగంలో వచ్చిన పగలే వెన్నెల, ఆధాహై చంద్రమా పాటలను గుర్తు చేస్తూ - సాగిపోతుంది. ఉదిత్ నారాయణ్ పాడే పద్ధతి, ఆయనకు కేటాయించిన పల్లవిలోని సాహిత్యం ఈ రెండూ వినడానికి ఇబ్బందిగా అనిపించినా పాట ట్యూన్, ఆర్కెస్ట్రయిజేషను పాటను నడిపించుకుంటూ పోతాయి. ఈ సినిమాలో సుద్దాల అశోక్ తేజ రాసిన పాట ఇదొక్కటే. మిగిలిన అయిదు చంద్రబోస్ రాసినవి.

కెవీ మహదేవన్ అంటే కీరవాణికి ఎంత ఇష్టమో ఎంత ఆరాధనా భావమో సంగీతప్రియులందరికీ తెలిసిన విషయమే. అందుకే ఆయన్ని గుర్తు చేసుకునే విధంగా అప్పుడప్పుడు కొన్నిపాటలను మనకు రుచి చూపిస్తూ ఉంటాడనేది కూడా అందరికీ తెలిసినదే... ఈసారి ఈ ఆడియోలో 'మంచి మనసులు' సినిమాలోని 'మావా మావా' పాట గుర్తొచ్చేట్టు 'ఆశ ఆశ' అంటూ ఓ పాటను చాలా బాగా ట్యూన్ చేశారు కీరవాణి. 'ఎన్ని జన్మలెత్తినా ఆడదిగా పుట్టాలని' అనే పల్లవితో మొదలయ్యే ఈ పాటకు చక్కని హాంటింగ్ ట్యూన్ జత పడింది. ఇక సాహిత్యం విషయానికొస్తే మొదటి చరణంలో గుట్టురట్టు చేసే చిలిపితనం కనిపిస్తే రెండో చరణంలో పరిణత చెందిన ప్రౌఢత్వం కనిపిస్తుంది. నిజమైన అభిమానులు చంద్రబోస్ నుండి కోరుకోవలసినది ఈ పరిణత చెందిన ప్రౌఢత్వమే!


సత్యమూర్తి
చదువులావు
కాలేజీడే ఫంక్షన్ అయ్యాక
బస్ స్టాండ్ వరకూ లైటులేవుట. ఆ బ్రైటులైట్ తీసుకుని వీళ్ళని బస్ స్టాండ్ దాకా దిగబెట్టి రారా శంకరం
గురూ గురూ నేను దిగబెడ్తాను
నువ్వు మన యూనియన్ రూమ్‌లో ఉన్న ఆడవాళ్ళని దిగబెట్టిగాని
ఓ యస్
ఓసారి అద్దంలో చూసుకోనియ్
బచ్చానా దేవుడా... వీళ్ళనా?!
బయల్దేరు నాయనా... ఇంతోటి 2 మైళ్ళకి బస్సు కూడా ఎందుకు... నడిచి వెళ్దాం పద



# పాలించడానికే పుట్టానంటున్న నటుడు, గాయకుడు విల్‌స్మిత్

'మెన్ ఇన్ బ్లాక్' చూసిన వారెవ్వరూ విల్‌స్మిత్‌ను మర్చిపోలేరు. ఒకవేళ నటుడిగా మర్చిపోదామన్నా గాయకుడిగా మర్చిపోలేని విధంగా ఎదిగాడు విల్‌స్మిత్. అతని లేటెస్టు ఆల్బమ్ "బోర్న్ టు రైన్" (సోనీ మ్యూజిక్ - 130.00 రూ॥లు) వెలువడింది.

దాంట్లో ఉన్న టిపికల్ విల్‌స్మిత్ పాటలు శ్రోతల హృదయాలను దోచుకోక మానవు. "ఏక్ట్ లైక్ యూ నో", "విల్లో ఈజ్ ఎ పవర్" క్యాచీగా ఉంటే "హా డా బీట్ గోస్", "బ్లాక్ పార్టీ" కాస్త స్లో. ఆల్బమ్‌లోఅత్యంత ప్రజాదరణ పొందేది మాత్రం "బ్లాక్ సూట్స్ కమింగ్" (మెన్ ఇన్ బ్లాక్ పార్టు 2). వినగానే ఆకట్టుకోవడమే కాదు, రిథమ్‌తో బాటు 'రాక్' సౌండ్ కూడా దానికి అదనపు ఆకర్షణ.

మెన్ ఇన్ బ్లాక్ కు పార్ట్ 2 వస్తుందని ముందులో ఎవరూ ఊహించలేదు. మొదటిభాగం 1997లో రిలీజయింది. విల్‌స్మిత్‌తోబాటు, టామీలీ జోన్స్ నటించిన ఈ సైంటిఫిక్ థ్రిల్లర్ ఇద్దరు వ్యక్తులు ప్రపంచం నుండి దుష్టశక్తులను తరిమివేయడం కథాంశంగా నిర్మించబడింది. సినిమా హిట్ అవుతుందని ముందే ఊహించివుంటే నటీనటులను ముందుగానే బుక్ చేసుకుని ఉండేవారేమో! కానీ నిర్మాతల ఊహలను మించి 'మెన్ ఇన్ బ్లాక్' తొలివారానికే 400 కోట్లు అర్జించింది. సీక్వెల్ నిర్మిస్తే ఆ పాప్యులారిటీని క్యాష్ చేసుకోవచ్చు కానీ అప్పటికే విల్‌స్మిత్, టామీలీ జోన్స్ ఇతర నిర్మాతల చిత్రాల్లో నటించడానికి డేట్స్ ఇచ్చేసి వున్నారు. వారు లేకుండా సీక్వెల్ తీస్తే ఫలితం ఉండదని గ్రహించిన నిర్మాతలు వారి డేట్లకై ఓపిక పట్టవలసివచ్చింది. అందుకే రెండో భాగం తీయడానికి ఐదేళ్ళు పట్టిందన్నాడు డైరెక్టరు సోనెన్‌ఫీల్డ్.

హీరోలిద్దరిలోనూ చిన్నవాడైన విల్‌స్మిత్ (విలియార్డ్ క్రిస్టఫర్ స్మిత్ జూనియర్) ఫిలడెల్ఫియాలో 1968 సెప్టెంబరు 25న ఆఫ్రో-అమెరికన్ సంతతిలో పుట్టాడు. చిన్నప్పటి నుండీ సినిమా అన్నా, సంగీతం అన్నా అతనికి ఇష్టం. ఆఫ్రో-అమెరికన్ టెలివిజన్ సీరీస్ "ఫ్రెష్ ప్రిన్స్ ఆఫ్ బెల్-ఎయిర్" (ప్రస్తుతం జీ ఇంగ్లీషు ఛానెల్‌లో ప్రదర్శించపడుతోంది)లో తొలిసారిగా తెరపైకి వచ్చాడు.



ఇండిపెండెన్స్ డే, బాడ్ బాయిస్, ఎనిమీ ఆఫ్ ది స్టేట్, ది లెజెండ్ ఆఫ్ బాగర్ వాన్స్, మెన్ ఇన్ ఇన్ బ్లాక్ (ఈ సినిమాలో రేబాన్ గ్లాసులు ధరించి వాటిని మరింత పాప్యులర్ చేశాడు) లతో బాటు ఇటీవల విడుదలయిన 'సిక్స్ డిగ్రీస్ ఆఫ్ సెపరేషన్", "మెన్ ఇన్ బ్లాక్ - II" లలో అతని నటనకు ఎంతో పేరు వచ్చింది. బాక్సర్‌గా ప్రపంచప్రఖ్యాతి గాంచిన మహమ్మద్ ఆలీ (ముస్లిమ్ కాని క్రితం కాషియస్ క్లే) జీవితం ఆధారంగా నిర్మించబడుతున్న "ఆలీ"




చిత్రంలో ప్రధానపాత్ర అతనికి మరింత పేరు తెచ్చిపెడుతుందని ఖచ్చితంగా చెప్పవచ్చు.

రాప్ మ్యూజిక్ రంగానికి వస్తే విల్లీ ఫస్ట్ మేజర్ హిట్ "మియామీ"పాట. ఆ మాటకొస్తే 1988లోనే "హీ ఈజ్ ది డిజె, ఐయామ్ ది రాపర్" పాటకు గ్రామీ అవార్డు గెలుచుకున్నాడు. మళ్లీ 1991లో "సమ్మర్‌టైమ్" పాటకు గ్రామీ అవార్డు వచ్చింది. ఈ పాటకు ఇంకా ఇతర అవార్డులు కూడా వచ్చాయి. ముఖ్యంగా అమెరికన్ మ్యూజిక్ ఎవార్డు కూడా లభించింది. "మియామీ" తర్వాత "గెటింగ్ జిగ్గీ విత్ ఇట్" (1998) కూడా మంచి హిట్టే. మియామీలో కొన్ని ఫన్నీ లిరిక్స్ ఉన్నా గెటింగ్ జిగ్గీలో రిథమ్ చాలా బాగుంటుంది.

కాస్త విరామం తర్వాత 1997లో వచ్చిన 'మెన్ ఇన్ బ్లాక్'లో సౌండ్‌ట్రాక్ గాయకుడిగా విల్‌స్మిత్ మళ్ళీ పేరు తెచ్చిపెట్టింది. ఇప్పుడు ఈ "బోర్న్ టు రైన్" (Born to Reign) పరిపాలించడానికే పుట్టానంటున్న అతని మాటల్ని నిజం చేసేట్టు ఉంది..

**-కమ్యూనికేటర్ ఫీచర్స్**

## రచన: చంద్రబోస్ — 1 — గానం : బాలు, గాడ్విన్

ప: తొడగొట్టి చెబుతున్నా -తొలిమాట
జబ్బచరిచి చెబుతున్నా -భలేమాట
రొమ్ము విరిచి చెబుతున్నా కాలుదువ్వి చెబుతున్నా
బల్లగుద్ది చెబుతున్నా -బంపర్‌మాట
ప్రేమన్నది ప్రతిఒక్కరు చదవాల్సిన బుక్కు
ప్రేమన్నది ప్రతిఒక్కరు తీర్చాల్సిన మొక్కు
ప్రేమన్నది రాజ్యాంగం మనకిచ్చిన హక్కు
ఇదే తారకమంత్రం -నేటి యువతకు సూత్రం ॥2॥
ఇదే తారకమంత్రం -యిది అక్షరసత్యం
చ: ఆడ రెండక్షరాలు -మగ రెండే అక్షరాలు
ఆడ మగ మధ్య పుట్టు ప్రేమే రెండక్షరాలు
తప్పు రెండక్షరాలు -ఒప్పు రెండు అక్షరాలు
తప్పొప్పులు చేయించు ప్రేమే రెండక్షరాలు
బాధా రెండక్షరాలు -హాయీ రెండక్షరాలు
యీ రెంటిని కలిగించు ప్రేమే రెండక్షరాలు
ప్రేమన్నది ఫలియిస్తే పెళ్లి రెండక్షరాలు
ప్రేమన్నది వికటిస్తే పిచ్చి కూడా రెండక్షరాలే ॥ఇదే తారక॥
చ: ప్రేమన్నది ఒకగ్రామం - ప్రేమికులకు స్వగ్రామం
అ/కో: ఫీల్ ఫీల్ ఫీల్ ది రిథమ్
ఎదిరించిన వాళ్లతోటి చేస్తుందోయ్ సంగ్రామం
అ/కో: హే మాన్ దట్స్ రైట్ యు నీడ్ టు ఫైట్
ప్రేమన్నది పదో గ్రహం - అందించును అనుగ్రహం
ఆ/కో: లివ్ లివ్ డోన్ట్ లివ్ ఒ&ఆ ఫీల్
అనుగ్రహమే పొందుటకు కావాలోయ్ నిగ్రహం
ఆ/కో: కూల్ కూల్ ఐ వాన్ట్ యిట్ కూల్
ప్రేమన్నది ఒక దారం - అన్నిటికది ఆధారం
ప్రేమించిన హృదయాల్లో పూస్తుందోయ్ మందారం
ప్రేముంటే సౌభాగ్యం - లేకుంటే దౌర్భాగ్యం
లవ్వాడుట ఆరోగ్యం - ఆడకుంటే అదో అనారోగ్యం ॥ఇదే తారక॥

## రచన: చంద్రబోస్ — 2 — గానం : కీరవాణి, గంగ

సాకి: నువు చూడు చూడకపో
అ/ప: నువు చూడు చూడకపో - నే చూస్తూనే వుంటా
మాటాడు ఆడకపో - మాటాడుతునే వుంటా
ప్రేమించు మించకపో - ప్రేమిస్తూనే వుంటా
నాప్రాణం నా ధ్యానం - నువ్వేలెమ్మంటా ॥నువు॥
అ/చ: నువు తిట్టినా - నీ నోటివెంట నా పేరొచ్చిందని సంబరపడతా
నువు కొట్టినా - నా చెంపమీద నీ గురుతొకటుందని సంతోషిస్తా
మనసు పువ్వును అందించాను - కొప్పులో నిలుపుకుంటావో కాలికింద నలిపేస్తావో
వలపు గువ్వను పంపించాను - బొట్టుపెట్టి రమ్మంటావో గొంతుపట్టి గెంటేస్తావో
ఏం చేసినా ఎవరాపినా చేసేది చేస్తుంటా.. ॥నువు॥
చ: పూజించడం పూజారి వంతు - వరమివ్వడమన్నది దేవత యిష్టం
ప్రేమించడం ప్రేమికుడి వంతు - కరుణించడమన్నది ప్రేయసి యిష్టం
ఎందువల్ల నిను ప్రేమించిందో - చిన్ని మనసుకే తెలియదుగా
నిన్ను మరవడం జరగదుగా



ఆ: నెమలి కన్నోడా
అ: తననా నానానా
ఆ: నమిలే చూపోడా ॥నెమలి॥
అ: ఎండకన్నే తగలకుండా దాచుకున్న జాబిలి ఇవ్వు
ఆ: ఎంగిలి కాని తీర్థం తెచ్చి నాపైజల్లి ఎత్తుకుపోరా
అ: బంగారం పరుగెత్తి వచ్చిందిలే
నీ మేని చమటయ్యి కరిగేందుకు
ఆ: నీ రెక్క చిరుగాలి విసిరిందిలే
నా మనసులో తేమ ఆరేందుకు
అ: అబ్బో యబ్బా దెబ్బ కొట్టావే (2)
తీపి గుండెల్లో ఆశ పుట్టిందే
ఆ: తననా నానానా
అ: చిలకా నీ మొగ్గ
ఆ: తననా నానానా
అ: నలిపే పోతాగా చిలకా నీ మొగ్గ నలిపే పోతాగా
ఉలికి పడితే మరి ఎట్టాగమ్మో..
ఆ: అరె బొడ్డుకు వున్న తాళం తీస్తే ఒడ్డున చేపైపోతా

## రచన: చంద్రబోస్ — 6 — గానం : బాలు, చిత్ర

ఆ: ఎన్ని జన్మలెత్తినా ఆడదిగా పుట్టాలని అందంగా పెరగాలని
చిట్టి గౌను వయసులోంచి చీరలోకి రావాలని
పెళ్లంటూ చేసుకుంటే.. నిన్నే నిన్నే నిన్నే నిన్నే చేసుకోవాలని
అన్నీ అన్నీ అన్నీ అన్నీ యిచ్చుకోవాలని ఆశ ఆశ..(4) పిచ్చి ఆశ
అ: ఎన్ని జన్మలెత్తినా మగవాడై పుట్టాలని మీసాలే పెంచాలని
పొట్టి లాగు వయసుదాటి ప్యాంటు నేను తొడగాలని
పెళ్లంటూ చేసుకుంటే నిన్నే నిన్నే నిన్నే నిన్నే చేసుకోవాలని
అన్నీ అన్నీ అన్నీ అన్నీ పుచ్చుకోవాలని ఆశ.. ఆశ..(4) చచ్చే ఆశ
చ/అ: నిన్నంటూ చూశాక మాటాడే ఆశ - మాటల్నే కలిపాక మనసిచ్చే ఆశ
ఆ: యిద్దరికీ ప్రేమన్నది కలగాలని ఆశ - పెద్దలకి మన సంగతి తెలియాలని ఆశ
అ: పెద్దలకి తెలిశాక పెళ్లంటూ కుదిరాక
ఆ: తాళంటూ బిగిశాక గోలంతా ముగిశాక
అ: ఫలహారం తిన్నాక పడకింటికి చేరాక
ఆ: తలుపులనే మూశాక తలగడలే సర్దాక
అ: బెడ్‌లైటే ఆర్పాక వడ్డాణం విప్పాక
ఆ: దగ్గరగా జరిగాక - బిగ్గరగా... ---- -- అ: చెప్పు..
ఆ: ఆశ.. ఆశ.. ఆశ దోశ అ: దోచే ఆశ
చ/ఆ: గోడలకి మన గొడవలు తెలియొద్దని ఆశ
మంచం మన ముచ్చట్లను చూడొద్దని ఆశ
అ: పడకింట్లో పెనవేతలు ఆపాలని ఆశ
డాబాపై దోబూచులు ఆడాలని ఆశ
ఆ: డాబాపై కెక్కాక - దాహాలే పెరిగాక అ: వెన్నెల్లో తడిశాక - వెచ్చంగా మరిగాక
ఆ: ముద్దుల్లో మునిగాక - మును ముందుకు వెళ్లాక
అ: గుణకారం చేశాక - ఘనకార్యం జరిగాక
ఆ: అదికాస్తా తెలిశాక - ఆనందం ఎగిశాక
అ: మరికాస్తా అడిగాక - అడిగాకా..
ఆ: చెప్పు అ: ఆశ ఆశ ఆ: ఆశ దోశ అ: తీర్చే ఆశ ॥ఎన్ని॥



## రచన: వరికుప్పల యాదగిరి — 1 — గానం: శంకర్ మహదేవన్

ప: చెప్పమ్మా చెప్పమ్మా చిలకమ్మా నీ అందమైన చిరునామా
ఇప్పుడే ఇక్కడే వాలిపోమ్మా ఎద తలుపు తెరుచుకుందమ్మా
నీదే ఆలోచన ఎటువైపు చూపు వెలుతున్నా
ఓ కన్నె వనమా కవ్వించకమ్మా నా మనసే నిలకడలేక
నీ ఊహ వెనుక మాటైన వినక తన ఉనికే బదులే లేక
చెప్పమ్మా చెప్పమ్మా...(2) చిలకమ్మా నీ అందమైన చిరునామా
చ: నీ రూపురేఖల బొమ్మ నా వలపే దోచక
నా చూపు జాడలకైన ఆ ఛాయలే అందక
నీ స్నేహ గీతిక కోసం వేచింది ఎదవేదిక
నీ చూపులు సోకేదాకా నిదురైనా రాదే ఇక
గుండెల్లో గుప్పున ఎన్నెన్నో చిగురాశలే
కళ్లల్లో కమ్మని కలలే కదిలించేనే
చిలిపి వయసు తలపు కవిత చెదిరె
కన్నెవరమా కవ్వించకమ్మా
నా మనసే నిలకడలేక ॥నీ ఊహ॥
చ: నిన్ను చూడగానే నాలో ఏ భావం ఉప్పొంగునో
అనుకుంటే నాలోలోనే ఒక వింతగా ఉన్నదే
ఏ తీరుగా నన్ను నీతో పరిచయం కలిగించునో
ఆ తీపి కలయికనాలో ఏ రాగమొలికించునో
ముందుగా అందితే తియ్యని సంకేతమే
చేతికే అందదా అందని ఆకాశమే
మనసు పడిన వరం దొరికిపోదా ॥ఓ కన్నె॥ ॥నీ ఊహ॥

## రచన: వరికుప్పల యాదగిరి — 2 — గానం: హరీష్‌రాఘవేంద్ర

ప/అ: ముద్దుగుమ్మ పైడిబొమ్మ అదిరిందోయమ్మ
నాజూకుతనమా నమ్మవమ్మా నువ్వంటే ప్రేమ ॥ముద్దుగుమ్మ॥
చెప్పకుండా పోతావేమ్మా చక్కనైనా మీనమ్మ
మనకు మనకు గొడవేంటమ్మా మర్చిపోవే చిట్టమ్మా
మొహమాటమా కోపమా నేనేల కనుగొందునో ॥ముద్దుగుమ్మ॥
చ: నిన్ను చూసి నవ్వానా లేదులే చెలి
కన్నుగీటి పిలిచానా కాదులేమరి
మూతిముడుచి కెలుతుంటే బుగ్గ సుందరి
ముద్దుముద్దుగా ఉందే సొగసు వైఖరి
చెప్పాలనుకున్నదేదో చెప్పేసే సూటిగా
ఓ.కె. చేస్తావా కిస్ కొలతే (2) ॥ముద్దుగుమ్మ॥
చ: ఒట్టుపెట్టి చెబుతున్న నమ్మవే చెలి
నువ్వు తప్ప ఇంకెవరు నచ్చరే చెలి
మాట ఇచ్చి వచ్చానే ఇంటివాళ్లకి
నిన్ను గెలుచుకుంటేనే థ్రిల్ మనసుకి
అలిగి అలిగిపోవద్దే నువ్వు అట్టా సుందరి
జోడికట్టేస్తే ఎందుకల్లరి (2) ॥ముద్దుగుమ్మ॥ ॥చెప్పకుండా॥
ముద్దుగుమ్మ పైడిబొమ్మ అదిరిందోయమ్మ
నాజూకుతనమా నమ్మవమ్మా నువ్వంటే ప్రేమ



గులకరాళ్ళు విసురుతాడే
వెనకనుంచి వచ్చి కళ్ళు రెండు మూసి
నన్ను ఇలికి నెట్టి నవ్వుతాడే
అ: ఒక్కోసారి కోపంతో తెగ అరుస్తుందే
ఆ: సుతారంగా దువ్వి దువ్వి మురిపిస్తాడే
అ: ఎన్ని చెప్పినా ఎంత సతాయించినా
అప్పుడప్పుడు దాన్ని కష్టపెట్టిన నన్ను విడిచి
దూరమైతే బతకలేను బావ అంటాదే..
అదేనా మరదలటా.. అదేనా మరదలటా
అదేనా మరదలటా.. అదేనా మరదలటా
ప/ఆ: అడగక్కర్లేదు నా బావ ఎక్కడని
చెప్పక్కర్లేదు వాడు మోటు మోజుల్ని
పొద్దున్న లేస్తే ముద్దు అంటాడే
సద్దులేమో చెప్పేస్తాడు వద్దంటే దగ్గరకొచ్చి
తుంటరివాడు చుట్టుకుంటాడే
వాడేనా బావంటే.. వాడేనా బావంటే
వాడేనా బావంటే.. వాడేనా బావంటే
అ: పిలవక్కర్లేదు నా కొంటె మరదలని
చెప్పక్కర్లేదు నా స్వీట్ సరసాన్ని
చూపుల్తోనే చుట్టేస్తుంది మాటల్లోనే కట్టేస్తుంది
సైగల్తోనే ఒప్పించి చప్పున ముద్దు పెట్టుకుంటదే
అదేనా మరదలటా.. అదేనా మరదలటా
అదేనా మరదలటా.. అదేనా మరదలటా

## రచన: చైదల బాపు — 6 — గానం: ఎస్.పి.బి., చిత్ర

ప/ఆ: అనురాగం మా పేరు అభిమానం మా ఊరు
ఆప్యాయత గలవారు మా వియ్యంకులవారు
శుభమంటూ పిలిచారు ఆహ్వానం పలికారు
కమనీయం మీ తీరు మా వియ్యంకులవారు
చ/ఆ: జేబురుమాలు పట్టుకుపోయే పందెం వేద్దాం రండి
అ: సై అంటే మరి సై అంటాం మీరింక కాసుకోండి
ఆటపాట అన్నింట్లో మీకోసం తీసిపోం
ఆ: తాడోపేడో తేలేదాక మేం ఊరుకోం
అ: ఆటలో గెలుపు మాదండీ
ఆ: మాటతో గెలుపురాదండి
అ: కిటుకులే మాకు తెలుసండీ
ఆ: అది ఏదో చేసి చూపండి
అ: ఓడితే ఏం చేస్తారండీ
ఆ: ఆ మాట మేం ఎరగమండీ
ప: మనసులు కలవని పెళ్లికి అర్థం లేనేలేదు కదండీ
ఆ మనసులు కలిపే జంటకు నేడు మనువే జరిగేనండీ..
అ: కొంగులు రెంటిని కలిపే ముడినే బ్రహ్మముడి అంటారండీ
ఆ: మరి ఆ పెళ్లిళ్లంటూ జరిగేది ఆ స్వర్గంలోనే కదండీ
అ: రెండుగా వున్న ఈ జంట నేటితో ఒక్కటే అవునంటూ
ఆ: అందాల పెళ్లి కొడుకండీ గుణములో రాముడేనండీ
అ: బంగారుబొమ్మ ఇదిగోండీ మీ వాడు జోడుతగునండీ అ: ॥శుభమంటూ॥

అయ్యహో.. అయ్యహో.. ఒంటిపైన ముద్దులెన్నో వెయ్యహో
అమ్మతోడు అందెగత్తె హస్తవాసి హాయిగుంది అయ్యహో.. అయ్యహో..
ఆ: కత్తితోటి కొయ్యగానే కస్సుమంటు జారినట్టు
కుర్రవాడి వాడి చూపు గుచ్చెనయ్యహో ఓ.. ఓ..
అయ్యహో.. అయ్యహో... జంటకొచ్చి ప్రేమ బండి తొయ్యహో
అయ్యహో.. అయ్యహో.. యింటికొచ్చి ప్రేమ తిండి మెయ్యహో
అయ్యతోడు అందగాడి నెయ్యమెంతో తియ్యగుంది అయ్యహో.. అయ్యహో..
చ/అ: ఒంపులోన తిప్ప నేను వెయ్యహో.. తిప్ప నేను వెయ్యహో..
ఓండుతోటి దిష్టి నీకు తియ్యహో.. దిష్టి నీకు తియ్యహో..
ఆ: కోరికంత దారమల్లె చెయ్యహో.. ఓ.. ఓ..
కౌగిలింత చీరనువ్వు నెయ్యహో.. ఓ.. ఓ..
అ: కాలు నేను దువ్వుతుంటే జోరహో నీ కాలు నీకు చెప్పకుండ జారహో
ఆ: ఒక్కసారె పుట్టునంట ప్రేమహో ఒక్కటవ్వగానే పట్టునంట తేమహో
అ: అమ్మతోడు కొమ్మతోడు గుమ్మతోడు గొప్పగుంది అయ్యహో.. అయ్యహో.. ॥అగ్గి॥
ఆ: సిగ్గుపైన మూతనువ్వు తియ్యహో.. మూత నువ్వు తియ్యహో..
చిత్రమైన కూతనేను కుయ్యహో.. కూత నేను కుయ్యహో..
అ: నోటి తోటి నోరు నువ్వు ముయ్యహో.. ఓ.. ఓ..
మాటరాని తేనె బొమ్మ గియ్యహో.. ఓ.. ఓ..
ఆ: చెంపపైన గోటితోటి గిచ్చహో అది గుండెలోన మాసిపోని మచ్చహో
అ: పట్టలేక నువ్వు నేను రెచ్చహో యింక పుట్టలేక విరహమంత చచ్చహో
ఆ: అమ్మతోడు అబ్బతోడు వీడి తోడు వేడిగుంది అయ్యహో.. అయ్యహో ॥కత్తి॥

రచన: సుద్దాల అశోక్‌తేజ **5** గానం : ఉదిత్‌నారాయణ్, చిత్ర

ఆ: నెమలి కన్నోడా నమిలే చూపోడా
కమిలి పోకుండా తాకాలయ్యో..
అరె బొడ్డుకు వున్న తాళం తీస్తే
ఒడ్డున పడ్డ చేపైపోతా
అ: చిలకా నీ ముగ్గ నలిపే పోతాగా
ఉలికి పడితే మరి ఎట్టాగమ్మో..
అహ రెక్కల పూవై విప్పిన రావే
చుక్కలతోనే ముద్దాడిస్తా
ఆ: నెమలి కన్నోడా
కో: డా డా డా డా
అ: చిలకా నీ ముగ్గ
కో: గా గా గా గా
ఆ: ఏ పూలతో కొలవాలయ్యో
ఆరడుగుల వజ్రం నువ్వే
అ: కన్నె ముద్ర అద్దావంటే
వెన్నముద్దయ్ పోదా వజ్రం
ఆ: నీ ఛాతి విఖ్యాతి అహ తెలుసులే
లేలేత నా బుగ్గలో మొటిమకు
అ: నీ నడుము హరివిల్లు కవలలు అని
ఆకాశం దిగివచ్చి పలికిందిలే
ఆ: చిచ్చర పిడుగై చొచ్చుకుపోతే (2)
పచ్చని ఆకై విచ్చుకుపోతా
అ: ననినా నానానా



ఎందువల్ల నువ్వు కాదన్నావో - ఎదురు ప్రశ్నలే వెయ్యనుగా
ఎదురు చూపులే ఆపనుగా
ఏనాటికో ఒకనాటికి - నీ ప్రేమ సాధిస్తా
ఆ: నిను చూడాలని వున్నా - నిను చూడాలని వున్నా - నే చూడలేకున్నా
మాటాడాలని వున్నా - మాటాడలేకున్నా
ప్రేమించాలని వున్నా - ప్రేమించలేకున్నా - లోలోన - నాలోన - కన్నీరౌతున్నా

రచన: చంద్రబోస్ **3** గానం : కీరవాణి, బృందం, యస్.పి. చరణ్, చిత్ర

ఆ: ఒరేయ్... నువ్వు నాకు నచ్చావురా
ఒరేయ్.. ఐ లవ్‌యు రా కో : యేం..
ఒరేయ్.. నేను నిన్ను మెచ్చానురా ఒరేయ్.. అదంతేరా ॥ఒరేయ్॥
అరెరె చుఱుకు నీకు వుందిరా అసలు కొత్త స్టైలు నీదిరా అందుకే.. ఐ లవ్‌యు రా
కో: ఆడపిల్ల ఒరేయ్ అందంటే ప్రేమలోన పడ్డట్టేరా
నీ రొట్టె విరిగి ఎంచక్కా నేతిలోన పడిపోయెరా
అ: ఒరేయ్... నువ్వు నాకు నచ్చావురా
ఒరేయ్.. ఐ లవ్‌యు రా
ఆ: ఏంట్రా గూట్లే అ: ఆహాహా ఎంత ప్రేమగా పిలిచింది చూడ్రా
చ/ఆ: ఏంట్రా గూట్లే - టెలిఫోన్ పోలల్లే ఎదిగావురా
అ: పోరా డోంగ్రే - ఐస్‌ఫ్రూట్ పుల్లల్లే అదిరావురా
ఆ: ఏంట్రా టుబ్రీ - తొక్కలోది నీడ్రస్సే బాగుందిరా
అ: పోరా పుస్కీ - దిక్కుమాలిన నీ ఫేసే సూపర్బ్‌రా
ఆ: ఏరా లఫంగి నువ్వేరా అ: ఏరా పుడింగి నీవేరా
ఆ: బే అన్నా బేవార్సన్నా అ: బచ్చా అన్నా భడవా అన్నా
ఇ: ప్రతిమాట పరమార్థం ప్రేమేరా
కో: ఆహా మీ తిట్లే వింటుంటే ప్రేమ ముదిరినట్టుందిరా
ఓహో మీరు మాకు హాపీగా బీరు పార్టీ యిచ్చుకోండిరా
అ: ఒరేయ్.. ఒరేయ్.. ఒరేయ్.. చిలక రూటుకొచ్చిందిరా
ఒరేయ్.. యింక వెళ్లండిరా
ఆ: ఒరేయ్.. చిలిపి చిలిపి పనులున్నాయ్‌రా
ఒరేయ్.. కళ్ళు మూయండిరా
ఏంట్రా మెంటల్ అ: ఓహోహో ఏం ముద్దుగా పిలిచావ్ పిల్లో
చ/ఆ: ఏంట్రా మెంటల్ - చల్లనైన నీ మనసే ఏర్ కూలర్‌రా
అ: పోరా కిండల్ - దూకుతున్న నీ వయసే టూ వీలర్‌రా
ఆ: రారా ఉల్లా - కాల్చుతున్న చూపే సిగరెట్ లైటర్‌రా
అ: పోరా పిస్తా - చిక్కుకున్న నడుమే సెంటీ మీటర్‌రా
ఆ: నా దేశ ముదురు నువ్వేరా
అ: నా చేదు షుగరు యిలారా
ఆ: ఇడియట్ అన్నా స్టుపిడ్ అన్నా
అ: ట్యూబ్‌లైట్ అన్నా ఎల్ బోర్డ్ అన్నా
ఇ: ప్రతి తిట్టు ప్రేమలోన దీవెనేరా
కో: డౌటు లేదు వీళ్ళు మనకు లేనట్టేరా ఆ: ॥ఒరేయ్॥

రచన: చంద్రబోస్ **4** గానం : టిప్పు, కల్పన

ప/అ: అగ్గిపుల్ల గియ్యగానే భగ్గుమంటు మండినట్టు
ఆడపిల్ల చేతి స్పర్శ తగిలెనయ్యహో.. ఓ.. ఓ..
అయ్యహో.. అయ్యహో.. మంటలోన నెయ్యి నువ్వు పొయ్యహో



నీ కోసమే ఈ ప్రాణమన్నది
అందమే అందని అందమా
ప: తెలిమంచులోన చెలి అదర సవ్వడి
తెలిమంచులోన చెలి అదర సవ్వడి
విరజాజి వానై కురిసింది పైబడి
ఇక చేరాలి ఆమె కౌగిలి
ఇక చేరాలి ఆమె కౌగిలి
తెలిమంచులోన చెలి అదర సవ్వడి
తెలిమంచులోన చెలి అదర సవ్వడి

రచన: వరికుప్పల యాదగిరి **5** గానం:టిప్పు, స్వర్ణలత

ప/ఆ: అడగక్కర్లేదు నా బావ ఎక్కడని
అడగక్కర్లేదు నా బావ ఎక్కడని
సింపిరిజుట్టుతోటి చిరిగిన నిక్కరు వేసుకుని
వంకర చూపులు చూసుకుంటూ
వాగుల వెంట పోతా ఉంటాడే
వాడేనా బావంటే.. వాడేనా బావంటే..
.. వాడేనా బావంటే
అ: చెప్పక్కర్లేదు నా మరదలు ఎక్కడని
అడగక్కర్లేదు నా మరదలు ఎక్కడని
బొబ్బరిలంక చీరకట్టి.. జబ్బలదాక జాకెట్ వేసి
కొప్పునిండా మల్లెలు పెట్టి తిప్పుకుంటు తిరుగుతుంటదే
అదే నా మరదలని.. అదే నా మరదలని
అదే నా మరదలని.. అదే నా మరదలని
చ/ఆ: మంచినీళ్ళ నల్లకాడ బిందెనెత్తుకుంటు వుంటే
తొంగి తొంగి చూస్తాడే
మల్లెపువ్వుల తోటలోన మంచం వేసుకుని వుంటే
దొంగలాగ చేరతాడే
అ: పొద్దుకూడ పొడవకుండా రయ్యమంటూ ఇంటికొచ్చి
దుప్పటంతా లాగుతుందే
నిదరంతా పాడుచేసి లేవమంటు గోలచేసి
నీళ్ళుచల్లి నవ్వుతుందే
ఆ: కల్లోకొచ్చి ఏదేదో అడిగేస్తాడే
అ: కన్నేకొట్టి తికమకలోకి తోసేస్తుందే
ఆ: బుజ్జిగాడిలా ఒళ్ళో వాలిపోతాడే
ఎంత చెప్పిన ఒళ్ళు వదలనంటడే
పూతరేకు తిత్తానంటూ పత్తాలేకుండా పారిపోతాడే
వాడేనా బావంటే.. వాడేనా బావంటే
వాడేనా బావంటే.. వాడేనా బావంటే
ప/ఆ: అడగక్కర్లేదు నా బావ ఎక్కడని
అ: చెప్పక్కర్లేదు నా మరదలు ఎక్కడని
చ/అ: కొత్తకొత్త ఫ్యాషన్‌లంటూ జబ్బలు చూపే జాకెట్ వేసి
నిబ్బరంగా వుండనీదే
ఊసుపోదంటూ ఎక్కడంటే అడకొచ్చి
బోదమంటూ చంపుతుంటాదే
ఆ: వేపచెట్టు నీడలోన అప్పచెమ్మ ఆడుతుంటే



రచన:బైదల బాపు **3** గానం:హరిహరన్, గోపికాపూర్ణిమ

ప/అ: ఓ ప్రియా ఓ ప్రియా ఓ ప్రియా ఓ ప్రియా
నీ నవ్వే నాకు సొంతం నీ పిలుపే సుప్రభాతం
నీ నవ్వే నాకు సొంతం నీ పిలుపే సుప్రభాతం
నీ చూపే సుప్రభాతమే
ఓ ప్రియా ఓ ప్రియా ఓ ప్రియా ఓ ప్రియా ఓ ప్రియా
చ/అ: చిరునగువల్లో తొలకరిజల్లు కురిసే వేళలో
ప్రేమ పురాణం పల్లకిరాగం సాగేవేళలో
ఆ: ఊసులతోనే ఊహల ఊయల ఊపే వేళలో
చూపులతోనే కమ్మని కథలు తెలిపే వేళలో
అ: ప్రేమలోనే పావనీతో జావళీలు పాడనా
జావళీలు పాడుతూనే జాగారాలు చేయనా
నీ తడిసిన పెదవిని పెదవులతో
నా ముద్దుల ముద్రే వేయనా అ: ॥ఓ ప్రియా॥
చ/ఆ: తుమ్మెద నీవై రమ్మని పిలిచే కమ్మని రేయిలో
చుమ్మని తేనెల తీయని వానై కురిసే వేళలో
అ: వన్నెలపైట వెన్నెలలోన జారే వేళలో
వెచ్చని ప్రాయం నిచ్చెలి సాయం కోరే వేళలో
ఆ: నిన్ను చూసి చూడగానే చెప్పలేని హాయిలో
గుండెచాటు కోరికలు గుప్పుమన్న వేళలో
తడబడు అడుగుల సవ్వడిలో నీ జంటై నేనుండాలని
ప/అ: ఓ ప్రియా ఓ ప్రియా ప్రియా ప్రియా
ఓ ప్రియా ఓ ప్రియా
నీ నవ్వే నాకు సొంతం నీ నడకే సుప్రభాతం
నీ చూపే సుందరకాండంలే
ఓ ప్రియా ఓ ప్రియా ప్రియా ప్రియా
ఓ ప్రియా ఓ ప్రియా

రచన: ఘంటాడి కృష్ణ, బైదల బాపు **4** గానం: కె.జె.ఏసుదాసు

ప/అ: తెలిమంచులోన చెలి అదర సవ్వడి
తెలిమంచులోన చెలి అదర సవ్వడి
విరజాజి వానై కురిసింది పైబడి
ఇక చేరాలి ఆమె కౌగిలి
ఇక చేరాలి ఆమె కౌగిలి
చ: తొలిచూపుతోనే దోచావు మనసుని
కదిలించావులే నాలోని ప్రేమనే
నిన్ను చేరుగాలి నా చెంత చేరగా
నా మది ఊయలై ఊగేను హాయిగా
విధినైనా గెలిచే ఓ వింత ధైర్యమే
నిన్ను కలిశాక కలిగే నాలో చిత్రమే
రా చెలి నిచ్చెలి జాబిలీ ॥తెలిమంచులోన॥
చ: చెక్కిల్లపైనా తొలి సంతకానికైనా మది ఆరాటమై రేపింది మోహమై
చిరునవ్వులోనే దాగుంది అందమే
ఎదలోగిళ్ళలో వేసింది బాణమే
నువ్వు అన్నదే నా లోకమన్నది



సి.అశ్వనీదత్



రాఘవేంద్రరావు






కోదండరామిరెడ్డి



కీరవాణి



సుద్దాల అశోక్‌తేజ



చంద్రబోస్

పాఠక పుస్తక ప్రియులకోసం
సినీ సంగీత విశ్లేషకుడు
**'రాజా'**
పర్యవేక్షణలో **'హాసం'** అందిస్తున్న
ప్రత్యేక కానుక ఇది.

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మూలకథ | : ఎ. శివ |
| మాటలు | : పినపాక కృష్ణప్రసాద్, మోహన్ |
| పాటలు | : చంద్రబోస్, సుద్దాల అశోక్‌తేజ |
| రికార్డింగ్ | : కోదండపాణి ఆడియో ల్యాబ్స్ (మద్రాస్) |
| రీ-రికార్డింగ్ | : మహతి రికార్డింగ్ స్టుడియోస్, హైదరాబాద్ |
| డి.టి.ఎస్. మిక్సింగ్ | : రామానాయుడు డి.టి.ఎస్. థియేటర్ |
| డబ్బింగ్ | : రామానాయుడు థియేటర్ |
| ఎఫెక్ట్స్ | : యతిరాజు |
| స్పెషల్ ఎఫెక్ట్స్ | : ప్రకాష్ |
| గ్రాఫిక్స్ | : పెంటాఫోర్ (మద్రాస్) |
| ప్రోసెసింగ్ & ప్రింటింగ్ | : రామానాయుడు కలర్ లాబొలేటరి |
| అవుట్‌డోర్ యూనిట్ | : ఆనంద్ సినీ సర్వీస్ |
| కెమెరా అసిస్టెంట్స్ | : నాగు, రాము |
| పబ్లిసిటీ | : సురేష్ బుజ్జి |
| పి.ఆర్.ఓ. | : బి.ఎ. రాజు |
| స్టూడియోస్ | : రామోజీఫిల్మ్ సిటి, అన్నపూర్ణ స్టూడియో, రామానాయుడు స్టూడియో |
| పోస్టర్ ప్రింటింగ్ | : నేషనల్ లితో ప్రింటర్స్ (విజయవాడ) |
| మేకప్ : చీఫ్ | : రంగినేని ఈశ్వరరావు, కొలసాని శ్రీనివాస్ (తారకరత్న), రాజు (రేఖ) |
| హెయిర్ డ్రెస్సర్ | : తేలు శ్రీను, రాము |
| కాస్ట్యూమ్స్ : చీఫ్ | : కానూరి శ్రీనివాసరావు, రమేష్ (తారకరత్న) |
| అసిస్టెంట్స్ | : శ్రీనివాస్, ఆర్.గోవిందు, కె.కొండ, అప్పారావు, ప్రసాద్ |
| స్టిల్స్ | : దాస్ |
| ఆర్ట్ | : అశోక్ |
| డ్యాన్స్ | : రాఘవేంద్రా లారెన్స్, రాజశేఖర్, సుచిత్ర, హరీష్‌పాయ్ |
| ఫైట్స్ | : విజయన్ |
| అసోసియేట్ డైరెక్టర్స్ | : సి.ఎల్.కె., జి.గోపినాథ్ |
| అసిస్టెంట్ డైరెక్టర్ | : ఎమ్.ఎన్. మూర్తి |
| కో-డైరెక్టర్ | : చలసాని రామారావు |
| ఎడిటింగ్ | : కోటగిరి వెంకటేశ్వరరావు |
| డైరెక్టర్ ఆఫ్ ఫోటోగ్రఫీ | : వి. శ్రీనివాసరెడ్డి |
| ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ | : కె. సత్యసాయి బాబా |
| సంగీతం | : యమ్.యమ్. కీరవాణి |
| స్క్రీన్‌ప్లే - నిర్మాత | : కె. రాఘవేంద్రరావు. బి.ఏ. |
| దర్శకత్వం | : ఎ. కోదండరామిరెడ్డి |

## తారాగణం

నందమూరి తారకరత్న (తొలిపరిచయం),
కుమారి రేఖ,
గిరిబాబు, తనికెళ్ళ భరణి, ఎమ్.ఎస్. నారాయణ,
ధర్మవరపు సుబ్రమణ్యం, దేవదాస్ కనకాల, సునీల్,
రాజీవ్ కనకాల, చిత్రం శ్రీను, సమీర్, రఘుబాబు,
శరత్‌చంద్ర, ఫణి, రషీద్, శ్రీధర్, రామ్మోహన్, శేఖర్,
సుధీర్, మిత్ర, పార్థసారథి, చిట్టిబాబు, సుదర్శన్,
కామేశ్వరరావు, రమణమూర్తి, శశాంక్, కె.కె. శర్మ
ఇందు ఆనంద్, రాజశ్రీ, రాధిక, పావని,
బేబిగాయత్రి, నికితాకామిని, సుష్మ



# ప్రేమలో... పావని కళ్యాణ్

........Love is different

పాఠక పుస్తక ప్రియులకోసం
సినీ సంగీత విశ్లేషకుడు
**'రాజా'**
పర్యవేక్షణలో **'హాసం'** అందిస్తున్న
ప్రత్యేక కానుక ఇది.





బి.ఎ.రాజు — బి.జయ



పి. ఘటికాచలం



ఘంటాడి కృష్ణ

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| సంగీతం | : ఘంటాడికృష్ణ |
| పాటలు | : వరికుప్పల యాదగిరి, త్రైదలబాబు |
| ఎడిటింగ్ | : ఎ. వెంకటేష్ |
| ఆర్ట్ | : కృష్ణా |
| మేకప్ | : రామకృష్ణ |
| హెర్‌డ్రెసర్ | : బాచి |
| కాస్ట్యూమ్స్ | : శ్రీను |
| స్టిల్స్ | : నారాయణ |
| కెమెరామేన్ | : జవహర్ రెడ్డి |
| డాన్స్ మాస్టర్స్ | : నారాయణ, నాగరాజు, వేణుపాల్ |
| ఫైట్స్ | : రమణ |
| ప్రొడక్షన్ మేనేజర్స్ | : హరినాథ్, నాగిరెడ్డి |
| ప్రొడక్షన్ | : యం.ప్రభాకర్‌రావు |
| కో-డైరెక్టర్స్ | : లక్ష్మణ్, సురేష్ |
| సహాయదర్శకులు | : శ్రీను, గజ్జల సైదిరెడ్డి, సాడి అప్పన్నరెడ్డి, నాతరి అజయ్ |
| కథ | : సూపర్‌హిట్ ఫ్రెండ్స్ యూనిట్ |
| స్క్రిప్ట్ కో-ఆర్డినేటర్ | : బి. జయ |
| నిర్మాతలు | : బి.ఎ. రాజు, బి. జయ |
| ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ | : పి. విజయవర్మ |

మాటలు, స్క్రీన్‌ప్లే - దర్శకత్వం : పి.ఘటికాచలం

## తారాగణం

దీపక్, అంకిత
సునీల్, కోటశ్రీనివాస్‌రావు, గిరిబాబు,
రమాప్రభ, బ్రహ్మానందం, యమ్మెస్
నారాయణ, రంగనాథ్, ఎ.వి.యస్.,
కళ్ళుచిదంబరం, గుండుహనుమంతరావు,
రఘునాథ్ రెడ్డి, గౌతంరాజు, ఐరన్‌లెగ్
శాస్త్రి, కుమార్, ఫణి, వర్ష, మధుమతి,
దేవిశ్రీ, అపూర్వ, జయప్రకాశ్‌రెడ్డి, చైతన్య,
దినేష్, సూరిబాబు, వేణుమాధవ్, మాధవి,
బిందు, నరేంద్ర, భాస్కర్‌రెడ్డి, అనిత,
గుడిమూల రాజు, పావల శ్యామల,
చిట్టిబాబు, శ్వేత, చందు, మాస్టర్ హర్ష

సెప్టెంబరు 17 హస్రత్ జైపురి వర్ధంతి సందర్భంగా...

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

**చిత్రం : అందాజ్**

సంగీతం : శంకర్-జైకిషన్
రచన : హస్రత్ జైపురి
గానం : కిశోర్ కుమార్
అభినయం : రాజేశ్‌ఖన్నా
హేమామాలిని

## జిందగీ ఎక్ సఫర్ హై సుహానా



అందాజ్







జిందగీ ఎక్ సఫర్ హై సుహానా
యహాఁ కల్ క్యా హో కిస్‌నే జానా
హస్‌తే గాతే జహా సే గుజర్
దునియా కీ తూ పర్వాహ్ న కర్
ముస్కురాతే హుయే దిన్ బితానా
॥యహాఁ కల్॥ ॥జిందగీ ఎక్॥
మౌత్ ఆనీ హై ఆయేగీ ఎక్ దిన్
జాన్ జానీ హై జాయేగీ ఎక్ దిన్
ఐసీ బాతోంసే క్యా ఘబరానా
॥యహాఁ కల్॥ ॥జిందగీ ఎక్॥
చాంద్ తారోంసే చల్ నా హై ఆగే
ఆస్మానోంసే బఢ్ నా హై ఆగే
పీఛే రహ్ జాయేగా యే జమానా
॥యహాఁ కల్ ॥ ॥జిందగీ ఎక్॥





శంకర్-జైకిషన్ అన్ని రకాల సినీగీతాలను రూపొందించడంలో సిద్ధహస్తులుగా పేరుగాంచారు. పండితుల మన్ననలందుకున్న క్లిష్టమైన సెమీ క్లాసికల్ గీతాల నుండి పామరులను అలరించే జానపదగీతాల వరకు వారు ఎన్నో హిట్ గీతాలందించారు. ఇక హస్రత్ జైపురి కాంబినేషన్‌లో వారందించిన పాటల సంగతి చెప్పనక్కరలేదు. ఆ అనుబంధం రాజ్‌కపూర్ రూపొందించిన 'బర్సాత్' చిత్రంలోని 'జియా బేకరార్ హై' పాటతో మొదలయింది. ఆ తర్వాత వారు రాజ్‌కపూర్ చిత్రాలలో రెగ్యులర్స్ అయిపోయారు. జైకిషన్ చనిపోయేవరకు ఈ అనుబంధం కొనసాగింది.



రమేశ్ సిప్పీ దర్శకత్వం వహించిన తొలి చిత్రం 'అందాజ్'కు శంకర్-జైకిషన్, హస్రత్ జైపురిల కాంబినేషన్‌నే ఎంచుకున్నారు. కథ భర్త చనిపోయిన హీరోయిన్, భార్య చనిపోయిన హీరో మధ్య సాగుతుంది. ఒకే స్కూల్లో చదువుకుంటున్న వారి పిల్లల ద్వారా వారికి పరిచయమేర్పడుతుంది. ఒకరి గతం ఒకరికి తెలిసిన తర్వాత వారింకా దగ్గరవుతారు. హీరో భార్యకు పిల్లలు పుడితే ఆమెకు ప్రాణాపాయమని డాక్టర్లు చెప్పినా భర్తకు పిల్లలంటే ఇష్టం కాబట్టి ఆమె ఒక బిడ్డను కని ప్రాణాలు విడుస్తుంది. హీరోయిన్ తన ప్రియుణ్ణి గుళ్ళో పెళ్ళి చేసుకున్న తర్వాత అతను యాక్సిడెంట్లో మరణిస్తాడు. ఆ తర్వాత కథ అనేక మలుపులు తిరిగి చివరికి ఈ హీరో హీరోయిన్లు పెళ్ళి చేసుకోవటంతో ముగుస్తుంది.

హీరోహీరోయిన్లుగా షమ్మీకపూర్, హేమామాలిని నటించారు. హేమామాలిని అప్పటికే టాప్ హీరోయిన్‌గా పేరు సంపాదించింది. ఆమె ప్రియుడి పాత్రలో సూపర్‌స్టార్ రాజేశ్‌ఖన్నా చేత అతిథి పాత్ర చేయించడంతో చిత్రానికి క్రేజ్ ఏర్పడింది. ఇక వారిపై చిత్రీకరించిన 'జిందగీ ఎక్ సఫర్ హై' పాటకి వచ్చిన పాపులారిటీ అంతా ఇంతా కాదు. ఆ ప్రభావం ఎంతటిదంటే తెలుగులో వచ్చిన 'దత్త పుత్రుడు' చిత్రం లో అక్కినేని, వాణిశ్రీలకి ఈ పద్ధతిలో ఒక పాటకి నటించక తప్పలేదు. ఆ పాటే ఘంటసాల, రమోలా, టి.చలపతిరావు సంగీత దర్శకత్వంలో పాడిన 'మనసైన చినదానా ఒక మాటుంది వింటావా'! ఘంటసాల పాడగా అక్కినేని అభినయించారు.

హస్రత్ జైపురికి ఉత్తమ గీతరచయితగా రెండుసార్లు ఫిలింఫేర్ అవార్డులు దక్కాయి. మొదటిది 'సూరజ్' చిత్రంలోని 'బహారోఁ ఫూల్ బర్సావో' పాటకు లభించింది. ఆ పాటను 'హాసం' 12వ సంచికలో ప్రస్తావించటం జరిగింది. రెండవది ఈ 'జిందగీ ఎక్ సఫర్ హై' పాట. ఈ చిత్రంలో రాజేశ్ ఖన్నా పాత్ర చనిపోతాడని ఆ పాత్ర కనిపించక ముందే ఎస్టాబ్లిష్ అయిపోతుంది. అలాంటి పాత్రని నవ్వుతూ తుళ్ళుతూ జీవితాన్ని సరదాగా గడిపే పాత్రగా చూపించటానికి ఈ పాట ఎంతో దోహదం చేసింది. జీవితం క్షణభంగురమనే వేదాంత సారాన్ని హుషారైన ఈ పాట ద్వారా ఆ పాత్ర చేత చెప్పించటంతో ఒక కొత్త హీరోయిజాన్ని కూడా చూపించారు.



'ఆరాధన' చిత్రంలోని పాటల ద్వారా రాజేశ్‌ఖన్నాను సూపర్‌స్టార్‌గా నిలబెట్టడంలో తన వంతు సహాయం చేసిన కిశోర్‌కుమార్ ఈ పాటను అద్భుతంగా పాడారు. ఇందులో 'యోడెలింగ్' అనే ప్రక్రియను కూడా ఆయన ప్రయోగించారు. 'యోడ్లెయి యోడ్లెయి ఊ ఊ' అంటూ పాడటం కిశోర్ కుమార్‌కున్న అనేక ట్రేడ్ మార్కులలో ఒకటిగా నిలిచిపోయింది. ఇక చిత్రీకరణ విషయానికొస్తే మోటార్ బైక్ పై హేమామాలినిని వెనుక కూర్చోబెట్టుకుని రాజేశ్‌ఖన్నా విన్యాసాలు చేస్తూ పాడటం యువతను ఉర్రూతలూగించింది. గాగుల్స్ పెట్టుకుని వాటిని కొంత కిందికి జరిపి ఆ సందులోంచి చూపులు సంధిస్తూ అతడు ఎంతో క్రేజ్‌ని సంపాదించాడు.

'జిందగీ' అంటే జీవితం. 'సఫర్' అంటే ప్రయాణం. 'సుహానా' అంటే ఆహ్లాదకరమైనది. 'యహా కల్ క్యా హో కిస్నే జానా' అంటే 'ఇక్కడ రేపు ఏం జరుగుతుందో ఎవరికి తెలుసు' అని.

జీవితం ఓ హాయైన ప్రయాణం
రేపేమవుతుందో తెలిసేదెవరికి

ఈ జీవితంలో ఎప్పుడేం జరుగుతుందో ఎవరికీ తెలియదు. ఈ విషయం చాలామందిలో ఒక రకమైన భయాన్ని కలిగిస్తుంది. అభద్రతా భావాన్ని కలిగిస్తుంది. భయం భయంగానే జీవితాన్ని గడిపేస్తారు. కానీ ఇది విషయాన్ని మరో కోణం నుంచి చూస్తే ఎప్పుడేం జరుగుతుందో తెలియదు కాబట్టి ఈ క్షణం సంతోషంగా ఉండాలి. అప్పుడే జీవితం ఆహ్లాదంగా ఉంటుంది. అదే అతని ఫిలాసఫీ.

'హస్‌తే గాతే' అంటే 'నవ్వుతూ పాడుతూ' అని. మనం తెలుగులో వాడే 'ఆడుతూ పాడుతూ' అనే మాటకు సమానార్థంలో వాడతారు. 'జహాఁ' అన్నా 'దునియా' అన్నా ప్రపంచం, లోకం. 'పర్వాహ్' అంటే పట్టింపు. 'ముస్కురానా' అంటే చిరునవ్వు నవ్వటం.

**'ఆడుతూ పాడుతూ జగాన నడు**
**లోకం గురించి పట్టింపు విడు**
**చిరునవ్వుతో రోజులు గడుపు'**

లోకం గురించి, లోకుల గురించి భయపడితే ఏమీ సాధించలేం. గొప్ప వాళ్ళందరూ లోకుల మాటలను పట్టించుకోకుండా పైకొచ్చిన వాళ్ళే. ఎల్లవేళలా ఆనందంగా ఉంటూ ఆనందం పంచాలేగానీ అవసరమైన కట్టుబాట్లకు లొంగకూడదని అతని అభిప్రాయం.

'మౌత్' అంటే చావు, మృత్యువు. 'జాన్' అంటే ప్రాణం. 'ఘబరానా' అంటే 'వెరవటం', 'భయపడటం'.

**'చావు ఎలాగూ వస్తుంది ఒక రోజు**
**ప్రాణమెలాగూ పోతుంది ఒక రోజు**
**వీటి గురించి ఎందుకు వెరపు'**

చావు అనేది అనివార్యమైనది. దాని గురించి భయపడుతూ బిక్కు బిక్కుమంటూ బతకటం అవివేకం. ఉన్న నాలుగు నాళ్ళూ హాయిగా ఉండటమే ఉత్తమం. చావు గురించి భయపడక సరదాగా ఉండే వాడిగా అతని పాత్రని తీర్చిదిద్ది అతన్ని కోల్పోకపోయి ఉంటే హీరోయిన్ ఎంత ఆనందంగా ఉండేదో కదా అనే సానుభూతిని కలిగించారు ఈ చిత్రంలో.

'చాంద్' అంటే చంద్రుడు. 'తారే' అంటే తారలు. 'ఆస్మాన్' అంటే ఆకాశం. 'జమానా' అంటే లోకం.

**'చంద్రుణ్ణీ చుక్కల్నీ దాటిపోవాలి**
**ఆకాశాన్ని దాటి సాగిపోవాలి**
**వెనకబడిపోనీ ఈ అవని**

చంద్రుణ్ణి, చుక్కల్ని, ఆకాశాన్ని దాటి ఆనందపుటంచులను అందుకోవాలని అతని ఆశ, ఈ మాటలలో అతను లోకాన్ని విడిచి వెళ్ళిపోతున్నాడని నిగూఢార్థం కూడా ఉంది.

**- పి.వి. సత్యనారాయణరాజు**

# న్యూస్ వ్యూస్

## జీబ్రా, బ్రిట్నీ గాభరా



బ్రిట్నీస్పియర్స్ కొత్త వీడియో ఆల్బమ్‌లో ఓ జీబ్రా ఎక్కి పాలరాతి మెట్లు ఎక్కేదృశ్యం ఉంది. పాలరాయి మీద నడవలేక జీబ్రా కాలుజారి కింద పడింది. దాంతో జంతువులను హింసిస్తున్నారంటూ యానిమల్ ఏక్టవిస్టులుని బ్రిట్నీకి వ్యతిరేకంగా నిరసన వ్యక్తం చేస్తున్నారు. ఇది చాలనట్లు మైకేల్ కోట్రిల్, లారీ నుకోవిస్కీల పెట్టినకేసు ఎదుర్కొంటుంది. ఆమె "వాట్ యూసీ ఈజ్ వాట్ యూగెట్" అనే బ్రిట్నీ పాటకు సంగీతం సమకూర్చినది తామేనని బ్రిట్నీ తమ పేరువేయకపోగా,డబ్బు కూడా ఈయలేదని వారి అభియోగం.

## విధి తారంగం — విషాద సారంగం



గతపక్షం సెప్టెంబరు 1న జానపద గాయకుడిగా ఖ్యాతి చెందిన సారంగపాణి దుర్మరణం పాలయ్యారు. 45 సం॥ల ఈ గాయకుడు సికింద్రాబాద్ రైల్వే స్టేషన్‌లో రైలు ఎక్కబోతూ ప్రమాదవశాన జారిపడ్డారు.

బాబుమోహన్‌పై చిత్రీకరించిన 'ఇంత కూరుంటెయ్యమ్మో' (పిట్టలదొర)తో సారంగపాణి సినీరంగంలో గాయకుడిగా అడుగుపెట్టి 'ప్రేమపల్లకి', 'సర్కస్ సత్తిపండు' 'ప్రేమంటే', 'క్యాష్' చిత్రంలో కూడా పాడారు.

## అంతరిక్షంలో పాప్‌గాయకుడు

ఎన్‌సింక్ గ్రూపుకు చెందిన గాయకుడు లాన్స్ బాస్ ఇంకో రెండు నెలల్లో ఇంటర్నేషనల్ స్పేస్ స్టేషన్ చేరబోతున్నారు. 23 ఏళ్ల బాస్ రష్యాలోని స్టార్ సిటీ కాస్మోనాట్ బేస్‌లో ట్రయినింగ్ పూర్తి చేసుకుని హ్యూస్టన్‌లోని జాన్సన్‌స్పేస్‌సెంటర్ చేరుకున్నాడు. అతనికి 'నాసా' వారు కూడా ట్రయినింగ్ ఇస్తున్నారు.

## మడోనాకో చెంపదెబ్బ!



మడోనా నటిస్తున్న తాజా చిత్రం 'స్వెప్ట్ ఎవే'లో ఆమెతో నటిస్తున్న డియానో గియాన్నిని మడోనా చెంపఛెళ్ళుమనిపించాల్సి వచ్చింది. మడోనా భర్త గైరిచ్చీ డైరక్టు చేస్తున్న ఈ చిత్రంలో ఆమె డబ్బు, పొగరు ఉన్న అమెరికన్ యువతిగా నటిస్తోంది. కథానాయకుడు ఆమెను కొట్టడంతో రెచ్చిపోయి ఆమె గొంతు చించుకునే సన్నివేశాన్ని చిత్రీకరిస్తున్నప్పుడు మడోనాకు రావలసినంత రియాక్షన్ రావటం లేదట. 'ఇంకా గట్టిగా కొట్టు, ఏం ఫర్వాలేదు' అని గియాన్నిని ప్రోత్సహించిందట. ఆమె ధైర్యానికి తెల్లబోతూనే ఊచిపెట్టి లెంప మీద ఒకటిచ్చుకున్నాడట అతను!

## ఎఫ్.ఎమ్.రేడియో లైసెన్సులు మాకొద్దు

ఢిల్లీ, చెన్నయ్‌లలో ఎఫ్.ఎమ్.రేడియో స్టేషన్ నడపడానికి హక్కులు పొందిన మిడ్‌డే రేడియోస్టేషన్,మిల్లీనియమ్ విన్ రేడియోలు మావల్లకాదని చేతులెత్తేసాయి. విశ్వవ్యాప్తంగా చూస్తే ఒక రేడియోస్టేషన్ నడిపెందుకు అయ్యే ఖర్చులో 15శాతం లైసెన్సు ఫీజు ఉంటుంది. కాని మన ప్రభుత్వం నిర్ణయించిన రేట్ల ప్రకారం 65శాతం లైసెన్సు ఫీజుకి పోతుంది.పైగా అది ప్రతీఏడాది 15శాతం పెరుగుతుందికూడా! లీజు ఇచ్చేందుకు ప్రభుత్వం నిర్వహించిన వేలంలో ఆసక్తి లేనివారుకూడా పాల్గొని,అనవసరంగా పాట పెంచడంతో లైసెన్సు పొందినవారు కిట్టుబాటుకాని ధరకు పాడవలసి వచ్చింది. ఇప్పుడు రేడియోస్టేషన్ ప్రారంభించ బోయేసరికి లెక్కలు చూసుకుంటే బేజారెత్తారు.

## రియల్లీ!



కాశ్మీరు వేర్పాటువాది షబ్బీర్‌షా కంగు తిన్నాడంటే తినడూ -'జాతీయ సమైక్యతావాది'గా తనను జనాలు పొగిడితే! ఆగస్టు నెలాఖరులో కాశ్మీరు కమిటీ పిలుపుపై చర్చలకు ఢిల్లీ విమానాశ్రయంలో దిగినప్పుడు అతనికి ఈ చేదు అనుభవం ఎదురైంది. అతను దిగగానే విలేఖరులు చుట్టుముట్టడంతో అతనెవరైనదీ విమానాశ్రయం బయటవేచివున్న కాంగ్రెసు కార్యకర్తలకు కనపడలేదు. దేశసమైక్యత కోసం పాటు పడుతున్న కాంగ్రెస్ ఎం.పీ.సునీల్‌దత్‌ని రిసీవ్‌చేసుకోవటానికి కాచుకుని వున్న కార్యకర్తలు షబ్బీర్‌షా రాగానే అతనే ఇతననుకుని దబదబాదండలు వేసేశారు. గులాబీ రేకులు కురిపించారు. అంతటితో ఊరుకోక 'భారత్ మాతా కీ జై''దేశ్ కా లాల్, తుఝే సలామ్' అనే నినాదాలు కూడా ఇచ్చారు. సినిమా నటుడిగా అంతకాలం ఉన్న సునీల్‌దత్ ముఖాన్నే జనం మర్చిపోయారంటే ఇంకేం చెప్పాలి!?

## బ్రిట్నీకి జంటగా సల్మాన్‌ఖాన్!

ప్రముఖ గాయని బ్రిట్నీ స్పియర్స్ హీరోయిన్‌గా నటించబోయే 'మారిగోల్డ్' అనేహాలీవుడ్ చిత్రంలో కథానాయకుడు సాక్షాత్తూ మన సల్మాన్‌ఖానే! విలార్డ్ కరోల్ దర్శకత్వం మహించబోయే ఈ చిత్రంలో నటించటానికి గ్వైనెల్ పాల్ట్రో, జెన్నిఫర్ లవ్‌హెవిట్‌లు కూడా ప్రయత్నాలు చేస్తున్నారట! ఈ వార్త వినగానే బాలీవుడ్ నిర్మాతలందరూ నాలిక్కరుచుకుని సల్మాన్ ఇంటి గుమ్మం వైపు పరుగులు పెడుతున్నారట!



# పాటల రామన్న

నవ విధ భక్తులలో కీర్తనం ఒకటి...

అంటే పరమేశ్వరుని గుణగానం చెయ్యడం....

అలా నాదోపాసన చేసి ఆత్మసాక్షాత్కారం పొందిన మహాను భావులు ఎంతోమంది....

గద్వాల సంస్థానానికి 'విద్వద్గద్వాల' అన్న పేరుందని మనం గతంలో చెప్పుకున్నాం. అదిగో ఆ గద్వాలకి చెందినవాడే రామన్న (1900-1950).

రామన్న తండ్రి రాఘవయ్య.... తల్లి కిష్టమ్మ 'వైద్యం' రాఘవయ్య గారు వైద్యం చేసేవారు గనుక ఇంటిపేరు 'వైద్యం'గా స్థిరపడిపోయింది.

రాజావారి ప్రాపకం ఉండడం మూలంగా... రామన్న బాల్యం వైభవంగానే గడిచింది...

కానీ పదవయేట అకస్మాత్తుగా తండ్రిగారు కాలధర్మం చెందడం....

ఆ బెంగతో కొన్నాళ్ళకి తల్లి కనుమూయడం...

రామన్న ఏకాకైపోయాడు!!

అప్పుడు రామన్న మేనమామ పాగ నర్సప్ప గారు రామన్నని గద్వాల సంస్థానాధీశుడైన సీతారామ భూపాలుని కొలువులో చేర్పించాడు.

రాజుల కొలువు!

కత్తిమీద సాము....

నెత్తిమీద పాము....!!

పైగా పట్టుమని పదేళ్ళు లేవు.... రాజా వారికి ఆంతరంగికుడు...గా పని చెయ్యాలి.

చెప్పినపని చెప్పినట్టు చెయ్యాలి....

బాగాచేస్తే బహుమానం....

తేడాలొస్తే శిరచ్ఛేదనం....

ఎవరెల్లా ఏడ్చినా రాజు ఉత్తముడు, సంస్కారి... సంగీత - సారస్వత ప్రియుడు యథారాజా - తథాప్రజా... అంచేత నిత్యం సంగీత కచేరీలు సాహితీ సభలు ... వగైరా నిర్వహించబడుతూ ఉండేవి.

మెల్లిగా రామన్నకి రుచి తెలుస్తోంది!

సంగీత - సాహిత్యాల పట్ల ఇష్టం కలుగుతోంది....

పగలల్లా సభలో జరిగిన సంగతుల్ని - రాత్రి పడుకునే ముందు వల్లె వేసేవాడు!... మొత్తానికి కవిత్వం అంటుకుంది.

అశువుగా కవిత్వం చెప్పడం అబ్బింది....

పెద్దపెద్ద ఉద్దండ పండితుల మధ్య చిన్నకుర్రాడు రామన్న...

సింహాల మధ్య ... చిట్టెలుకలాగ....

గండభేరుండాల మధ్య రామచిలుకలాగ...

కర్పూరపు తాంబూలం మధ్య - వక్క పలుకులాగ...

చిన్నకుర్రాడు సన్నగొంతుతో.... అప్పటికప్పుడు ఆశుకవిత్వం చెప్తోంటే సీతారామ భూపాలుడు మహా ముచ్చట పడిపోయేడు..

వెంటనే ఏ ముత్యాల హారమో.... వజ్రపుటుంగరమో వరహాలో ఏవో ఒకటి బహుమతిగా ఇచ్చేవాడు.....

ప్రోత్సహించే ప్రభువులే ఉండాలి గానీ - కళ వర్ధిల్లదూ?

యుక్త వయస్సురాగానే... మంచి పిల్లని చూసి దగ్గరుండి స్వయంగా పెళ్ళి జరిపించాడు సీతారామ భూపాలుడు....

సంగీత సాహిత్యాల వల్ల మృదువైపోయిన హృదయంలో పుత్రవాత్సల్యం పొంగడం విశేషం కాదుగా....

రాజావారిచ్చిన ప్రోత్సాహంలో పండగలప్పుడూ.... ఉత్సవాల్లో సంస్థానంలో వేసే సంస్కృత నాటకాల్లో వేషాలు కూడా వేసి శభాష్ అనిపించుకున్నాడు రామన్న.

సంగీత - సాహిత్యాల సమాహారమైన సంస్కృత నాటకాల్ని జోరుగా ఆడుతున్న రోజుల్లో....

పిడుగులాంటి వార్త!

సీతారామభూపాలుడు స్వర్గస్థులయ్యారు!

జీవిత నాటకరంగ స్థలం మీద నించి పాత్ర పక్కకెళ్ళి పోయింది...

తెరజారిపోయింది...

సంస్థానం 'కళా' విహీనమైంది.

రామన్న కుప్పకూలిపోయాడు....

ఎందుకో 'ఆత్మ' లేని సంస్థానంలో కొలువు చెయ్యాలనిపించలేదు.

మానేసాడు.... ఆత్మతృప్తికోసం ఇంట్లోనే సంగీత సాధన చేస్తూ ఉండేవాడు....

పులిమీద పుట్ర!

విధి చేసిన కుట్ర...!! ఉన్నట్టుండి భార్యపోయింది!

---

అరుదైన ఫొటోలు "హాసం"కు అందజేస్తున్న వారి గురించి వ్రాసిన సంపాదకీయం చదివి ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. పాఠకులకు నాదొక విజ్ఞప్తి. అనేకమంది సంగీతకారుల గురించి భరణిగారు చక్కటి ఆర్టికల్స్ వ్రాస్తున్నారు. కానీ వారి ఫోటోలు లభ్యం కాని కారణంగా కాబోలు "హాసం" వారు వ్యాసాలతో బాటు ఫోటోలు ప్రచురించటం లేదు. సంగీతకారుల కుటుంబాలకు చెందినవారి నుండి ఫోటోలు, సంఘటనలు పాఠకులు సేకరించి "హాసం" లైబ్రరీకు పంపితే అవి ఒకచోట నిక్షిప్తమై ఉంటాయి. భరణిగారి లాటి వారు వ్యాసాలు వ్రాసినప్పుడు వాటిని ఉపయోగించే వీలు ఉంటుంది. ఎక్కడో వారసుల ఇళ్లల్లో మగ్గేబదులు "హాసం" ద్వారా జనంలోకి ప్రజలలోకి వస్తుంది. 'నటరత్నాలు' పుస్తకం పీఠికలో మిక్కిలినేని వ్రాసుకున్నారు- ఆయన లైబ్రరీలకు వెళ్లి కొంతమంది బొమ్మలు బ్లేడుతో కత్తిరించి దొంగతనంగా తెచ్చుకునేవారని. సంగీతజ్ఞులపై వ్యాసాలు వ్రాసేవారిని ఆ ఇబ్బంది నుండి తప్పించమని పాఠకులకు నా మనవి.

-ఎం.వి.శర్మ, అపోలో హాస్పిటల్స్, హైదరాబాద్

ఒక కన్ను పోతే ఎలాగో తడుముకుంటూ జీవితాన్ని గెంటుకొస్తున్నాడు.

రెండో కన్ను పోతే! గాఢాంధకారం!....

పెదాల మీద వెర్రి చిరునవ్వు విరిసింది!....

వైరాగ్యం ఆవరించింది. ఏదీ రుచించట్లా.... చప్పబడి పోయింది బతుకు.

... బతుకు బండిని ఈడవాల్సి వొస్తోంది.... రోజుల్ని వెళ్ళదీయాల్సి వొస్తోంది!!

ఈ సమయంలో మనస్సు కృష్ణ పరమాత్మపై లగ్నం అయింది...

గుండెల్లో జ్యోతి వెలిగింది!

లీలా మానుష విగ్రహుడి మనోహర మురళీ నాదానికి నెత్తురు పొంగి యమునైంది! ఉత్సాహం పరవళ్ళు తొక్కింది!!

వేదనంతా... నాదమై పోయీ... గానమై పోయింది.... కళ్ళు మూసుకుంటే నవ్వు రాజిల్లెడు మోమువాడు!!!

కృష్ణుని సుత్తిస్తూ పాటలు పాడ్డం మొదలెట్టాడు.....

నల్లని వాడు.... పద్మ నయనమ్ముల వాడు....

అంతే... వైద్యం రామన్న కాస్తా.... పాటల రామన్నై పోయాడు!!

కీర్తిశేషులు సీతారామభూపాలుని అర్ధాంగి మహరాణీ ఆదిలక్ష్మీ దేవమ్మగారు పాటల రామన్నకి లక్ష్మమ్మ అనే యువతితో మళ్ళీ పెళ్ళి చేసారు!!!

కృష్ణభక్తికి నిదర్శనంగా...

వాళ్ళకి పుట్టిన పిల్లవాడికి 'కుచేలుడు' అని పేరెట్టుకున్నాడు పాటల రామన్న....

రాజా వారు వెళ్ళి పోయాక ఆస్థాన వ్యవహారాన్ని రాణీవారే చూస్తూ ఉండే వారు. రాచ వ్యవహారాల్లో తలమునకలై పోయిన ఆదిలక్ష్మీ దేవమ్మ గారు అప్పుడప్పుడు పాటల రామన్నని పిల్చి మనశ్శాంతి కోసం పాటలు పాడిపించుకునే వారు! రాణీగారికి ఇద్దరు కుమార్తెలు - పెద్దమ్మాయి వరలక్ష్మీదేవికి వివాహమైంది. గానీ సంతానం లేదు!!

అప్పుడు పాటల రామన్న ఒక సలహా ఇచ్చాడు! 'శ్రీకృష్ణమందిరం' అనే భజన మండలి ఒకటి స్థాపించండి దానివల్ల మేలు జరగొచ్చు అని. 1930లో 'శ్రీకృష్ణమందిరం' స్థాపన జరిగింది - సూగప్ప వైద్యగారింట్లో! అక్కణ్ణించి ప్రతీ ఆషాడమాసం శుక్ల సప్తమి నించీ పౌర్ణమి దాకా నవరాత్రి ఉత్సవాలూ - ఆషాడ శుద్ధ పౌర్ణమి రోజున రథోత్సవం జరిపేవారు.... అన్ని రోజులూ పాటల రామన్నగారి పాటలు ఉండాల్సిందే!

కృష్ణుడికి కృప కలిగింది!

అదే సంవత్సరం ఆదిలక్ష్మీదేవమ్మగారికి మనవడు పుట్టాడు!!

ఆ పిల్లాడికి... 'శ్రీకృష్ణరామభూపాలుడ'ని పేరు పెట్టారు.

సంతానం కలిగినందుకు పరమానంద పడిపోయిన రాణీగారు శ్రీకృష్ణమందిరం సభ్యులందర్నీ తమ ఖర్చులతో పండరీపురం పంపించారు.

రాణీగారు శ్రీకృష్ణమందిరానికి ధన సహాయమే కాకుండా - రాజలాంఛనాలూ ఏనుగులు, గుర్రాలు, సైన్యం, సైనిక వందనం కూడా సమర్పించు కున్నారు.

సంస్థానాలన్నీ - ప్రభుత్వంలో విలీనం అయ్యేవరకు... శ్రీకృష్ణమందిరం పరమ వైభవ స్థితిలో ఉండేది... దీనికి ప్రధాన కారకుడు పాటల రామన్న...

పాటల రామన్న మాణిక్యగర్ ఖండేరావ్ (మరాఠా) మహరాజావారి ఆస్థానానికి వెళ్ళి....

దయాకరో హమ్‌పర్ తుమారే

గురూజీ మాణిక్య ప్రభూ కృపాకర్ -

అనే కీర్తనని ఆశువుగా పాడి రాజావారి చేత సన్మానం అందుకున్నారు.



పాటల రామన్నగారికి చదువు పెద్దగా అబ్బలేదు గానీ ఎవరైనా సరే పాట రాయమంటే చాలు... అప్పటికప్పుడు ఏ చిత్తు కాగితం దొరికినా ఒక్కసారి కృష్ణ పరమాత్మని తల్చుకుని ఆశువుగా పాట రాసేసేవాడు.

రామన్నగారు ఉపయోగించిన రాగాలు హిందుస్తానీ, భైరవి, యమునా కళ్యాణి, దర్బార్, కానడ, శుద్ధ కల్యాణ్, కాఫీ శ్యామ, తిలకామోద్, ధన్యాసి, మోహన, తోడి, పీలు బేహగ్, భీంప్లాస్, మాండ్, శ్రీరాగాలు.

మోహనరాగంలో రామన్న రాసిన పాట.

**నిను కనుగొనగలమా కృష్ణా**
**ఘనమగు దొంగలలో ఘనదొంగవు.**

1. **అణువుకంటె అతి సూక్ష్మరూపుడవు**
   **ఘనముకంటె మహాఘనరూపుడవూ**
2. **ఎనబది నాలుగు లక్ష జీవులెడ**
   **అనయింబుగ నెడబాయ కుందువట**
3. **వేదవిద్య వేదాంతము లెరుగము**
   **నామదాస దాసానుదాసులము**
4. **భేదరహిత నీవుండగ మాకు**
   **వేదాంతంబుల వాదము లేల**
5. **నీ పాదములే గతి పాండురంగ**
   **ప్రహ్లాద వరద - కృష్ణమందిర నిలయ...**

పాటల రామన్నగారు రాసిన పాటలు 'శ్రీకృష్ణ మందిర సంకీర్తనలు' అన్న పేరుతో ప్రకాశకులు పాటల పండరీనాథ్ (రామన్నగారి మేనల్లుడు) 19-10-1957లో ప్రచురించారట.

రచయిత జీవించి ఉండగా ఇది ప్రచురించబడలేదు... కళాకారులకు ఇదో శాపం!

పాటల రామన్న కృష్ణునిలో ఐక్యమైపోయినా....

ఆయన పాటలు మాత్రం జీవించే ఉంటాయి.

**-తనికెళ్ళ భరణి**

(డాక్టర్ సి.విజయలక్ష్మిగారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు - సంగీత వాఙ్మయం' చదివి, స్పందించి)

**-భరణి**


ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయ దలచుకునే వారు

**తనికెళ్ళ భరణి,**

కేరాఫ్: "హాసం", 502, శ్రీబాలాజీ నిలయం, 13-1-212,

మోతీనగర్, హైదరాబాదు - 500 018

అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.

సీరియల్ 16

# సద్దాం ఆంటీ ఇంటి కథ

-మల్లాది వెంకట కృష్ణమూర్తి



## జరిగిన కథ

అనగనగా ఓ బామ్మ. అనన్య ఆ బామ్మకు మనవరాలు. అనన్య పనిచేసే బాంక్‌లోనే ఆఫీసర్‌గా పని చేస్తున్న నిరుపమ్ అన్నయ్య వెంకటరత్నం ఓ పెద్ద ఇల్లు ఆ ఊళ్ళోనే వుందని అతి త్వరలో అది తమకు రాబోతుందని అందరితోనూ చెబుతూ వుంటాడు. లింగమయ్య అనే వ్యక్తి ఎప్పుడు ఇంటికి వచ్చినా బామ్మ అనారోగ్యం నటిస్తూ ఉంటుంది. అనన్యకు గతం చెప్పడం ప్రారంభించిన బామ్మ పెద్దతాత వల్లభరావు వీలునామా గురించి చెబుతుంది. ఆ తర్వాత తను పెండ్లాడిన అత్తకొడుకు వెంగళ్రావు గురించి చెబుతుంది. అతను చనిపోయాక డబ్బుకి కటకట పడుతుంది. ఆరోగ్యం చెడి పోతుంది. గ్రామం అని తెలిసున్నాయన కనబడి ఇల్లు అమ్మమని సలహా ఇస్తాడు. కానీ ఇల్లు అమ్మిన డబ్బు ఖర్చు అయిపోయిన తరువాత కూడా తాను బతికివుంటే ఎలాగ? అన్న సందేహం బామ్మను పీడిస్తుంది. దానికి ఓ ఉపాయం చెప్తానంటాడు గ్రామం.

“చూడమ్మాయ్! నీ సమస్య నాకు అర్థమైంది. ఉన్న ఒక్కగానొక్క ఇల్లు అమ్మేసాక నువ్వు ఎక్కువ కాలం బ్రతికి, ఈ ఇంటిని అమ్మగా వచ్చిన అసలు, వడ్డీ మొత్తం నీ జీవితకాలంలోనే హరించుకుపోతే, అప్పుడు నీ గతి ఏమిటి అని కదా నీ సమస్య? దానికో చక్కటి పరిష్కారంతో వచ్చాను. నే చెప్పేది శ్రద్ధగా విను. ముందు కాఫీ లాంటివి ఇవ్వాలనుకుంటే ఇవ్వు. ఇంట్లో తాగి రాలేదు”.

ఇద్దరూ కాఫీలు తాగుతూండగా చెప్పసాగాడాయన.

“ఈ ఇంటి ఖరీదు ఇంచుమించు లక్షరూపాయలుంటుంది. అవునా?”

“అవునండి”

అప్పటికే బామ్మ మార్కెట్‌లో దాని ఖరీదు ఎంక్వయిరి చేసింది.

“ఇప్పుడు నీవయసెంత?”

“ఏభై అయిదు”

“కదా. ఈ ఇంటిని నువ్వు నాకు అమ్ముతున్నావు. ఆ ప్రకారం సేల్‌డీడ్ రాసుకుందాం. దాని ప్రకారం నువ్వు ఎప్పుడు మరణిస్తే అప్పుడు ఈ ఇల్లు నా స్వంతమౌతుంది”

“రేటెంతండి?” అడిగింది బామ్మ.

“చెప్పేది పూర్తిగా విను. అందుకు అడ్వాన్స్‌గా నేను నీకు ఇప్పుడు పదివేల రూపాయలు కేష్ యిస్తాను. బేంక్‌లో వేసుకో. నీకు నెలకి ఎంత ఖర్చవుతుంది?”

“వంద - నూటపాతిక దాకా”

“కదా. ఆ పదివేల కేష్ కాక నేను నెలకి రెండువందల ఏభై చొప్పున చెల్లిస్తాను - మొదటి మూడేళ్ళు. ఆ తర్వాత నెలకి నాలుగువందలు, మరో అయిదేళ్ళదాకా. ఆ తర్వాత నెలకి వెయ్యి రూపాయలు మరో మూడేళ్ళదాకా. ఆ తర్వాత ఏడాదికి పదిహేను వందల చొప్పున చెల్లిస్తూంటాను, ఆ తర్వాత నెలకి రెండున్నర వేలు చొప్పున నీ దేహ త్యాగం దాకా.... కాదు... మరణించేదాకా. ఇలా డబ్బు ముడుతూంటే, నువ్వు దేహాన్ని ఎందుకు త్యాగం చేస్తావు, పిచ్చిమాటకాని” అని నవ్వి ఆయన తిరిగి చెప్పసాగారు.

“దీనివల్ల నీకు కొంతపెద్ద మొత్తం చేతికి వచ్చినట్లుంటుంది. నెలనెలా ఆదాయం నీకు ముడుతూ వుంటుంది. ఇంటిమీద మమకారం అన్నావు కాబట్టి నువ్వు బ్రతికున్నంతకాలం ఈ ఇంట్లోనే దీని యజమానురాలిగా వుండచ్చు. నీ మరణానంతరం ఇది నాదవుతుంది. ఎలా వుంది నీకు?”

సూక్ష్మగ్రాహి అయిన బామ్మకి అది అర్థమైంది. అయినా బెట్టుగా చెప్పింది.

“నన్ను కొంచెం ఆలోచించుకోనివ్వండి”

“అలాగే. ఇక నేను మీ ఇంటికి రాను. ఇదే నా ఆఖరి ఆఫర్. నీకు ఇది సబబనుకుంటే నువ్వే నాకు కబురు చెయ్యి. కార్డ్‌ముక్క రాస్తే నేనే వస్తాను. పోతే ఈ సేల్ అగ్రిమెంట్‌తో పాటు, నువ్వు ఓ ఫైనల్ విల్లు కూడా రాయాల్సి వుంటుంది. దాంట్లో నీ తదనంతరం ఈ ఇల్లు నాకే చెందుతుందని రాయాలి. ఫైనల్ విల్లంటే, ఆ విల్లులో ‘ఇది నా ఆఖరి వీలునామా’ అని. దీని తర్వాత నువ్వు ఈ ఇల్లు మరెవరికీ రాస్తూ ఇంకో విల్లు రాయకూడదు. అలా రాసినా అది మన సేల్ డీడ్‌ని అతిక్రమించి నన్ను మోసం చేయడం కిందకి వస్తుంది. కాబట్టి ఆ కొత్త విల్లు చెల్లదని ఒప్పుకుంటున్నానని నా విల్లులో రాయాలి. ఇంకా ఏం రాయాలో లాయర్ డ్రాఫ్ట్ చేస్తాడు”

బామ్మ అతని ముందు చూపుని మనసులోనే మెచ్చుకుంది. ఇంకో విల్లురాసి తను ఛస్తే, తర్వాత ఆయన కోర్టులచుట్టు చాలా కాలం తిరగాలి. ఈ షరతులవల్ల ఇంకో విల్లుతో, ఎవరైనా కోర్టుకెక్కినా కేసు ఇట్టే తేలిపోయి ఆయన పక్షానికి కేసు కొట్టేస్తారు.

“మళ్ళీ ఇంకో కప్పుకాఫీ ఇలాగే కలపమ్మా. బావుంది”

ఆయన వెళ్ళాక ఆయన చెప్పిందాన్ని గురించి ఆలోచించింది. తను బ్రతికున్నంతకాలం ఈ ఇల్లు తన కిందే వుంటుంది. పైగా నెలనెలా తన పోషణకి సరిపడే ఆదాయం ముడుతుంది. ఒకవేళ తను మరణిస్తే, ఇల్లు ఆయనకి చెందుతుంది. ఎటు చూసినా ఇది తనకి లాభసాటి బేరం. మధ్యలో ఆయన డబ్బు ఇవ్వడం ఆపేస్తే, సేల్‌డీడ్ రద్దవ్వాలన్న కండిషన్ తన విల్లులో పెడితే తను ఇరుక్కోకుండా వుంటుంది.

బామ్మ తనకి తెలిసిన ఓ లాయర్ దగ్గరకి వెళ్ళి విషయం చెప్పి సలహా అడిగింది. ఆయన కొద్ది సేపు ఆలోచించి, రెండు మూడు లావుపాటి పుస్తకాలు తిరగేసి చెప్పాడు.

“నేను ఈ డీల్‌కి ఓటేస్తున్నానమ్మా. ఇంత

**శ్లో॥ వైద్యరాజా నమస్తుభ్యం**
**యమరాజా సహోదరా**
**యమఃస్నియతి ప్రణాలిత్యం**
**ప్రాణానిచ ధనానిచ**

**ఓ వైద్యుడా యమధర్మరాజు సహోదరుడిగా నీకు నా నమస్కారం.**

**నీవు ఆయనకన్నా నికృష్టుడివి. ఎందుకంటే యమధర్మరాజు కేవలం ప్రాణం మాత్రమే తీసుకుంటే నువ్వు దానితోపాటు డబ్బుకూడా తీసుకుంటావు.**

**అయితే ఈ సీరియల్‌లోని బామ్మగారికి ఇలాంటి వైద్యుడు తారసపడలేదు. డాక్టర్లమీద డాక్టర్లు పోతున్నా... ఆవిడ ఆరోగ్యంగా వుంటుంది.**

**ఈ తమాషా తెలుసుకోవాలంటే ఈ సీరియల్ చదవాల్సిందే.**



దాకా, నా సర్వీస్‌లో ఇలాంటి సేల్ అగ్రిమెంట్ గురించి నేను వినలేదు. కాని మనదేశ చట్టం ప్రకారం ఇది వాయిడ్ కాదు. అంటే చట్టం అంగీకరించే విషయమే. శుభస్య శీఘ్రం" ఆయన బామ్మ శ్రేయస్సుకోరి కండిషన్స్ సూచించాడు.

బామ్మ నాలుగు రోజుల తర్వాత గ్రామానికో కార్డ్ రాసింది, తనకి అంగీకారమేనని. గ్రామం వచ్చాక మూడు విషయాలు చెప్పింది.

"మీరు చెప్పిందాంట్లో ఈ కండిషన్స్ కూడా రాయించాలి. నంబర్ ఒన్ నేను మరణించే దాకా, మీకు ఈ ఇంటిమీద ఓనర్‌షిప్ రాదు. నంబర్ టు అందుచేత మీ లారీలు, ట్రాక్టర్లు ఇక్కడ పార్క్ చేసుకోకూడదు. నంబర్ త్రి మీరు వరసగా ఏ రెండు నెలల డబ్బు నాకు చెల్లించకపోయినా మీరు ఈ సేల్ అగ్రిమెంట్‌నుంచి విరమించుకున్నట్లుగా ఇరుపక్షాలు భావించాలి. ఇందుకు నిర్ధారణగా నా బేంక్ అకౌంట్‌లో మీరు నెలనెలా నాకివ్వాల్సిన డబ్బు జమచేస్తూంటారు. ఏ కారణంగానైనా నా అకౌంట్‌లో వరుసగా రెండు నెలలపాటు డబ్బు జమ కాకపోతే ఇక ఆవిషయంమీద తుది నిర్ణయం నాదే అవుతుంది".

ఆయన కొద్దిసేపు ఆలోచించి అందుకు వప్పుకున్నాడు. ఆ ప్రకారం ఆయన తయారు చేయించిన ఫైనల్ విల్లు, సేల్‌డీడ్ కాగితాలని బామ్మ తరపు లాయరు చదివి చిన్న చిన్న మార్పులతో అప్రూవ్ చేసాక, ఓ మంచిరోజున బామ్మ రిజిస్ట్రార్ ఆఫీస్‌కి వెళ్ళి సేల్‌డీడ్‌ని, విల్లుని రిజిస్టర్ చేసింది.

పదివేలతో ఇంటికి కావలసినవి కొనింది.



**ఒక రోగిని పరీక్షించాక డాక్టర్ "నిద్రలేవగానే ఆకుపచ్చ బిళ్లను ఓగ్లాసు నీళ్లతో, లంచ్ అయ్యాక ఎర్రబిళ్లను రెండుగ్లాసుల నీళ్లతో, సాయంత్రం పచ్చబిళ్లను మూడుగ్లాసుల నీళ్లతో, రాత్రి నిదురపోయేముందు తెల్లబిళ్లను నాలుగుగ్లాసుల నీళ్లతో తీసుకోండి. వారంలోగా మీరోగం తగ్గిపోతుంది" అన్నాడు.**

**"అసలు నా రోగం ఏమిటి డాక్టర్?" అడిగాడు పేషెంట్.**

**"కావలసినంత మంచినీళ్లు తాగకపోవడం" జవాబిచ్చాడు డాక్టర్.**

**శుభ్రంగా మంచినీళ్లుతాగే ఈ నవలలోని బామ్మగారికి ఎలాంటి రోగమూ ఎందుకులేదో తెలుసుకోవాలంటే ఈ సీరియల్ చదవాల్సిందే.**

మిగిలిందాంట్లో, తీర్థయాత్రలు చేసి వచ్చింది. దైవభక్తి కన్నా, ప్రయాణాలు చేయాలన్న సరదా తీర్చుకోడానికే ఆ ట్రిప్.

అప్పటినించి బామ్మ డబ్బు దాచుకోవడం ఎరగదు. ప్రతీ నెల బేంక్‌లో తన అకౌంట్‌లోంచి తీసిన డబ్బు ఆ నెలాఖరు తారీకుకల్లా మొత్తం ఖర్చు చేసేసేది. 'అంతా ఖర్చయిపోతే తర్వాత ఎలా?' అన్న దిగులు ఆవిడకి లేదిప్పుడు.

మాంచి హుషారుగా కాలం గడుస్తోంది బామ్మకి. రెండో తారీకు, ఆరోజు బేంక్ సెలవైతే మర్నాడు, బేంక్‌కి వెళ్ళి తన అకౌంట్‌లో ఒకటో తారీకు కల్లా డిపాజిట్ చేయబడ్డ డబ్బు డ్రా చేస్తుంది బామ్మ. ఆ నెలాఖరుకల్లా మొత్తం ఖర్చు చేసేస్తోంది. పొదుపు అవసరం లేనందున ఖర్చు విషయంలో డబ్బుకి వెనకాడక్కర్లేదు. మళ్ళీ నెలఖర్చుకి ఆవిడ అకౌంట్‌లో డబ్బు హాజర్ అన్న నమ్మకం వుందావిడకి. అలాగే జరుగుతోంది కూడా.

సేల్‌డీడ్, బామ్మ వీలునామా తన దగ్గరుంచుకున్న జి. రామం బామ్మ ఎప్పుడు పోతుందా, ఎప్పుడు తనకా ఇల్లు స్వంత మవుతుందా అని ఆశగా ఎదురు చూస్తూండగా ఆర్నెల్లు తిరిగి పోయాయి.

ఓ రోజు ఉండబట్టలేక బామ్మ ఆరోగ్యం ఎలావుందో చూద్దామని బామ్మ ఇంటికొచ్చాడు. వీధిలో కూరలబండి దగ్గర కూరలు కొంటూ, బామ్మ దర్శనం ఇచ్చింది.

"నవాసేరు వంకాయలు, నవాసేరు బెండకాయలు, చారణా పచ్చిమిర్చి, అర్ధనా కరివేపాకు, అణా అల్లం ఇవ్వు"

"అలాగే నమ్మా"

ఆ ప్రకారం వాటిని తూచి ఇచ్చాడు కూరలవాడు. ఎంతైందని అడిగి ఆ డబ్బిచ్చి ఆవిడ కూరల సంచితో లోపలకి వెళుతూ, కారులోంచి దిగుతున్న గ్రామాన్ని చూసి చిరునవ్వుతో పలకరించింది.

"ఎలా ఉన్నారు? కులాసానా? రండి"

"అదేమిటమ్మ కూరలు బేరమాడకుండానే కొనేస్తున్నావు?" ప్రశ్నించాడాయన.

"బేరమాడితే మిగిలేదెంత నా బొంద?"

లోపలకి వచ్చాక ఇంట్లో వెలుగుతున్న దీపాలని చూసి అడిగాడు.

"అదేమిటమ్మా పగలు దీపాలు? కరెంట్ వేస్ట్‌కదా?"

"ఆఁ ఎంతొస్తుందిలెండి బిల్లు, ఇంతోటి పొదుపుకి"

"నీ ఆరోగ్యం ఎలా వుందమ్మా?" అడిగాడాయన.

"అది మా డాక్టరుగారు చెప్పాలి. నాకైతే బానే వుంటోందంతా. బోర్నవిటా తాగుతారా? హార్లిక్సా?"

బామ్మ పెట్టిన, జీడిపప్పు ధారాళంగా వేసి చేసిన ఉప్మాతిని, కమ్మటి హార్లిక్స్ తాగి, ఆముదం తాగిన మొహంతో బయటికి వెళ్ళిపోయాడాయన. సరాసరి బామ్మగారి ఫేమిలీ డాక్టర్ దగ్గరకి వెళ్ళి ఆవిడ ఆరోగ్యం గురించి ఎంక్వయిరీ చేసాడు.



“ఉన్న రోగాల్లో ఏదీ తగ్గలేదు ఆవిడకి. ఇంకెంతకాలం లెండి. ఏడాది తిరక్కుండానే...” అర్థోక్తిగా చెప్పాడు.

ఇంటికి తిరిగి వెళ్ళేసరికి వీధిలో కూరగాయలు బేరమాడుతున్న భార్యని చూసి చిన్నగా నిట్టూర్చి అనుకున్నాడు మనసులో.

‘ప్రారబ్ధ కర్మంటే ఇదే’

ఆ తర్వాత ఏడాది తిరిగింది. కాని గ్రామం ఎదురుచూసినట్లుగా బామ్మ శవం లేవలేదు. బామ్మ ఎలావుందో చూద్దామని మళ్ళీ వాళ్ళింటికి వెళ్ళాడు. బామ్మ హుషారుగా కన్పించింది.

“ఎలావుంది ఆరోగ్యం?” అడిగాడు సూటిగా.

“డాక్టరుగారు చెప్పాలి. నాకైతే అంతా బానేవుంది. ఉప్మా చేయనా? పెసరట్టా?”

“ఉప్మా చాలుగాని జీడిపప్పు వద్దమ్మా”

“అది పడకుండా ఉప్మా చేయడం నాకు చేతకాదండి. అయినా మీ డబ్బేగా మీరు తింటూంట” అని నవ్వి వేడి వేడి పెసరట్‌లో సుమారు వేడిగావున్న ఉప్మా వేసి తెచ్చిచ్చింది.

ఉప్మా తిని కొత్తగా వస్తున్న ఓవల్టిన్ తాగాడు.

“కాడెద్దులు ఎకరం నేల సినిమా చూడకండి. 'చివరకు మిగిలేది' కూడా బోర్” చెప్పింది. మొదటిరోజే మొదటాటకి అన్ని సినిమాలకి వెళ్ళే బామ్మ.

గ్రామం సరాసరి బామ్మ ఫేమిలీ డాక్టర్ దగ్గరకి వెళ్ళాడు. ఆయన గంటక్రితమే పోయాడట. అంతా శోకాలు పెడుతూ కనిపించారు.

బామ్మ ఆరోగ్యం గురించి ఇంకెవర్ని నిలదీసి తిట్టాలో అర్థం కాలేదాయనకి. మరో ఏడాది గడిచింది. బామ్మ ఎలావుందో చూద్దామని వెళితే జున్ను పెట్టింది ఈసారి.

“జున్ను పాలు లోకానికి ఖరీదే కాని, నీకు కాదు కదా కంకాళమ్మా” నవ్వుతూ అడిగినా ‘నువ్వింకా బ్రతికే వున్నావులే?” అని ఎద్దేవా చేస్తూ అడిగాడు గ్రామం.

“పైవాడి ఆజ్ఞ తప్ప ఇంకెవరి ఇంటర్‌ఫియరెన్స్ ఇందులో లేదు”

మరికొన్నేళ్ళు గడిచాయి. ఈసారి యుక్త వయస్కుడైన తన కొడుకుతో వచ్చాడు గ్రామం. బామ్మ ముందు, ఆ ఇల్లు ఆవిడ తదనంతరం తమకి చెందుతుందని ఆ వివరాలన్నీ అతనికి వివరించాడు.

“ఇప్పుడవన్నీ ఎందుకు నాన్నగారు?” అని అతను నొచ్చుకున్నా ఆగలేదాయన.

“నాకు వారంక్రితం గుండె నొప్పి వచ్చిందిగా. మొదటి స్ట్రోక్ అది. ఇంకోసారి వస్తే ఎలా వుంటుందో?”

బామ్మ పెట్టిన ఉప్మాలోని జీడిపప్పు ఏరి తన కొడుక్కి వేస్తూ అనుకున్నాడు - ఇంత హై కొలెస్ట్రాల్ ఫుడ్ తింటూ కూడా బామ్మకి ఒక్కసారి కూడా హార్ట్ స్ట్రోక్ రాలేదేమిటా అని.

మరో ఆరునెలలకి ఆయనలో సహనం చచ్చిపోయింది.

బామ్మ ఇంటికి వచ్చి చెప్పాడు.

“చచ్చి ఏలోకాన ఉన్నాడో కాని, మీ ఫేమిలీ డాక్టర్ నన్ను నిలువునా ముంచేసాడు. ఇప్పటికే ఈ ఇంటి ఖరీదు నేను నీకు నెలనెలా చెల్లించాను. అదే డబ్బు నా వ్యాపారంలో పెడితే దానికి పదిరెట్లయ్యేది. అయినా నాకేం ఉపయోగం లేదు”

బామ్మ సానుభూతిగా చూస్తూ చెప్పిందాయనతో-

‘అన్ని రోజులూ అందరికీ ఒక్కలా వుండవు గ్రామంగారూ”

“ఈ డీల్‌లో నేను ఘోరంగా మోసపోయాను. మనం అగ్రిమెంట్‌ని కాస్తంత తక్కువ డబ్బుకి మార్చుకుందాం”.

బామ్మ ససేమిరా అంది. ఆయన ఘర్షణ పడ్డాడు.

“నన్నేం తిట్టినా, అది నేను ఇంకా చావలేదన్న కోపంతోనేగా? అది నా చేతిలో పనికాదు. యముడికి సంబంధించిన విషయం. మీరు నన్నేం తిట్టినా అవన్నీ ఆ యముడికి చెందుతాయి కాని నేను స్వీకరించను గాక స్వీకరించను” చెప్పింది బామ్మ నవ్వుతూ.

ఆ రాత్రి ఆయనకి మూడోసారి హార్ట్ అటాక్ వచ్చి తెల్లవారు ఝామున నిద్రలోనే తుదిశ్వాస తీసుకున్నాడు.

+++++

“మై పూర్ డియర్ గ్రామం గారు! ఆయన పోయి నువ్వు ఇంకా సర్‌ప్రైజ్ అయ్యావన్నమాట?” ఆ కథనంతా ఆశ్చర్యంగా వింటున్న అనన్య అడిగింది బామ్మని.

“అవును”

“వాటే పిటీ!”

“నిజమే పాపం, చచ్చి ఏ లోకాన



**ఓ బ్యాంక్‌లో పావలాబిళ్ళ, 100రూ॥ల నోటు కలుసుకున్నాయి.**

**100రూ॥ల నోటు పావలాబిళ్ళతో చెప్పింది “నేను పేకాట క్లబ్బుకు, ఐస్‌క్రీం పార్లర్‌కు, విమానంలో, సూపర్‌బజార్‌లలో ఖరీదైన పార్లర్‌లలో తిరుగుతూ వుంటాను”**

**పావలాబిళ్ళ చెప్పింది “నేను ఇప్పుడు బ్యాంక్ నుండి గుడికి మళ్ళీ గుడి నుండి బ్యాంక్‌కు తిరుగుతూ వుంటాను” దీనంగా చెప్పింది పావలాబిళ్ళ.**

**100రూ॥లనోట్లలో మునిగి తేలుతున్న బామ్మగారు పావలాబిళ్ళను చూసి ఎంతకాలమైంది! ఈ స్టేజ్ నుండి ఆ స్టేజ్‌కు బామ్మగారు ఎంత చిత్రంగా ఎదిగారో తెలుసుకోవాలంటే ఈ సీరియల్ చదవాల్సిందే.**

**జస్ట్‌ఫర్‌ఫన్**

## తేడా



“ఓ ప్లేట్ పకోడీ!” ఆర్డరిచ్చేను హోటల్లో.

“పకోడీనా? పకోడానా?” అడిగేడు సర్వారాయుడు. అర్థం కాలేదు నాకు.

“ఏంటి రెండింటికీ తేడా?” అడిగేను.

“రెండు రోజులు” చెప్పేడు సర్వారాయుడు.

- కోనే నాగ వెంకట ఆంజనేయులు (ఉక్కునగరం).

వున్నాడోగాని"

"ఆయన మరణించాక ఇక ఈ ఇల్లు తిరిగి నీకు చెందినట్లేగా?"

"ఏ సేల్ అగ్రిమెంట్‌లో అలా వుండదు. అసలువాళ్ళు పోతే వారి హక్కుదారులకి చెందుతుంది. గ్రామం హక్కుదారులు ఇద్దరు. గ్రామం పెద్ద కొడుకు, చిన్నకొడుకు".

"వాళ్ళు నెలనెలా నీకివ్వాల్సింది బేంక్‌లో డిపాజిట్ చేస్తున్నారా?"

"గ్రామం వాళ్ళకంతా చెప్పి చచ్చాడు కాబట్టి నెలనెలా ఈ ఇంటికోసం నాకు వాళ్ళు చెల్లిస్తూనే వున్నారు. అయితే 'డాక్టర్ చక్రవర్తి' రోజుల్లో సిక్స్‌టీస్‌లో గ్రామం పోతే, అతని పెద్దకొడుకు 'పండంటి కాపురం' రోజుల్లో సెవెంటీస్‌లో పోయాడు. చిన్న కొడుకు ఇటీవలే పోయాడు".

"దాంతో మనదే అవుతుందా బామ్మా ఈ ఇల్లు?" అడిగింది అనన్య.

"ఊహు. పెద్ద కొడుక్కి సంతానభాగ్యం లేదుకాని, చిన్నకొడుక్కి ఇద్దరు కొడుకులు"

"వాళ్ళకీ ఈ అగ్రిమెంట్ గురించి తెలుసా?"

"తెలుసు. దాంతో వాళ్ళు నెలనెలా నా బేంక్ అకౌంట్‌లో డబ్బు జమచేస్తూనే వున్నారు. ఆ డబ్బుతోనే నిన్ను హాస్టల్‌లో వుంచి చదివించింది. దాంతో ఆ అగ్రిమెంట్ ఇంకా అమలులోనే వుంది కాని మురిగిపోలేదు"

"సో యూకాంట్ సేల్ దిస్ హౌస్ కదా బామ్మా?"

"సో ఐ కాంట్ సేల్ దిస్ హౌస్ మనవరాలా"

"ఐసీ... అది సరేకాని నీ కొడుకైన మా తాతయ్యని విస్మరించి ఆ విల్లు ఎలా రాసావు? అప్పటికే తాతయ్య పోయాడా?"

అడిగింది అనన్య.

బామ్మ దీర్ఘంగా నిట్టూర్చింది. తర్వాత చెప్పింది.

"ఓ విషయంలో వాడికి, నాకు పోట్లాట రావడంతో ఇల్లొదిలి చక్కాపోయాడు. పోయిన వాడు అదేపోక. ఒకేడు, రెండేళ్ళు, ఏడేళ్ళు, ఇరవై ఏళ్ళయినా వాడు తిరిగి రాకపోవడంతో వాడికి భూమి మీద నూకలు చెల్లాయనుకున్నాను. వాడికి నూకలన్నం పెట్టాననుకునేవు, సామెతగా చెప్పానంతే. అందుచేత ఆ ఇల్లు ఆ విధంగా అమ్మాను"

"బామ్మా. మా తాత తల్లివి కదా. నిన్నే వరసతో పిలవాలి? చిన్నప్పట్నించీ బామ్మే అలవాటు?" సందేహంగా అడిగింది అనన్య.

**ముసలివాళ్ళకు 'ఎయిడ్స్' ఎక్కువగా వుంటుందని ఇటీవలే ఓ సర్వేలో తేలింది. ఆ ఎయిడ్స్‌లోని రకాలివి.:**

**1. హియరింగ్ ఎయిడ్స్**
**2. సీయింగ్ ఎయిడ్స్**
**3. చూయింగ్ ఎయిడ్స్**
**4. బాండ్ ఎయిడ్స్**
**5. వాకింగ్ ఎయిడ్స్**
**6. గవర్నమెంట్ ఎయిడ్స్**

**అయితే దాదాపు పూర్ణాయుష్కురాలైన**



**కంకాళమ్మకి ఎలాంటి ఎయిడ్స్ లేవు.**

**ఆ వివరాలు ఈ సీరియల్‌లో...**

"తాతమ్మ అని పిలవాలి... కాని ఆ పిలుపు నన్ను ముసలిదాన్ని చేస్తుందని బామ్మగానే అలవాటు చేసాను"

"సరే తాతయ్యకి, నీకు ఏ విషయంలో పోట్లాట వచ్చింది?"

ప్రశ్నించింది అనన్య.

"నేనో అమ్మాయిని చూసి ఇష్టపడి దాన్ని నా కోడలుగా చేసుకోవాలనుకున్నాను. వాడు ఆ పిల్లని ఇష్టపడలేదు. వాళ్ళది వేరే కులం, కట్నం ఇవ్వలేరు. రెండు కారణాలవల్ల ఆ పిల్లనిష్టపడలేదు. నేనే చేసుకోమని బలవంతం చేసాను. నా బలవంతంమీద చేసుకుంటే, ఇక నా గడప తొక్కనని, నా ఆస్తిలో చిల్లికాణీ వద్దని బెదిరించాడు. చివరికి నా ముచ్చట ప్రకారం ఆ పెళ్ళి జరిగాక, ఇష్టంలేని పెళ్ళి చేసానని వాడు పెళ్ళాంతో ఎటో వెళ్ళిపోయాడు".

"అరె! బ్లాక్ అండ్ వైట్ సినిమా రోజుల్లో కథలా వుంది. కాని పాత్రలు రివర్స్ అయ్యాయే?" ఆశ్చర్యపోయింది అనన్య.

"అవును. వాడు మిలట్రీలో చేరి ముప్పైరెండేళ్ళు పనిచేసాక రిటైరై ఓరోజు పధ్నాలుగేళ్ళ కొడుకుతో ఊడిపడ్డాడు. అప్పటికే ఈ ఇంటి అమ్మకం జరిగిపోయింది. కోడలు కిడ్నీ వ్యాధితో పైకెళ్ళి పోయింది. నా మనవడ్ని నాకు చేర్చిన కొద్ది కాలానికి వాడూ టపాకట్టేసాడు"

"బామ్మా ఇకమీదట నువు నాకేం చెప్పాలనుకున్నా చివర్నించి ముందుకు చెప్తూ వెళ్తుండు".

బామ్మ ఆ మొత్తం చెప్పడానికి నాలుగైదు గంటలు పట్టడంతో అలా చెప్పింది అనన్య.

బామ్మ సన్నగా నవ్వి చెప్పింది.

"ఎందుకే అంత అసహనం? పూసగుచ్చినట్లు చెప్పడం నా అలవాటు. చిన్నదానివని ఇంతదాకా నీకా విషయలేం చెప్పలేదు. ఇప్పటికి టైమొచ్చింది కాబట్టి చెప్పాను"

"ఆ పధ్నాలుగేళ్ళ కొడుకే మా నాన్న కదా బామ్మ"

"ఛ! ఆ వయసుకే? కాదు. వాడి ఇరవై మూడవ ఏట నీకు తండ్రయ్యాడు".

"మా అమ్మానాన్నలు ఎలా పోయారు బామ్మా"

అడిగింది అనన్య.

**(ఇంకావుంది)**



# హేమంత్ కుమార్‌కు హారర్ సినిమాలంటేనే ఇష్టమా?



అచ్చమైన బెంగాలీ భద్రలోక్ వేషంలో గంభీరంగా కనబడే హేమంత్‌కుమార్‌కు డిటెక్టివ్ నవలలంటే పరమ ఇష్టం. ఆయన హిందీలో నిర్మించిన తొలి చిత్రం 'బీస్ సాల్‌బాద్' (1962). షెర్లాక్స్ హోమ్స్ సృష్టికర్త కానన్ డయల్ రాసిన 'ది హౌండ్ ఆఫ్ బాస్కర్ విల్లిస్' రాసిన డిటెక్టివ్ నవల దాని కాధారం. సెట్ డిజైనర్‌గా ఉండి డైరక్టరుగా మారిన బీరేన్‌నాగ్ ఆ చిత్రానికి దర్శకుడు. అంతకుముందు కూడా అనేక డిటెక్టివ్ చిత్రాలు వచ్చినా 'బీస్‌సాల్‌బాద్'లో ఓ భయానక వాతావరణాన్ని సృష్టించి ప్రేక్షకులను హడలగొట్టడం జరిగింది. పాడుపడిన భవంతి, గడ్డం నౌకరు, నిలువెత్తు రెల్లుగడ్డి, దీపం పట్టుకునే వెళుతూండే యువతి పాడే 'కహీదీప్ జలే' పాట తెలుగుప్రేక్షకులను ఠారెత్తించాయి. సినిమా చూస్తూ ఈ ఊళ్లో ఇద్దరు మూర్ఛపోయారట అంటే ఆ ఊళ్లో ముగ్గురు మూర్ఛపోయారట అని చెప్పుకునేవారు. చివరికి గడియారం గంట కొట్టినా ప్రేక్షకులు ఉలిక్కిపడేలా బాక్‌గ్రౌండ్ మ్యూజిక్ సమకూర్చిన హేమంత్ కుమార్‌దే నైపుణ్యమంతా!

ఎందుకంటే దాని తర్వాత తీసిన కొహరా (1964)లో కూడా ఆయన ప్రజ్ఞ పునః ప్రదర్శించాడు. బీస్‌సాల్‌బాద్‌లో బీరేన్‌నాగ్ తన ఆర్ట్ డైరెక్టరు అనుభవం అంతా ప్రదర్శించి రాత్రి వేళ సీనుల్లో మనలను హడల గొట్టాడనుకుని ఊరడిల్లితే మరి కొహరాలో కథానాయిక తన సవతి భార్య గదుల్లో తిరుగాడే సీన్ల మాటేమిటి? డాఫ్నే డి మారియర్ రాసిన నవల 'రెబెకా'ను ఆల్‌ఫ్రెడ్ హిచ్‌కాక్ సినిమాగా తీస్తే దాన్నే 'కొహరా'గా తీశారు హేమంత్. దానిలో భార్యను పోగొట్టుకున్న ఒక జమీందారు ఓ సామాన్యురాలిని పెళ్లి చేసుకుని బంగళాకు తీసుకువస్తాడు. బంగళాలో అందరూ ఈమెను చనిపోయిన భార్యతో పోల్చి ఈసడిస్తూ ఉంటారు. ఒక రోజు నాయిక ఆ మాజీ భార్య గదుల్లో తిరుగాడుతుంది. పట్టపగలే అయినా నేపథ్య సంగీతం కారణంగా అక్కడ ఆమె భూతం తిరుగుతున్నట్టు ఒక విధమైన 'ఈరీ' ఫీలింగ్ కలిగిస్తాడు సంగీత దర్శకుడు. ఇక సస్పెన్స్ సినిమాలంటే హేమంత్‌కుమార్ సంగీతం ఉండి తీరాలి అనుకో సాగారు నిర్మాతలు. 'సన్నాటా' (1966) 'ఉస్ రాత్‌కే బాద్' (1970) వంటి సినిమాలకు ఆయనే సంగీత దర్శకుడు.

హేమంత్‌కుమార్ కెరియర్ ప్రారంభించినది గాయకుడిగానే! వారణాశిలో పుట్టిన ఈయన స్కూలు చదువు వదిలిపెట్టి ప్రొఫెషనల్ సింగర్ కావాలని ఫణిబెనర్జీ, శైలేంద్రప్రసాద్ గుప్తాల వద్ద సంగీతం అభ్యసించారు. రేడియోలో పాటలు పాడాక తొలి రికార్డ్ (1937)లో విడుదల అయింది. పంకజ్ మల్లిక్ బాణీలో రవీంద్ర సంగీతం పాడి పేరు తెచ్చుకున్న హేమంత్. 1949-52 మధ్య సలిల్ చౌధురి సాంగత్యంలో పంథా మార్చుకున్నారు. ఫణిబర్మ 'నిమాయ్ సన్యాసి' (1940)తో బెంగాలీ గాయకుడిగా, 'ఇరాదా' (1944)తో హిందీ గాయకుడిగా సినీరంగ ప్రవేశం చేసిన హేమంత్



1947 నుండి సంగీత దర్శకుడిగా మారారు. 1947లో పూర్వరాగ్ (బెంగాలీ)తో మొదలయిన ఆయన ప్రస్థానం 'ఆగమన్' (1988) వరకు సాగింది.

ఈలోగా ఎన్నో హిట్స్ - నాగిన్ (1954), జాగృతి (1954), మిస్‌మేరీ (1957 - 'మిస్సమ్మ'కు హిందీ రూపం) బీస్‌సాల్‌బాద్ (1962), సాహిబ్ బీబీ ఔర్‌గులామ్ (1962), కొహరా (1964), దో దిల్ (1965), అనుపమా (1966) ఖామోషీ (1969).

బెంగాలీలో ఆయన టాప్‌సింగర్. జూబిలీ హీరో ఉత్తమ్‌కుమార్‌కి గొంతు అరువిచ్చినది ఆయనే. ఘంటసాల - సుశీల లాగ హేమంత్ కుమార్ - సంధ్యా ముఖర్జీల యుగళ గీతాలంటే బెంగాలీలు చెవికోసుకుంటారు. తరుణ్ మజుందార్ వంటి దర్శకుడి చిత్రాలకు హేమంతే సంగీత దర్శకుడు. మరణించేంతవరకు ఆయనకు బెంగాలీ రంగంలో మ్యూజిక్ డైరక్షన్ ఛాన్సులు వస్తూనే ఉన్నాయి.

రవీంద్రుడిపై భక్తితో 'గీతాంజలి పిక్చర్స్' అనే నిర్మాణ సంస్థ ప్రారంభించిన హేమంత్ కుమార్ ఎంతో మంది యువ దర్శకులను ప్రోత్సహించేడు. మృణాల్‌సేన్ ('నీల్ ఆకాషేర్ నీచే',) బీరేన్‌నాగ్ (బీస్‌సాల్ బాద్, కొహరా) పినాకీముఖర్జీ (ఫరార్) హృషీకేశ్ ముఖర్జీ (బీవీ ఔర్ మకాన్) తరుణ్ మజుందార్ (రాహ్‌గీర్), అసిత్‌సేన్ (ఖామోషీ - తెలుగులో "చివరకు మిగిలేది").

బిశ్వజిత్‌తో తీసిన 'బీస్‌సాల్‌బాద్', 'కొహరా' హిట్ అయిన తర్వాత ఫరార్ (1965) అనే సస్పెన్స్ సినిమా అనిల్ ఛటర్జీ హీరోగా తీశాడు. అది ఫెయిలయింది. 1969లో 'ఖామోషీ' (అప్పుడే పైకి వస్తున్న రాజేష్‌ఖన్నాకు ఛాన్సిచ్చారు)తో బాటు 'రాహ్‌గీర్' బిశ్వజిత్‌తో తీశారు. రాహ్‌గీర్ లవ్‌స్టోరీ కాగా ఖామోషీ ఆద్యంతం విషాదభరితం.

'బీస్‌సాల్‌బాద్' విజయం తిరిగి పొందాలను కొని ఆ పేరు స్ఫురించేట్లు 'బీస్‌సాల్ పహ్‌లే' (1972) అనే ఇంకో సస్పెన్స్ సినిమా కొడుకు రితేష్ హీరోగా, ప్రబీర్‌రాయ్ దర్శకుడిగా తీస్తే అది ఫెయిలయ్యింది. ఈ విధంగా ఆయన తీసిన సినిమాలలో ఎక్కువ భాగం సస్పెన్స్ థ్రిల్లర్లే. హేమంత్ కుమార్ సంగీతం సమకూర్చిన 'లవ్ ఇన్ కెనడా' (1979) అనే చిత్రంలో ఆయన కోడలు మౌసమీ చటర్జీ హీరోయిన్ కావడం ఓ విశేషం.

గాయకుడిగా, సంగీత దర్శకుడిగా, నిర్మాతగా మనకు తెలిసిన హేమంత్‌కుమార్ 'అనిందితా' (1972) అనే బెంగాలీ చిత్రాన్ని డైరక్టు చేశారు. అంతేకాదు 1988లో రచయితగామారి 'అమార్ గానేర్ స్వరలిపి' అనే ఆత్మకథ రాసుకున్నారు కూడా!

-కమ్యూనికేటర్ ఫీచర్స్

# గాయకుడిగా, సంగీత దర్శకుడిగా హేమంత్‌కుమార్ సినీ గీతాలు...

**చిత్రం: జాల్ (1952)** గానం: హేమంత్‌కుమార్
గీతం: సాహిర్ లుధియాన్వీ సంగీతం: ఎస్.డి.బర్మన్

యే రాత్, యే చాంద్‌నీ, ఫిర్ కహాఁ
సున్ జా దిల్ కీ దాస్‌తాఁ ॥యే॥
పేడోంకీ శాఖోం పే, సోయీ-సోయీ చాంద్‌నీ
తేరే ఖయాలోం మేఁ, ఖోయీ-ఖోయీ చాంద్‌నీ
ఔర్ థోడీ దేర్ మేఁ థక్‌కే లౌట్ జాయేగీ
రాత్ యే బహార్ కీ, ఫిర్ కభీ న ఆయేగీ
దో ఇక్ పల్ ఔర్ హై యే సమాఁ
సున్‌జా దిల్ కీ దాస్తాఁ ॥యే॥
లహరోం కే హెూంఠోం పర్, ధీమా-ధీమా రాగ్ హై
భీగీ హవావోం మేఁ ఠండీ-ఠండీ ఆగ్ హై
ఇస్ హసీన్ ఆగ్ మేఁ తూ భీ జల్‌కే దేఖ్‌లే
ఖుల్‌నే దే అబ్ ధడ్‌కనోం కీ జుబాఁ ॥సున్‌జా॥
జాతీ బహారేఁ హైఁ, ఉఠ్‌తీ జవానియాఁ
తారోంకీ ఛావ్ మేఁ, కహ్‌లే కహానియాఁ
ఏక్ బార్ చల్ దియే, గర్ తుఝే పుకార్‌కే
లౌట్‌కర్ న ఆయే, కాఫిలే బహార్‌కే
ఆజా అభీ జిందగీ హై జవాఁ ॥సున్‌జా॥

**చిత్రం: కోహ్‌రా (1964)**
గీతం: కైఫీ అజ్మీ గానం, సంగీతం: హేమంత్‌కుమార్

యే నయన్ డరే - డరే, యే జామ్ భరే - భరే జరా పీనే దో
కల్ కీ కిస్‌కో ఖబర్, ఇక్ రాత్ హెూకే నిడర్ ముఝే జీనే దో
రాత్ హసీఁ, యే చాంద్ హసీఁ
తూ సబ్‌సే హసీఁ మేరే దిల్‌బర్
ఔర్ తుఝ్‌సే హసీఁ, తేరా ప్యార్, తూ జానే నా
ప్యార్ మేఁ హై జీవన్ కీ ఖుశీ,
దేతీ హై ఖుశీ, కయీ గమ్ భీ
మై మాన్ భీ లూఁ కభీ హార్, తూ మానే నా

'దీప్ జ్వెలే జాయ్' (1959) అనే బెంగాలీ చిత్రం థీమ్ సాంగ్ 'ఎయ్ రాత్ తొమార్, అమార్' పాడినది, బాణీ కట్టినది హేమంత్ కుమార్. దాన్ని 'చివరకు మిగిలేది' (1960)గా తెలుగులో పునర్నిర్మించినప్పుడు ఆ ట్యూన్‌లోనే సంగీత దర్శకుడు అశ్వత్థామ ఘంటసాలచే 'సుధవోల్ సుహాసినీ'గా పాడించారు. హేమంత్‌కుమార్ 1964లో కొహ్‌రా చిత్రం తీస్తూ ఈ ప్రేమ గీతానికి ఆ ట్యూన్‌నే వాడుకున్నారు. అందుకే ఈ పాట 'సుధవోల్' ట్యూన్‌లో ఉన్నా హేమంతకుమార్ - అశ్వత్థామను కాపీ కొట్టారనుకోకూడదు. 'దీప్ జ్వెలీ జాయ్'ను హిందీలో హేమంత్‌కుమారే 1969లో హిందీలో ఖామోషీ గా తీశారు. థీమ్ సాంగ్ ట్యూన్ అప్పటికే 'కొహ్‌రా'కు వాడేశారు కాబట్టి ఇంకో ట్యూన్ కట్టారు. అది 'పుకార్‌లో..'! అదీ పెద్దహిట్టే!

హేమంత్‌కుమార్ వాయిస్‌లో వృద్ధాప్యం కనబడుతుందని, నేపథ్య గీతాలకు మాత్రమే సరిపోతుందని అనుకొనే చాలామందికి ఆయన హీరోలకు పాడాడని తెలియదు. పాడినా ఆయన స్వంత సినిమాలలో హీరో (సాధారణంగా బిశ్వజిత్)లకు మాత్రమే పాడా డనుకుంటారు. బెంగాలీలో టాప్‌హీరో ఉత్తమ కుమార్‌కు ప్లే బ్యాక్ పాడినది హేమంత్‌కుమారే! పైన ఉన్న 'యేరాత్' పాటను తెరపై అభి నయించినది మరెవరో కాదు - రొమాంటిక్ ఐడాల్ -దేవానంద్! సినిమాకు దర్శకత్వం వహించిన గురుదత్ రఫీచేత పాడిద్దామని అంటే ఎస్.డి.బర్మన్ 'నీకు తెలియదు, ఇలాటి రొమాంటిక్ గీతానికి హేమంతే సరి!' అని గట్టిగా చెప్పాడు. దేవానంద్‌కి హేమంత్ పాడిన 'హై అప్‌నా దిల్' (సోల్వా సాల్) 'నతుమ్ హామే జానో' ('బాత్ ఏక్ రాత్ కీ') పాటలు కూడా హిట్టేనని ఈ సందర్భంగా గుర్తు చేసుకోక తప్పదు.

**చిత్రం: ప్యాసా (1957)** గానం: హేమంత్‌కుమార్
గీతం: సాహిర్ లుధియాన్వీ సంగీతం: ఎస్.డి.బర్మన్

జానే వో కైసే లోగ్ థే జిన్‌కే ప్యార్ కో, ప్యార్ మిలా
హమ్‌నే తో జబ్ కలియాఁ మాంగీ కాంటోం కా హార్ మిలా ॥జానే॥
ఖుషియోం కీ మంజిల్ ఢూంఢీ తో గమ్ కీ దర్ద్ మిలీ
చాహత్ కే నగ్‌మే చాహే తో ఆహేఁ సర్ద్ మిలీ
దిల్ కే బోఝ్ కో దూనా కర్‌గయా
జో గమ్ ఖ్వార్ మిలా ॥హమ్‌నే॥
బిఛడ్ గయా, బిఛడ్ గయా హర్ సాథీ దేకర్
పల్-దో-పల్ కా సాథ్ కిస్‌కో ఫుర్‌సత్ హై జో థామే
దీవానోం కా హాథ్ హమ్‌కో అప్‌నా సాయా తక్
అక్‌సర్ బేజార్ మిలా ॥హమ్‌నే॥
ఇస్‌కో హీ జీనా కహతే హైఁ తో యూఁహీ జీ లేంగే
ఉఫ్ న కరేంగే, లబ్ సీలేంగే ఆఁసూ పీ లేంగే
గమ్ సే అబ్ ఘబరానా కైసా
గమ్ సౌ బార్ మిలా ॥హమ్‌నే॥

**చిత్రం: బీస్‌సాల్‌బాద్ (1962)** గానం: లతా
గీతం: షకీల్ బదాయూనీ సంగీతం: హేమంత్‌కుమార్

కహీఁ దీప్ జలే, కహీఁ దిల్
జరా దేఖ్‌లే, ఆకర్ పర్‌వానే
తేరీ కౌన్‌సీ హై మంజిల్ ॥కహీ॥
మేరా గీత్, మేరే దిల్‌కీ పుకార్ హై
జహాఁ మై హూఁ, వహీఁ తేరా ప్యార్ హై
మేరా దిల్ హై తేరీ మహఫిల్ ॥కహీ॥
నా మైఁ సప్‌నా హూఁ, నా కోయీ రాజ్ హూఁ
ఇక్ దర్ద్ భరీ ఆవాజ్ హూఁ
పియా దేర్ న కర్ ఆ మిల్ ॥జరా॥
దుశ్‌మన్ హైఁ హజారోం, యహాఁ జాన్ కే
జరా మిల్‌నా నజర్ పహ్‌చాన్‌కే
కయీ రూప్ కే హైఁ కాతిల్ ॥కహీ॥

సినిమాలో పాము కనబడగానే 'నాగిన్ ట్యూన్' గుర్తుకు వచ్చినట్లు దెయ్యం అనగానే గుర్తుకు వచ్చే ట్యూన్ 'కహీదీప్ జలే'! సన్నివేశ చిత్రీకరణ వల్ల పాట వినగానే ఒళ్లు జలదరించినా, నిజానికి ఇది ఒక చక్కని విరహగీతం!

'జాల్' సినిమాలోని 'యేరాత్' పాట హిట్ అయిన తర్వాత బర్మన్ మాటల్లో సత్యాన్ని గురుదత్ గుర్తించాడేమో! 'ప్యాసా'లో తక్కిన పాటలన్నీ రఫీచేత పాడించినా ఈ విషాదగీతానికి మాత్రం హేమంత్‌కుమార్‌ను ఎంచుకున్నాడు. పాట మూడ్ క్రియేట్ చేయడానికేమో, అప్పటిదాకా ప్యాంటులో కనబడిన గురుదత్ ఈ పాటలో ఫక్తు బెంగాలీ బాబులా పంచె, లాల్చీ, ఉత్తరీయంతో కనబడతాడు. భగ్న ప్రేమికుడి హృదయ వ్యథను తన గళంలో అద్భుతంగా పలికించాడు హేమంత్‌దా. తరువాత అయిదేళ్ళకు బెంగాలీ నేపథ్యంలో తీసిన తన 'సాహెబ్, బీబీ ఔర్ గులామ్'కు (1962) సంగీతం ఇచ్చే బాధ్యత హేమంత్ కుమార్‌కే అప్పగించాడు గురుదత్!

# లలిత సంగీతం



## కడచేనటే సకియా యీ రాతిరి



ప॥ కడచేనటే సకియా యీ రాతిరి
కడుభారమైన ఎడబాటున అయ్యయ్యో ॥కడచేనటే॥
1. చ॥ ఈ మేఘవేళ ఏమోకదే సకియా
స్వామి దవ్వైన నిదుర రాదాయెనే అయ్యయ్యో ॥కడచేనటే॥
2. చ॥ ఈ కడిమివోలె ఎదురుచూచేనే
ఏకాకి నా బ్రతుకు చేదామెనే అయ్యయ్యో ॥కడచేనటే॥


ప్రముఖ గాయకుడు,
స్వరకర్త లలిత సంగీత
విద్వాంసుడు, వాగ్గేయకారుడు
**ఎం.చిత్తరంజన్**
సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-7402993


| | | |
|---|---|---|
| రచన | : | కీ॥ శే॥ దేవులపల్లి కృష్ణశాస్త్రి |
| గానం, సంగీతం | : | కీ॥ శే॥ వోలేటి వెంకటేశ్వర్లు |
| రాగం | : | పహాడి (హిందుస్తాని రాగం) |
| తాళం | : | ఆది (కర్నాటక సంగీతం) |
| | | కహరువా (హిందుస్తాని సంగీతం) |
| ఆరోహణ | : | ప ద స రి గ ప |
| అవరోహణ | : | ప (మ) గ రి స (ని) ద ప |

షడ్జమ, చతుశృతి రిషభం, అంతర గాంధారం, పంచమం, చతుశృతి ధైవతం - యీ రాగంలోని స్వరాలు - అనగా మోహనరాగంలో వలెనే యిందులో స్వరాలుంటాయి. కాని అవరోహణలో శుద్ధమధ్యమాన్ని, కాకలి నిషాదాన్ని కలుపుకోవటం పరిపాటి. ఈ రాగం మధ్యమ శృతిలో పాడవలసినదిగా పండిట్ భాత్ ఖండే తమ "హిందుస్తాని క్రమిక్ పుస్తక్" (5వ భాగం) అనే తమ హిందుస్తాని సంగీత పద్ధతిని తెలిపే గ్రంధంలో ప్రస్తావించారు. అసలు ఇది పర్వత ప్రాంతాలలో నివసించేవారు పాడుకొనే "ధున్" (బాణీ లేక ట్యూన్) అందుకే దీనికి 'పహాడీ' అని పేరు వచ్చింది. దీనిని ఒక జానపదశైలిగా పరిగణించటం కద్దు. కనుకనే దీనిని ఒక రాగంగా గుర్తించిన ప్రస్తావన సాధారణంగా హిందుస్తానీ సంగీత గ్రంథాలలో మనకు కనపడదు. ఇది పంజాబ్ ప్రాంతంలో ఎక్కువగా ప్రాచుర్యాన్ని పొందినట్లు కూడా చెబుతారు. కాని పండిట్ భాత్ఖండే వారి గ్రంధంలో యీ రాగం యొక్క మూర్ఛనను పైన తెలిపినట్లు భూపాలి స్వరాలు (కర్నాటక సంగీతంలో మోహన)గా చెప్పి మంద్రస్థాయి (అనగా మంద్ర పంచమం నుండి) నుండి పాడాలని అందుకే యిది మధ్యమ శృతిలో పాడవలసిన రాగమని తెలిపారు. ఆయన లక్షణ గీతం లాంటిది వ్రాసి వివరణ కొంత యిచ్చారు.

**మురళి మధురధున్ చతుర సునావత్**
**తన్మన్సఖి మేరో అతహి లుభావత్**
**'మ' 'ని' సుర్ బర్జిల్ రూప్ దిఖావత్**
**బ్రిజ్ బనితాసబ్ 'పహాడి' బనావత్**

ఏ రాగానికైనా అన్యస్వరాలు చేర్చి మిశ్రమం చేసి రాగంలోని మాధుర్యాన్ని పెంచుకుంటూ పాడటం హిందుస్తానీ సంగీతంలో ఒక సంప్రదాయంగా ఉన్నది. ఆ విధంగా లలిత శాస్త్రీయ, లలిత సంగీతంలో 'మిశ్రపహాడీ' అంటూ ఇంకా ఎన్నో అన్యస్వరాలను చేర్చి పాడటము తరచుగా జరుగుతూనే ఉన్నది. అలాగే ఎన్నో లలిత గీతాలకు (భజన్, గీత్, గజల్)






ఆకాశవాణిలోను చలన చిత్రాలలోను (వివిధ భాషా చిత్రాలు) మనోజ్ఞమైన బాణీలు ఎంతో మంది నిష్ణాతులైన స్వరకర్తలు మనకందించారు.

'కడచేనటే సకియా' అనే యీ పాట ఆవిర్భవించటానికి ప్రేరణ కలిగించిన సందర్భం 1964లో జరిగింది. ఆ సంవత్సరం జులై ప్రాంతంలో ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం వారు స్థానిక రవీంద్ర భారతిలో ప్రదర్శించటానికి వర్షఋతువుకు సంబంధించిన సాంస్కృతిక కార్యక్రమాన్ని రూపొందించారు. విజయవాడ కేంద్రంలో ప్రొడ్యూసర్‌గా ఉన్న శ్రీ వోలేటి వెంకటేశ్వర్లు గారు యీ కార్యక్రమంలో పాల్గొనటానికి హైదరాబాద్ వచ్చారు. ఈ కార్యక్రమ సందర్భంగానే నేను శ్రీ దేవులపల్లి వెంకట కృష్ణశాస్త్రిగారి యింటిలో ఉండగా వోలేటి గారక్కడికి వచ్చారు. అదే సమయంలో కృష్ణశాస్త్రి గారి కుమారుడు శ్రీ బుజ్జాయి తను కొత్తగా కొని తెచ్చుకున్న హిందుస్తానీ ఎల్.పి. రికార్డును పక్కగదిలో వింటుండగా శాస్త్రిగారి వద్ద కూచున్న మా చెవులలో పడింది. అందరం ఆ గదిలోకి వెళ్ళి విన్నాం. అది పాకిస్తాన్‌లోని విద్వాంసులు సలామత్ అలి, నజాకత్‌అలి గానం చేసిన పహాడి రాగపు 'ఠుమ్రి' - "సైయాఁ బిన్ ఘర్ సూనా". వోలేటి వారు 4, 5 సార్లు ఆ రికార్డు పదే పదే వేయించుకు విని పరవశులై పోయారు. హిందుస్తాని సంగీతంలో కూడా మహా విద్వాంసులైన వోలేటిగారు ఆ పారవశ్యంలో అరగంటసేపు పహాడిరాగం ఆలపించారు. కృష్ణశాస్త్రిగారు తానొక పాట రాస్తానని వోలేటిగారిని బాణీ కట్టమని అడిగారు. వెంటనే వోలేటి గారు స్పందించగా రూపొందిన సుమధుర గేయమే యీ "కడచేనటే సకియా యీ రాతిరి". రవీంద్రభారతిలో జరిగిన కార్యక్రమంలో వోలేటి యీ పాటను అద్భుతంగా గానం చేశారు.

## కీ॥శే॥ వోలేటి వేంకటేశ్వర్లు

కర్నాటక సంగీతంలో మహావిద్వాంసులుగా పేరు గాంచి ఒక విశిష్ట స్థానాన్ని సంపాదించుకున్న వోలేటి వేంకటేశ్వర్లు గారికి చిన్నతనం నుండే సంగీతం పట్ల అభిలాష మెండు. వీరు ఆగష్టు 27, 1928లో అచ్చి కాసులు, నరసింహారావు దంపతులకు జన్మించారు. 7వ యేటనే కాకినాడలో శ్రీ మునుగంటి వెంకట్రావు పంతులుగారి వద్ద సంగీతం ప్రారంభించారు. తరువాత డా॥ శ్రీపాద పినాకపాణి గారి వద్ద శిష్యరికం చేశారు. కాకినాడ పి.ఆర్. కాలేజీ నుండి బి.ఎ. (మ్యూజిక్) పట్టా పొందారు. 1950లో విజయవాడ ఆకాశవాణిలో "సంగీత శిక్షణ" కార్యక్రమానికి ఆయనను నియమించారు. అయితే అది కొద్దికాలమే సాగింది. తరువాత ఆయనకు మద్రాసు ఆకాశవాణిలోని రజనీకాంతరావు, ఎండ మూరి సత్యనారాయణ గార్ల ప్రోత్సాహము, ఆదరణ

లభించాయి. మద్రాసు ఆకాశవాణిలో ఎన్నో కార్యక్రమాలలో వోలేటిగారు పాల్గొనేవారు. ఆయనకు కేవలం కర్నాటక సంగీతమే కాక, హిందుస్తానీ, శాస్త్రీయ సంగీతం, గజల్, లలిత సంగీతం ఎక్కువగా వినే అలవాటు ఉంది. వాటిని విచక్షణతో పరిశీలించి విశిష్టతను గ్రహించి ఏదైనా అవలీలగా తమ గళంలో పలికేటట్లు విశేషంగా కృషి చేశారు. ఆ విధంగా హిందుస్తానీలో కూడా అత్యంత ప్రతిభాశాలిగా పేరు గడించారు. ఆయనకు "ఆంధ్రా బడే గులాం అలీఖాన్" అనే పేరు కూడా ఉన్నది. 1956లో విజయవాడ ఆకాశవాణిలో కర్నాటక సంగీత శాఖకు అసిస్టెంట్ ప్రొడ్యూసర్‌గా నియమితులయ్యారు. సుమారు 30 సంవత్సరాలు ఆకాశవాణిలో పని చేశారు. ఆయన నిర్వహించిన "కర్నాటక సంగీత శిక్షణ" ద్వారా ఆంధ్రులే కాదు, దక్షిణాది రాష్ట్రాలలో ఎంతోమంది సంగీతాన్ని అభ్యసించారు. విజయవాడ కేంద్రంలో ఎన్నో లలిత గీతాలకు, సంగీత రూపకాలకు బాణీలు కూర్చారు. ఆయన ఎక్కువగా హిందుస్తానీ రాగాలలో బాణీ కట్టేవారు. వారి కొన్ని రూపకాలలో విజయవాడ కేంద్రంలో నేను పాడటం జరిగింది. దర్బారీ కానడలో 'మృగనయనా రసిక మోహినీ', కేదార్ రాగంలో 'హోలీ ఇదేనోయ్ హోలీ' మొ॥ పాటలు ఆయన నిర్వహణలో నేను పాడాను. గజల్ అంటే ఆయనకు చాలా యిష్టం. పాకిస్తానీ కళాకారుడు మెహదీ హసన్ కంఠం ఆయనకు చాలా యిష్టం. 1978లో మెహదీ హసన్ భారతదేశంలో పర్యటించినప్పుడు ఆయన కచేరీ వినటానికి ప్రత్యేకంగా హైదరాబాద్ వచ్చి 200 రూ॥ టిక్కెట్టు కొనుక్కుని రవీంద్ర భారతిలో వోలేటిగారు ఆ కచేరీ విన్నారు.



వోలేటిగారు ఆధ్యాత్మ రామాయణ కీర్తనలకు ఆకాశవాణి ద్వారా ఎంతో ప్రాచుర్యం కలిగించారు. ప్రతిభ ఎక్కడ ఉన్నా ఎంతో సహృదయంతో మెచ్చుకుని ప్రోత్సహించేవారు. "మంచికి మారుపేరు వోలేటి" అనే కీర్తి గడించుకున్నారాయన. ఆకాశవాణికి, సంగీతానికి ఆయనచేసిన సేవ అపారం. నేషనల్ ఎవార్డు, బొంబాయిలోని షణ్ముఖానంద సభ వారి "సుర్ సింగార్" అవార్డు, మద్రాసులోని కృష్ణగాన సభ వారి "సంగీత చూడామణి" బిరుదు. కాకినాడ వారి "గాన కళానిధి" బిరుదు మున్నగునవి ఎన్నో వోలేటిగారిని వరించాయి. ఆ మహా విద్వాంసుడు డిసెంబర్ 29, 1989నాడు స్వర్గస్థులైనారు. బహుముఖీనమైన ఈయన ప్రతిభ అనన్య సామాన్యమైనది. ఎంతోమంది శిష్యులను తయారు చేశారు వీరు. వోలేటిగారి జయంతిని పురస్కరించుకొని ఆయన శిష్యులు, అభిమానులు ఈ ఏడాది సెప్టెంబర్ 1వ తేదీ నుండి నల్లకుంట రామాలయంలో సంగీతోత్సవాలను ఘనంగా నిర్వహించి ఆయనకు నివాళులర్పించారు.



## పహాడి రాగం ఆధారంగా కొన్ని చిత్రగీతాలు

### తెలుగు

| | పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|---|
| 1. | గాలికి కులమేది | కర్ణ | పి.సుశీల | ఎం.ఎస్.విశ్వనాథన్ |
| 2. | తీయనైన ఊహల | మోహినీ భస్మాసుర | పి.సుశీల | ఎస్.రాజేశ్వరరావు |
| 3. | కన్నీటి కడలిలోన | భాగ్యరేఖ | పి.సుశీల | పెండ్యాల |

### హిందీ

| | పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|---|
| 1. | ఆవాజ్ దే కహాఁ హై | జుగ్ను | నూర్‌జహాఁ, | నౌషాద్ |
| 2. | సుహానిరాత్ ఢల్ చుకే | దులారి | రఫీ | నౌషాద్ |
| 3. | మేరీ ఆంఖోఁమే బస్‌గయా కోయీరే | బర్‌సాత్ | లత | శంకర్‌జైకిషన్ |
| 4. | చౌధ్ వీఁ కా చాంద్ హో | చౌధ్‌వీఁ కా చాంద్ | రఫీ | రవి |
| 5. | చాహూంగా మై తుఝే సాంఘ్ సవేరే | దోస్తీ | రఫీ | లక్ష్మీకాంత్, ప్యారేలాల్ |
| 6. | గయా అంధేరా హువా ఉజాలా | సుబహ్ కాతారా | లత, తలత్ | సి.రామచంద్ర |
| 7. | తేరే భరోసే ఐనందలాలా | ప్రైవేటు రికార్డు | రఫీ | |
| 8. | నైనా లగాకే సుఖ్‌లేగయో దుఖ్‌దేగయో పరదేసీ సయ్యాఁ | పర్‌ఛాయీఁ | లత | సి.రామచంద్ర |
| 9. | చందాకీ ఛావ్ఁమే | పర్‌ఛాయీఁ | లత | సి.రామచంద్ర |




నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ తీరుతెన్నులపై అధ్యయనం చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

**రావి కొండలరావు**

రాసిన వ్యాసమిది



# ప్రాక్టికల్ జోకర్...నాగేష్...!



వేసవికాలం. మిట్ట మధ్యాహ్నం. ఎండ మండుతున్న వేళ. మేడ మీద పడుకుని వుంటే, దూరంగా నన్ను పేరు పెట్టి పిలుస్తున్నట్టు వినిపిస్తోంది. కలగంటున్నాను కాబోలనుకున్నాను. కాదు, నిజమే. గేటుకి తాళం వేసి పడుకోడంతోనూ, పిలుపు అందుకోడానికి ఆ టైములో కింద దిక్కెవరూ లేకపోవడంతోనూ 'కొండల్రావు గారూ', అనీ, 'కొండల్రావూ' అనీ వినిపిస్తూంటే, పరుగెత్తి దిగి కిటికీలోంచి చూశాను. బక్కపలచగా వున్న ఓ వ్యక్తి గేటుకి తల ఆన్చి స్పృహ తప్పినవాడల్లే అంటుకుపోయి వున్నాడు. వెనకాల నాలుగడుగుల దూరంలో కారుంది. ఎవరో తెలీడం లేదనుకుంటూనే గేటు దగ్గరకెళ్లి తాళం తీస్తూ చూస్తే, నాగేష్! "అరెరె! ఏమిటి -- నాగేషా -- ఈ ఎండలో?" అన్నాను.

"గేటు తియ్యవయ్యా ఎంతసేపు పిల్చేదయ్యా - ఏం చేస్తున్నావు స్లీపింగ్ మాత్ర మింగావా?" అని ఏడుస్తూ లోపలికి వచ్చాడు. వెనకాలే కారు దిగి అతని భార్యా వచ్చింది.

"సారీ, వెరీ సారీ" అన్నాను రెండు సారులు. పావుగంటాయి పిలుస్తున్నాట్ట - గేటు కొడుతున్నాట్ట. చుట్టు పక్కల వాళ్లు చూస్తున్నారు గాని, నేను పలకలేదుట. "కారుంది. ఇంట్లో వున్నారు అన్నాను నా భార్యతో. వీళ్లని లేవగొట్టిగాని వెళ్ళ వద్దు. అనుకుని పిలుస్తూనే వున్నాన్నాయనా" అన్నాడు నాగేష్. అతని భార్య నవ్వుతోంది ఇంతలో నా భార్య కూడా లేచి వచ్చింది.

"ఇంత మండుటెండలో రావడం ఏమిటి?" అన్నాను. "చల్లగా వెన్నెల కాచినప్పుడు రావాలంటే ఇంకా పది రోజులు ఆగాలి. అమావాస్య రోజులు కదా" అని జోక్ చేశాడు. నాగేష్ జోక్ చెయ్యకుండా మాట్లాడడు. చేసే పన్లూ ఇలాగే వుంటాయి. అసలు విషయం వాళ్ల పెద్దబ్బాయి పెళ్లి. ఇన్విటేషను ఇవ్వడానికి వచ్చారిద్దరూ. "తిరిగి తిరిగి రావడంలో ఇంత ఆలస్యమై మిమ్మల్ని డిస్టర్బ్ చేశాం" అన్నదావిడ. "అయ్యో" అందీవిడ. ఫలానా చర్చిలో పెళ్లనీ, తప్పకుండా రావాలనీ మరీమరీ చెప్పారు. అలాగే అలాగే అన్నాం. "కాఫీ తాగరా?" అంది మా ఇల్లాలు మర్యాదకి. "ఎందుకు తాగం - కాఫీ తెచ్చి అందులో ఐస్‌గడ్డలు వేసి ఇవ్వండి. వేడికి వేడి చలవకి చలవా" అన్నాడు, నాగేష్ చమత్కారం కలిపి. నవ్వుకుంటూ వుంటే దంపతులిద్దరూ కారెక్కారు. ఎండలో వచ్చి గేటుకి అంటుకు పోవడమే మాకు ఆశ్చర్యమూ, నవ్వూ.

"నాగేష్ పన్లనీ ఇలాగే వుంటాయి" అన్నాను.

"ఇంకా ఏమిటి?"

చెప్పాను. "ప్రియబాంధవి" అన్న సినిమాలో మనకి కొడుకు గదా. ప్రకాష్ స్టూడియోలో డబ్బింగ్ చెప్పాడు. అయిపోయింది. బయల్దేరడానికి కారు రాలేదు. "నేను వాహినీకి వెళ్లాలి. కార్లోనే పుట్టామా - నడుచు కుంటూ పోతా"నని మేనేజర్ని బెదిరించాడు. మేనేజరు "వచ్చేస్తుంది సార్ కారు. నాలుగు నిమిషాలు" అన్నాడు. "అదేంటి అంత కచ్చితంగా చెప్పావు.... నాలుగు నిమిషాల్లో రాకపోతే నడిచే వెళతాను" అన్నాడు నాగేష్. కారు రాలేదు. ఐదో నిమిషంలో బయల్దేరాడు. అంతలో కారొచ్చింది. "మీరు నడవలేరు పందెం! ఈ బిజీ రోడ్లులో మీలాంటి స్టారు నడుచుకుంటూ వెళ్లడమా - వెళితే పందెం" అన్నాన్నేను. "మీ పందెం ఏం వొద్దు" అని చకచకా బయల్దేరాడు. వెనకాల కార్లో మేము. ఆ ప్రసిద్ధ హాస్యనటుడు రోడ్డు మీద నుంచి వెళ్తూ వుంటే, అందరూ వింతగా ఆశ్చర్యంగా చూస్తున్నారు. కొందరు విష్ చేస్తుంటే తానూ చేస్తూ చకచకా నడుస్తున్నాడు. పక్కనుంచి వెళ్తున్న బస్సుల్లోంచి జనం తలలు బయటపెట్టి వెర్రి ఆనందంతో చూస్తున్నారు. ఎందుకు నడుస్తున్నాడో ఎవరికీ తెలీదు. ఒకాయన పక్కనుంచి కార్లో వెళ్తూ 'లిఫ్ట్' ఇస్తానంటే - అడ్డంగా చెయ్యి ఊపేసి, మొత్తానికి వాహిని చేరుకున్నాడు! ప్రాక్టికల్ జోకర్!.... అలా ఇంకెవరూ చెయ్యరేమో చెయ్యలేరేమో అనిపిస్తుంది.

అసలు, అతని అసలు పేరు నాగేశ్వరన్. కన్నడనాడులో పుట్టాడు గనక, కన్నడ భాష, తమిళుడు గనక తమిళం రెండూ మాట్లాడతాడు. తెలుగు సినిమాల్లో వేస్తూ తెలుగూ మాట్లాడతాడు. అంతకంటె బాగా మలయాళం వచ్చు. దక్షిణ భాషల్లో, కొన్ని తెలుగు సినిమాల్లో తప్ప - అతని మాట అతనిదే. మిమిక్రీలాంటివి చెయ్యడమూ, సరదాగా మాట్లాడ్డమూ చిన్నతనం అలవాట్లు. చదువుకుంటున్నప్పుడు - మాస్టారు

అడిగారుట. "మణుగు దూది బరువా? ఇనుము బరువా?" అని. పిల్లలందరూ 'రెండూ ఒకటే' అని అరిచారు గాని, నాగేశ్వరన్ అరవలేదు. "ఏం?" అన్నారు మాస్టారు. "మీరు కిందకూచోండి. నేను మణుగు దూది మీ తలమీద పడేస్తాను. తర్వాత ఇనుము పడేస్తాను. అప్పుడు మీరే చెప్తారు ఏది బరువో" అన్నాట్ట. "ఓరి పిడుగా" అని మాస్టారు, పిల్లల నవ్వుల మధ్య ఆశ్చర్యపోయారట. "ఒరే - నువ్వు మంచి విదూషకుడివి అవుతావురా, చమత్కారీ" అని ఆశీర్వదించారుట. ఓ పక్క చదువు, సంధ్యా ఇంకో పక్క నాటకాల్లో వేషాలూ. అలా అలా పెరిగాడు, పేరు తెచ్చుకున్నాడు. సినిమాల్లో ప్రవేశించాడు. అంతకుముందే నాగేష్ అయిపోయాడు. (ఇక్కడో విశేషం: తెలుగు వాళ్లందరూ 'నగేష్' అంటారు - తమిళులు రమాప్రభని రామాప్రబ అన్నట్టు)

నాగేష్ పర్సనాల్టీ కూడా అలాంటిది. వెదురుకర్ర వంగినట్టు వంగుతుంది. ముఖాన్ని కూడా అష్టవంకర్లూ తిప్పుతాడు. క్షణం కన్న తక్కువ టైములో ఎక్స్‌ప్రెషన్ మారుస్తాడు. అందుకే తక్కువ టైములో తారాపథానికి చేరుకున్నాడు. అంతకు ముందున్న కామెడీకి భిన్నంగా చేస్తూ 'బిజీ తార' అయిపోయాడు. ఒక స్టేజీలో రోజుకి నాలుగైదు సినిమాల్లో నటించే వాడు. ఎం.జి.ఆర్. సినిమాల్లోనూ, శివాజి గణేశన్ సినిమాల్లోనూ ఇతరుల సినిమాల్లోనూ అన్నింటిలోనూ అతనే! నాగేష్ లేని సినిమా వుండేది కాదు. అప్పుడు కారునిండా వెనక సీట్లో విగ్గులూ డ్రెస్సులూ పడేసుకుని, మేకప్‌మాన్‌తో గంటకో స్టూడియోకి తిరిగే వాడు! హాలీవుడ్ చిత్రాల్లోని జెర్రిలూయిస్‌ని ఆదర్శంగా తీసుకున్నాడు. "మిమ్మల్ని ఇండియన్ జెర్రిలూయిస్ అనవచ్చునా?" అని ఒక జర్నలిస్టు అడిగితే - "ఏం అతన్ని హాలీవుడ్ నాగేష్ అనకూడదా?" అని అడిగాడు.

ఒకసారి ఏదో షూటింగ్‌కి ఇంకో వూరు వెళ్తున్నాం - రైల్లో. అప్పుడు ఫస్టు క్లాసుండేది. ఒక స్టేషన్‌లో జనం పసిగట్టి కేకలు వేస్తే నాగేష్ వెళ్లి గుమ్మం దగ్గర నించుని చెయ్యి ఊపాడు. వాళ్లకి అతనితో షేకాండ్ చెయ్యాలనో, దగ్గరగా మాట్లాడాలనో వుంది కాబోలు, "కిందకి దిగండి సార్" అన్నాడొకడు. వెంటనే నాగేష్ "కిందకి దిగాల్నా? ఎందుకు? నా దగ్గర టిక్కట్టు వుందే-" అని జోక్ చేసి నవ్వించాడు.

ఓ సారి పెద్ద జోక్ పేల్చి మమ్మల్ని ఇబ్బందిలో పడేశాడు. నేనూ మా ఆవిడా బయటికి వెళ్తున్నాం. మా (నా) అత్తగారుండే వారు. ఆవిడకేం తెలీదు, ఎవరూ తెలీదు. అమాయకురాలు. పైగా తమిళం అసలు రాదు. అంచేత, ఎవరొచ్చినా తలుపు తియ్యవద్దనీ, లోపలే వుండమనీ వాళ్లమ్మాయి చెప్పింది. ఆ టైములో వచ్చాడు నాగేష్. ఆవిడకి సినిమా వాళ్లూ తెలీదు. "వాళ్లొచ్చేవరకు గేటు తీసుకుని లోపలి కొచ్చి కూచుంటాను" అని గేటు దగ్గరే పోర్టికోలో కుర్చీ వుంటే కూచున్నాడు. తర్వాత కథ పెద్ద కథ.

ఓ గంటలో మేము తిరిగొచ్చాం. మమ్మల్ని చూసి ఆవిడ ఉగ్రురాలైంది. ఎక్కడికెళ్లారంది. చెప్పాం. ఆవిడ నమ్మలేదు. "మీ ఆయన ఇలాంటి పన్లు చేస్తూ వుంటే నువ్వు మద్దతు ఇస్తున్నావా? వకాల్తా ఇస్తున్నావా?" అన్నట్టుగా తీవ్రంగా మాట్లాడింది. మాకేమీ అర్థం కాలేదు. నాగేష్ పెట్టిన జట్టీ ఏమిటంటే-

"ఎక్కడికి వెళ్లారు?" అని అడిగాడు - ఆమెని. తెలీదన్నారు అత్తగారు.

"అక్కడికే వెళతాడులెండి. మీకు తెలీదా - రోజూ ఇదే పని. మీ అమ్మాయిని ఆమె ఫ్రెండ్ ఇంట్లో వదిలేసి, ఇప్పుడే వస్తానని అక్కడికి వెళతాడు కొండ్రావు".

"ఎక్కడికి?"

"పాపం మీకు తెలీదు కాబోలు. తెలియాల్లెండి మీకూనూ. ఇంకొక ఆమెను పెట్టుకున్నాడుగా మీ అల్లుడు? అక్కడికి వెళతాడు. మీ అమ్మాయికీ తెలీదు పాపం, చెప్పకండి. చాలా రోజులుగా ఈ తతంగం సాగుతోంది. షూటింగంటాడు, ఏదో ఆఫీసుకంటాడు - ఆ మిష పెట్టి అక్కడికి పోతాడు. సంపాదించిన డబ్బు అంతా ఆమెకి పోస్తున్నాడు... ఏం చేస్తాంలెండి.... అంతే! చెడిపోయాడు, దేవుడే కాపాడాలి" అలా అని

## నాగేష్ నటించిన **సర్వర్ సుందరం** (తెలుగు డబ్బింగ్) సినిమా నుండి ఒక పాట



సర్వర్‌గా ఉన్న సుందరం (నాగేష్) సినీ నటుడై పెద్ద హీరోల జాబితాలో చేరిపోతాడు. సినిమాలలో ఓ పాట చిత్రీకరణ ఎలా ఉంటుందో చూపించే సందర్భంగా ఈ పాట వస్తుంది. మొదట గాయకుడు పాడడం, ఆ తర్వాత పాట షూటింగ్ ఇలా మొత్తం ప్రాసెస్‌ని చూపిస్తారు. ఈ పాటను పాడుతున్నట్టుగా అప్పటి నంబర్ వన్ తమిళ గాయకుడు టి.యమ్. సౌందర్‌రాజన్ తెరపై కనిపిస్తారు. ఈ డబ్బింగ్ చిత్రం ఒరిజినల్ తమిళం కనుక సౌందర్‌రాజన్ పై చిత్రీకరించారు. తెలుగు డబ్బింగ్‌కి వచ్చే సరికి తెరపై సౌందర్ రాజన్ కనిపిస్తూ ఉంటారు. పాటేమో ఘంటసాల గారి వాయిస్‌తో వినిపిస్తూ ఉంటుంది. ఓ రకంగా చెప్పాలంటే సౌందర్‌రాజన్ గారికి ఘంటసాల గారు డబ్బింగ్ పాడినట్టుగా మనకి అనిపిస్తుందన్న మాట. అందుకే అప్పట్లో 'సినీ కసి' ఉన్న కుర్రాకారు ఈ విషయాన్ని పజిల్స్‌లోను, క్విజ్‌లలోనూ ఓ తమాషా ప్రశ్నగా జొప్పించేవారు.

రచన: అనిశెట్టి    పాడినవారు: ఘంటసాల, ఎల్.ఆర్.ఈశ్వరి
సంగీతం: విశ్వనాథం, రామమూర్తి, పామర్తి

అ : నవయువతీ! స్నేహమతీ!
నవయువతీ! చక్కనిప్రియ
నవయువతీ హృదయమ్మున
కలవుగదా! నా వలపుల
కధవు గదా! పెదవులు చిందు
సుధవు గదా! యువకుడ ననుకనరాద!
అందం ఒక మాజిక్ టచ్
ఆశ ఒక సీక్రెట్ స్విచ్
అందాలు నీయందె పొంగెనులే
ఆనంద నీయందె పొంగెనులే
ఆనందరవమై మ్రోగేనులే
ఆహా నీమాట వినినంత
మైకం నిండేను మనసంతా!
ఆ : రమ్ము! చక్కని యువకా రావోయీ!
జవరాలీ మనసే నీదోయీ
యువసౌఖ్యాలన్నీ నీవోయీ
నవ స్వర్గం పిలిచే రావోయీ రావోయీ!
నవయువకా! చక్కని ప్రియ
నవయువకా! హృదయమ్మున
కలవుగదా! నా వలపుల
కధవుగదా! పెదవులు చిందు
సుధవుగదా! యువతిని ననుకనరాదా!
అ : సన్నని నడుమే
ఆ : మగువందం
అ : సున్నితస్వరమే
ఆ : మకరందం
అ : ముద్దుల పలుకు
ఆ : సందేశం
అ : భువికే వెలుగు
ఆ : మృదుహాసం

ఇంకా చెప్పి, విచారంగా ముఖం పెట్టి వెళ్ళిపోయాడు నాగేష్. ఇదీ ఆమె చెప్పిన విషయం.

"నేను నమ్మలేదు గాని, తర్వాత నమ్మాను. వచ్చీ రాని తెలుగులో అలా చెబుతూనే వున్నాడు. అయినా, నీకు తెలియక పోవడం ఏమిటే - నువ్వే మద్దతు ఇస్తున్నావు కాబోలు" అంది అత్తగారు తీవ్రంగా. ముందు మాకేమీ అర్థం కాలేదు. తర్వాత అర్థమైంది అది నాగేష్ పనేనని. మేము పకపకా నవ్వుకుంటుంటే, అత్తగారు కాస్త తీవ్రత హెచ్చిస్తున్నారు. అప్పుడు చెప్పాం. అతను నాగేష్ అనీ, కమేడియన్ అనీ ఇలాంటి ప్రాక్టికల్ జోక్స్ చేస్తాడనీ, సరదా అయిన వాడనీ. ఆవిడ కాస్త తగ్గినా "ఐనా ఇదేం హాస్యం! నన్ను ఇబ్బందిలో పడేశాడు" అన్నారు. నేను వెంటనే ఫోన్ చేశాను. ఫోన్ ఎత్తి పకపకా నవ్వుతున్నాడు. "ఏమైంది? అత్తగారు చీపురుకట్ట తీశారా? అసలు తలుపు తీశారా? మీ ఆవిడ ఏమంది?" అని ప్రశ్నలు వేశాడు. "ఊరుకోవయ్యా పాపం ఆమెని హడలెత్తించేశావ్. అసలే అమాయకురాలు" అన్నాను.

"అందుకే చెప్పాలి. నమ్మిన వాళ్లకి చెప్పగలం. నమ్మని వాళ్లకి చెప్పం గదా" అని నవ్వాడు, నేనూ నవ్వాను, మా ఆవిడా నవ్వింది, అత్తగారూ నవ్వింది. రేడియో హాస్యనాటిక అంతంలో అన్ని పాత్రలూ నవ్వినట్టూ మేమంతా నవ్వాం.

ఒక దృశ్యాన్ని హాస్యంతో పండించడం అతనికి తెలిసినట్టు ఇంకొకరికి తెలీదేమో అనిపిస్తుంది. బాగా ఇంప్రొవైజ్ చేస్తాడు. జోక్స్ పేలుస్తాడు. అసభ్యత వుండదు. అతి ఉండదు. ఏ డైరక్టరయినా అంగీకరించవలసిందే. 'బృందావనం' సినిమా క్లయిమాక్స్ దృశ్యంలో అతని సహకారం చాలా వుంది. అలాగే 'శ్రీకృష్ణార్జున విజయం'లో కొన్ని నిమిషాలే కనిపించినా, నవ్వించి పారేశాడు. రాజు వేషం . అతనికి చత్వారం. మత్స్య యంత్రం కొడతా నంటాడు. 'మీకు చత్వారం. కనిపించదే' అంటాడు మంత్రి (కె.కె.శర్మ) "నువ్వు పక్కనుంచి చెబుతూ వుండు నేను బాణాలతో కొట్టి పారేస్తాను"



అంటాడు రాజు. ఇదీ నేను రాసిన సీను. అక్కడో డైలాగు కలిపాడు నాగేష్.

"ఐతే పదండి -- కుడి కాలు ముందు పెట్టండి." అంటాడు మంత్రి. "నా కుడి కాలు ఏదీ?" అంటాడు రాజు. "మీ కుడి కాలు మీకు తెలీదా?" అని మంత్రి.

"తెలీదే - నాకు చత్వారం కదా, ఎలా కనిపిస్తుంది?"

గొల్లుమనిపించే డైలాగు. ఇలా, ఎప్పుడు ఏదో కలుపుతూ, సీను హాస్య భరితం చేస్తాడు. ఎప్పుడూ గలగలా మాట్లాడతాడు. సూక్తులు చెబుతాడు, వేదాంతం చెబుతాడు. జీవితాన్ని కాచి వడబోసిన సత్యాలు చెప్పాడు. తత్వాలు రాశాడు కూడా. సాధారణంగా హాస్యపాత్రలు ధరించే వాళ్లు ఏ సన్నివేశంలోనైనా విషాదంగా నటిస్తే నవ్వే వస్తుంది. నాగేష్ చేస్తే రాదు. సినిమాలలో ఎంత నవ్వించాడో, విషాదంలో అంత ఏడిపిస్తాడు.

కొన్ని సూక్తులు రాశాడు. మచ్చుకి:

**"సినిమా రైటర్లు అన్నీ కాపీ కొట్టగలరు. బ్రహ్మరాతని మాత్రం పాపం కాపీ కొట్టలేరు".**

**"మనిషి చేతిరేఖల్లో నాకు నమ్మకం లేదు. కోతి చేతిలోనూ రేఖలుంటాయి".**

**"పెళ్లి చూపుల్లో పెళ్లికొడుకు తినడానికి స్వీట్లు పెడతారు. ఎందుకో తెలుసా? అతనికి డైబటీసు వుందో లేదో తెలుసుకోడానికి".**

ఎప్పుడూ జోకులు చెబుతూ, చేస్తూ - నవ్విస్తూ వుండే నాగేష్ వుంటే 'లైవ్‌లీ'గా వుంటుంది. అందుకే అతను 'లవ్‌లీ'. ఆ మధ్య ఒకాయన వచ్చి 'కామెడీ నైట్' ఏర్పాటు చేస్తున్నాం అని ఆయన్ని కూడా పాల్గొనమని ఆహ్వానించాడు.

"కామెడీయా? ఎక్కడుంది ఇప్పుడు సినిమాల్లో. ఎప్పుడో చచ్చిపోయింది".

"అందుకే సార్, మీలాంటి వాళ్లు మళ్లీ మంచి కామెడీతో బతికించాలి"

"మొక్క చచ్చిపోయింది. దానికి ఎన్ని డ్రమ్ములతో నీళ్లు పోస్తే ఏం లాభం? చచ్చిన మొక్క లేవదు" అని వేదాంతిలాగా ముఖం పెట్టి సీరియస్‌గా చూసి, అంతలో నవ్వాడు నాగేష్. నవ్వు నవ్వుల నాగేష్!

జస్ట్ ఫర్ ఫన్

## జూదమా!?



ఒకూళ్లో ఓ గుడి, ఓ మసీదు, ఓ చర్చి వక్కనే ఉన్నాయి. భక్తులు పెద్దగా లేకపోవడంతో వాటి తాలూకు పూజారి, ముల్లా, ఫాదరు మధ్యాహ్నం పూట కలిసి కబుర్లు చెప్పుకోవడం, క్రమేపీ పేకాడడం మరిగారు., క్రమంగా ఇది ఊళ్లో ఉన్న పోలీసు ఇన్‌స్పెక్టరు దృష్టికి వచ్చింది. పార్కులో చీట్లాట ఆడేవాళ్ళను పట్టుకున్నంత ఈజీ కాదు కదా ఈ దైవ ప్రతినిధులను అరెస్టు చేయడం. అందువల్ల ముగ్గురూ కలిసి మధ్యాహ్నం డబ్బెట్టి పేకాడే సమయంలో ఇన్‌స్పెక్టర్ ప్రత్యక్షమయ్యాడు.

ముందుగా ఫాదర్‌ను చూస్తూ "మీరు పవిత్రమూర్తులు. జూదం ఆడటం పాపం, నేరం అని మీకు తెలుసు. మీరు జూదం ఆడారా? లేదా?" అని మాత్రం మిమ్మల్ని అడుగుతున్నాను. మీరు లేదంటే మారు మాట్టాడను. నిజం చెప్పాలో, వద్దో మీ మనసాక్షికే వదిలేస్తున్నాను." అన్నాడు చాలా మర్యాదగా.

ఫాదర్ ఓసారి ఆకాశం కేసి చూసి "భగవంతుడా, అబద్ధం ఆడుతున్నందుకు నన్ను మన్నించు" అని ప్రార్థన చేసుకుని, ఇన్‌స్పెక్టర్ కేసి సూటిగా చూడకుండా 'నాయనా, నేను జూదం ఆడటం లేదు' అన్నాడు.

అది విని నిట్టూర్చి ఇన్‌స్పెక్టర్ ముల్లాను అదే ప్రశ్న అడిగాడు. ముల్లా కూడా ప్రార్థన చేసేకుని ఫాదర్ లాగానే సమాధానం చెప్పాడు.

ఇన్‌స్పెక్టర్ మళ్లీ నిట్టూర్చి పూజారిని అదే ప్రశ్న అడిగాడు. పూజారి ప్రార్థన చేసుకోలేదు. ఇన్‌స్పెక్టర్ కళ్ళలోకి సూటిగా చూశాడు. ఝమాయించి అడిగాడు - "జూదమా? ఎవరితో ఆడుతున్నామట? ఆడడానికి కనీసం ఇద్దరు ఉండాలని తెలీదూ? అడిగేముందు కాస్త ముందూ వెనకా ఆలోచించుకోవద్దూ".

-విద్యాపతి

సీరియల్

5

# మా మామయ్య ఘంటసాల కథ

-శ్రీమతి ఘంటసాల సావిత్రి



ఆయన రావు బాలసరస్వతీ దేవిగారితో పాడేటప్పుడు కాస్త కష్టపడే వారు. ఎందుకంటే ఆవిడ చాలా తక్కువ శృతిలో పాడేవారు. భానుమతి గారు ఆవిడకి సరిపోయిన శృతిలో చేయించుకునే వారు. లీల వచ్చాక తన స్థాయిలో సరిపడే కంఠం అనుకున్నారు. కానీ ఆవిడకి తెలుగుభాష రాకపోవడంతో పాట నేర్పించవలసి వచ్చేది. -జిక్కిగారు కూడా మావయ్య రేంజికి పాడగలిగే వారు. సుశీలగారు వచ్చాక భాష సమస్య లేకపోయింది. పాడటం సులువైంది.

## మావయ్య రచనలు

బాలాంత్రపు రజనీకాంతరావుగారు మావయ్య చేత రేడియోలో చాలా పాటలు పాడించారు. "లైలా-విశ్వ రూపం" అనేది రేడియో నాటకంలో పాడిందే. తరువాత మావయ్య రజనీగారి అనుమతితో రికార్డుగా విడుదల చేయించారు. సినిమాల్లోకి వచ్చిన తరువాత కూడా రేడియో కోసం విశ్వనాధవారి 'కిన్నెరసాని' పాడారు. 'వీణాప్రియ వీణా' అనే పాట కచేరీల్లో కూడా పాడేవారు. తరువాత నండూరి వారి ఎంకి పాటలు, బసవరాజు అప్పారావు గారు, కొనకళ్ల వెంకటరత్నం, అడివి బాపిరాజు గార్ల గీతాలు, తను స్వయంగా రాసుకున్న పాటలు కచేరీల్లో పాడేవారు. నేను కాపురానికి రాకముందు కొన్ని పాటలు రాసారు. కాపురానికి వచ్చాక బహుదూరపు బాటసారి, మరణసమయమిదియె అనే పాటలు రాసారు. చాలా సంవత్సరాల తరువాత హైదరాబాద్‌లో అనారోగ్యంతో వున్నప్పుడు "ఆకాశం రమ్మన్నది" ఆనే పాట రాసారు. ఆ తరువాత వేదాంతపరమైన పాటలు, భక్తిపాటలు రాసారు. వెంకటేశ్వరస్వామి మీద, సత్యసాయిబాబా మీద పాటలు రాసారు. రికార్డుగా విడుదలయ్యాయి. సరస్వతీదేవి మీద కూడా ఆయన "నీ దయలేకున్నా నే పాడలేనమ్మ" అనే పాట రాసారు. వీటిలో 'బహుదూరపు బాటసారి' ఒక్కటే రికార్డుగా వచ్చింది.



## పేరు పడింది 'లైలా మజ్ను'తోనే...

ప్లేబాక్ గాయకుడిగా ఆయన స్వర్గసీమ, బాలరాజు, రత్నమాలలతో ప్రారంభించినా మొదటిసారిగా ఆయన పేరు 'లైలా మజ్నూ' సినిమాలో వేసారు. సంగీత దర్శకుడిగా లక్ష్మమ్మ కథతో ప్రారంభించినా ఆ చిత్రం వెంటనే విడుదల కాలేదు. కీలుగుర్రం, మనదేశం ముందుగా వచ్చాయి. వాలి సుగ్రీవ, వయ్యారి భామ చిత్రాలను కొన్ని పాటలు స్వరపరిచారు. శాస్త్రీయ సంగీత రీతిలో వున్న పాటలు, భావగర్భితమైన పాటలు ఎంతో ఆనందంగా పాడేవారు. ఇంట్లోనే ఎక్కువగా రిహార్సిల్స్ చేసేవారు. ముఖ్యంగా హాయిహాయిగా ఆమని సాగే, శివశంకరీ, రసికరాజ తగువారమూ కామా, సప్తస్వరాలు చిత్రంలో పాటలు అదనంగా స్వరాలు వేసుకుంటూ రెండు మూడు గంటల సేపు అలా తంబూరా మీటుకుంటూ పాడుకునేవారు. సంగీతం నేర్చుకున్నందుకు సార్థకం అయ్యేలా యిటువంటి పాటలు నెలకొక్కటైనా రాకూడదా? అనుకునేవారు. ఇంకా త్యాగరాజస్వామి వారి చలమేలరా మొదలైన కీర్తనలు, రామచిలుక నొకటి పెంచి, అన్నమయ్యవి బ్రహ్మకడిగిన పాదము, తందనానా అహి, కొలని దోపరికి గొబ్బిళ్లో, సదాశివ బ్రహ్మేంద్రస్వామి వారి కీర్తనలు పాడుకునే వారు. ఇక తరంగాలు పాడటంలో వారి నాన్నగారు సూరయ్యగారికి ఎంతో పేరుండేది. ఆయన తరంగాలు పాడుతుంటే మావయ్య చిన్నప్పుడు నాట్యం చేసేవారట. అయితే మావయ్య తరంగాలు పాడగా రికార్డు చేసినవి లేవు. అష్టపదులు ఒక రికార్డుగా వచ్చాయి. మరికొన్ని అష్టపదులు, రామదాసు కీర్తనలు, అన్నమయ్య కీర్తనలు, వెంకటేశ్వర సుప్రభాతం 27 శ్లోకాలకి, మరికొన్ని పాటలకి సంగీతం సెట్ చేసుకున్నారు. అయితే అవి రికార్డు చేయడం కుదరలేదు. మావయ్య ఒక్క తెలుగులోనే కాక తమిళ, కన్నడ, మళయాళ, సింహళ భాషలలో కూడా పాడారు.

## పేరుపడని పాండురంగ మహాత్మ్యం

పాండురంగ మహాత్మ్యం విడుదలకి ముందు రామారావు గారు ప్రివ్యూ వేస్తూ నన్ను కూడా తప్పకుండా తీసుకురమ్మని మావయ్యకి చెప్పారు. నేను అప్పుడు గర్భవతిని. వెళ్లటానికి సిగ్గు పడ్డాను. నేను రానందుకు ఎన్.టి.ఆర్.గారు అడిగారట. ఆయన వెంటనే మా యింటికి వచ్చారు. కారణం తెలుసుకోడానికి నన్ను చూసి అర్థం చేసుకుని వెంటనే మొదట మీ ఆడవాళ్లకి సినిమా వేయిస్తాను. మీరందరూ చూడండి. తరవాత మగవారికి వేయిస్తాను. అని తీసుకు వెళ్లి ఆడవాళ్లందరికీ మొదట ఆ సినిమా చూపించారు. ఆ సినిమాలో మావయ్య పేరు లేదు. దానికి చాలా బాధపడ్డారు ఎన్.టి.ఆర్.గారు.



## మామయ్య విదేశీ యాత్ర

మామయ్యకు ఒక ఆశ ఉండేది. విదేశాలకు వెళ్ళాలని, తనగాన మాధుర్యాన్ని ఆదేశపు తరంగాలలో విలీనం చేయాలని. ఆ రోజు వచ్చినప్పుడు ఆయన ఆనందపడ్డారు. ఆ సందర్భంలో ఆయనకు పూలహారం వేసినప్పుడు ఆయన ఆనందానికి హద్దులేదు. ఈ ఫోటో ఆ సందర్భములోనిదే. ఆ ఫోటో చూస్తే ఆయన ఆనందం గుర్తుకు వస్తుంది.

మామయ్యతో పాటు సర్వశ్రీ పి.సంగీతరావుగారు (హార్మోని), టి.జనార్దన్ (సితార్), నంజుండయ్య (ఫ్లూట్), మురుగేశం (ఘటం), సుభాన్ (క్లారినెట్), వి.యల్.ప్రసాదు (మృదంగం), జెడ్సన్ (తబల) మరియు శ్రీ కృష్ణమూర్తిగారు బృందానికి ప్రజా సంబంధాల మేనేజరుగా వెళ్ళారు. వీరితో పాటు మిమిక్రీ ఆర్టిస్టు శ్రీ వేణుమాధవ్‌గారు కూడా ఉన్నారు. మామయ్య వారి బృందము విదేశీప్రయాణమై 7వ తారీకు అక్టోబరు 1970 ప్రొద్దున మదరాసు మీనంబాకం విమానాశ్రయం నుండి బయలుదేరారు. వీడ్కోలు ఇవ్వటానికి వచ్చిన ఫిలిం పరిశ్రమలోని పెద్దలతో విమానాశ్రయం కళకళ లాడింది. కొత్తకాంతిని పుంజుకుంది.

ప్రముఖ నటులు పద్మశ్రీ అక్కినేని నాగేశ్వరరావు గారు, పద్మశ్రీ ఎన్.టి.రామారావు గారు మామయ్యను పుష్పాలంకృతులను చేసి వారి పర్యటన జయప్రదం కావాలని శుభాకాంక్షలు తెలిపారు.



నిర్మాతలు శ్రీ జగపతి రాజేంద్రప్రసాద్, సురేష్‌మూవీస్ అధినేత శ్రీ డి.రామానాయుడు, మల్లికార్జునరావు, శ్రీ త్రివిక్రమరావు, బలరాం, డి.వి.యస్.రాజు, కె.ఎ.ప్రభాకర్, పుండరీకాక్షయ్య, యం.యస్.రెడ్డి గార్లు, దర్శకులు శ్రీ పి.పుల్లయ్య, కె.విశ్వనాథ్, కె.బాబూరావు, నటులు సర్వశ్రీ గుమ్మడి, కాంతారావు, పద్మనాభం, ధూళిపాళ, రామకృష్ణ తదితరులు, రచయితలు సర్వశ్రీ ఆరుద్ర, ఆత్రేయ, సంగీత దర్శకులు కె.వి.మహదేవన్, టి.చలపతిరావు, టి.వి.రాజు, ఎ.ఎ.రాజ్, పుహళేంది, సత్యం, నేపథ్య గాయనీగాయకులు పి.సుశీల, పి.లీల, యస్.జానకి, పి.బి.శ్రీనివాస్, యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, పిఠాపురం నాగేశ్వరరావు పరిశ్రమకు చెందిన వందలాది అభిమానులు, మిత్రులు పూలమాలలతో ముంచెత్తి, ఘనమైన వీడ్కోలు ఇచ్చారు. ఆ దృశ్యము ఒక పండుగ జరుగుతున్నట్లుగా ఉంది. జీవితంలో మామయ్య, నేను, మా పిల్లలు మరచిపోలేని రోజు.

హర్షధ్వానాలు మిన్ను ముట్టుతుండగా మామయ్య పయనిస్తున్న విమానం సంగీత సరళిలో ఉన్న ధ్వనులతో ఆకాశంలోకి ఎగిరింది.

మొదటగా మామయ్య బృందం బెంగుళూరు చేరారు. అక్కడ ఆయన మిత్రులు, అభిమానులు కన్నడ సినిమా పరిశ్రమకు సంబంధించిన వారు మామయ్యకు ఘన సన్మానం చేసి వీడ్కోలిచ్చారు.

బెంగుళూరు నుండి విమానము బొంబాయి చేరింది. మామయ్య బృందం బొంబాయిలో కొద్దిసేపు ఉన్న సందర్భంగా బొంబాయి ఆంధ్ర మహాసభ ఆధ్వర్యాన వేలాది ప్రజలు వారికి ఘన సన్మానం చేసి వీడ్కోలు ఇచ్చారు. ఆ రాత్రికే అక్టోబరు 7న పశ్చిమ జర్మనీకి మామయ్య బృందం బయలుదేరి వెళ్ళింది.

మామయ్య బృందం అమెరికా, బ్రిటన్, పశ్చిమ జర్మనీ, కెనడా, ఫ్రాన్స్, కువైట్ దేశాలను పర్యటించాలనుకున్నారు. యూరప్‌లో ఒకవారం, అమెరికా, కెనడాలలో మూడు వారాలు పర్యటించాలనుకున్నారు. మామయ్య ఈ విదేశాలలో దక్షిణభారత శాస్త్రీయ జానపద, ఆధునిక సంగీతాలు ముఖ్యంగా తెలుగు సంగీతాన్ని ప్రచారం చేయాలని అన్నారు.

పశ్చిమ జర్మనీలు గోడెన్ గెన్‌లో సంగీత కచేరి చేయవలసిందిగా ఆహ్వానించారు. ఉత్తర అమెరికా న్యూయార్క్‌లోని సాహిత్య సాంస్కృతిక సంఘం ఆహ్వానం అందచేసింది. అమెరికా, కెనడాలలో అనేక చోట్ల ఈ సంఘం మామయ్య సంగీత కార్యక్రమాలను ఏర్పాటు చేసింది. న్యూయార్క్‌లో అక్టోబరు 16న, వాషింగ్టన్‌లో 17న, డెహ్రాడూన్‌లో 22న, చికాగోలో 23న, టొరెంటోలో 24న, హుస్టన్‌లో 29న, సైరాకస్‌లో 30న ఆయన సంగీత కార్యక్రమాలు ఉన్నాయి. శాన్‌ఫ్రాన్సిస్కో, లాస్‌ఏంజెల్స్, బోస్టన్, క్లీవ్‌లాండ్, నాస్‌విల్లి, ఐక్యరాజ్యసమితులలో ఆయన సంగీత కార్యక్రమాలను న్యూయార్క్ సాహిత్య, సాంస్కృతిక సంఘం ఏర్పాట్లు చేసింది.

మామయ్య తన బృందములో దేశ, విదేశిశ్రోతలను ఆకట్టుకుని వారి ఆత్మలను సంగీత పాశంతో బంధించి బొందితో కైలాసానికి పంపిన అనుభూతిని కలిగించారని మాతో చెప్పుతూ తన జన్మచరితార్థం అయిందని ఎంతో సంతోషపడేవారు. ఇవన్నీ గుర్తుకు వస్తుంటే, మనస్సులో చెప్పలేని బాధ కలిగి కనులు నీళ్ళతో నిండిపోతాయి.

యునైటెడ్ నేషన్స్‌లో ఐక్యరాజ్యాల దౌత్య ప్రతినిధులు అందరూ కూడా మామయ్య గానామృత రసాస్వాదనగావించి "శాంతి పతకం" (పీస్ మెడల్) బహూకరించారంటే అది మా జీవితాలకే ఒక మధురక్షణం. అది సంగీతానికే గౌరవం.

ఎక్కడికి వెళ్ళినా ఏ మూల కచ్చేరీ చేసినా భారతీయులతో పాటు విదేశీయులు కూడా విరగబడి వచ్చారు. ప్రతి చోట నిర్ణయించుకున్న కాల పరిమితిని మించి పాడాల్సిన అవసరం శ్రోతల కోరికపైన కలిగింది. వారి ఆప్యాయతలతో పూర్తిగా ముంచేశారు. సంగీతానికి ఎల్లలు లేవని, భాష తెలియకపోయినా గానాన్ని సంగీత ప్రియులందరూ హర్షించగలరని అర్థం చేసుకున్నానని మామయ్య ఎంతో ఆనందపడుతూ చెపుతుంటే మా మనస్సులు ఆనందంతో నిండిపోయాయి.

మామయ్య ప్రోగ్రాముని లండన్‌లో శ్రీమతి టంగుటూరి సూర్యకుమారిగారు ఏర్పాటు చేశారు.

యాత్ర ముగించుకొని వస్తూ కువైట్‌కు వెళ్ళేసరికి విమానము ఆలశ్యముగా చేరటము వలన ప్రోగ్రాము చేయలేదు. అది తలచుకొని బాధ పడుతూ ఉండేవారు. అక్కడ వారిని నిరుత్సాహ పరిచానని...

మదరాసు చేరుకున్నప్పుడు మళ్ళీ ఆయన మిత్రులు, శ్రేయోభిలాషులు చలనచిత్ర పరిశ్రమలోని నిర్మాతలు, దర్శకులు, సంగీత దర్శకులు గాయనీ గాయకులు ఎన్నో వందలమంది స్వాగతం చెప్పటానికి వచ్చారు. అక్కినేని నాగేశ్వరరావుగారు కూడా వచ్చారు. మామయ్యను అందరూ పూలమాలలతో ముంచెత్తారు. మామయ్య ఆనందానికి అవధులు లేవు. ఆ పర్యటనలో ఆయన కళ్ళజోడు ఎక్కడో పోగొట్టుకున్నారు.

"నా విదేశ పర్యటన మహద్భాగ్యానికి దోహదం గావించిన చలనచిత్ర నిర్మాతలకూ, డిస్ట్రిబ్యూటర్లకూ, పెద్దలకు, ప్రభుత్వానికి, పత్రికా ప్రముఖులకు, విదేశాల్లో నన్నూ, నా బృందాన్నీ ఘనంగా సన్మానించిన వివిధ సంస్థలకు లక్షలాది ప్రజలకు, నా పర్యటన జయప్రదం కావాలని ఆకాంక్షిస్తూ నాకు వీడ్కోలిచ్చి, తిరిగి వచ్చినప్పుడు స్వాగతం తెలిపిన ఫిలిం పరిశ్రమలోని మిత్రలకు, బంధువులకూ, నా శ్రేయోభిలాషులందరికీ నా కృతజ్ఞతా పూర్వక వందనములు'' అని మామయ్య కృతజ్ఞతలు చెప్పుకున్నారు.

## మామయ్యకు శిష్యుల సన్మానం

1972లో మామయ్యను పంచపాండవులైన శిష్యులు శ్రీరాఘవులు, శ్రీ విజయకృష్ణమూర్తి, శ్రీ పామర్తి, శ్రీ బి.గోపాలం, శ్రీ ఎం.రంగారావులు నూతన సంవత్సరం వేడుక ప్రకారం త్యాగరాయనగర్ వెంకటేశ్వర కళ్యాణ మండపంలో ఘనంగా సత్కరించారు. సభాధ్యక్షులుగా పద్మశ్రీ నాగయ్య గారు వ్యవహరించారు. పద్మశ్రీ చిత్తూరు నాగయ్యగారు మాట్లాడుతూ, "శిష్యులు గురువును ఇంత ఆప్యాయంగా ఈకాలంలో ఆదరించటం చాలా విశేషమనీ, ఇది ఒక శుభసూచికయనీ" చెప్పారు. మామయ్య యొక్క బహుముఖ ప్రజ్ఞని వివరించి, తుదకు తనకు కూడా కంఠం ఎరువిచ్చారన్నారు. శ్రీరంగాచార్యులు పద్యాలు పఠించి అర్పించారు.

పిమ్మట విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రిగారు తాము రచించిన ఘంటసాల వంశావళి నభివర్ణించు పద్యాలు గానం చేసారు.

శ్రీ బి.యన్.రెడ్డిగారు ఘంటసాల అనేక పాటలు పాడారని, ఆ కంఠంలో మాధుర్యంకలదన్నారు. ఈ సభలో శ్రీ ఆరుద్రగారు, శ్రీ లింగమూర్తిగారు, దాశరథిగారు, ప్రయాగ నరసింహశాస్త్రిగారు మాట్లాడారు. సభ ప్రారంభంలో శ్రీమతి జానకి ప్రార్థనా గీతమాలపించారు. 1972 నూతన సంవత్సర శుభ సందర్భమున గురుపూజ జరగటం, హేమాహేమీలు, కవీశ్వరులు పాల్గొనటం, కళాకారులు, గాయక గాయనీమణులు కలవటం మరిచిపోలేని సంఘటన.

## భగవద్గీతావతరణం

లతామంగేష్కర్ ఆవిడ తండ్రి వర్ధంతిని హైదరాబాద్‌లో ఏర్పాటు చేసినప్పుడు మామయ్య కచేరీ చేసారు. ఆ సందర్భంగా లతామంగేష్కర్ తను పాడిన భగవద్గీత రికార్డులు యిచ్చారు. ఆవిడ కొన్ని శ్లోకాలు వరుసగా పాడిన తరువాత ఇంగ్లీషులో కామెంటరీ వుంది. ఆ రికార్డులు విన్న తరువాత భగవద్గీత మనం అందరికీ అర్థమయ్యేలా సులభశైలిలో తెలుగు తాత్పర్యంతో పాడితే ఎలా వుంటుందన్న ఆలోచన మామయ్యకి వచ్చింది. అది కూడా లతామంగేష్కర్ గారిలా కాకుండా ప్రతి శ్లోకానికీ కామెంటరీ వుంటే బాగుంటుందని అనుకున్నారు. ఇలా అనుకుంటున్న సమయంలో హెచ్.ఎం.వి. మేనేజర్ గారు మంగపతిగారు మా యింటికి వచ్చి "ఏమండీ! మా గ్రామ్‌ఫోన్ కంపెనీని మరచిపోయారా?" అని అడిగారు. ఏదైనా రికార్డు చేద్దామని అన్నారు మంగపతిగారు. అప్పుడు మావయ్య "భగవద్గీత రికార్డు చెయ్యాలని వుంది" అంటే తప్పకుండా చేద్దామన్నారు మంగపతిగారు. కోట సత్యరంగయ్య శాస్త్రి గారి చేత భగవద్గీత తెలుగు వ్యాఖ్యానం రాయిస్తాను అన్నారు మంగపతిగారు. ఆయన అలాగే వేమన శతకం, సుమతీ శతకంలో మంచి నీతి పద్యాలు ఎంచుకుని రికార్డు చేద్దాం. ఈ యువతరానికి అవి స్ఫూర్తిగా వుండాలి అంటే మావయ్య అలాగే చేద్దాం. కానీ, ముందుగా భగవద్గీత తీసుకుందాం అన్నారు. కోట సత్యరంగయ్య శాస్త్రి గారు ఓసారి మాయింటికి వచ్చారు. ఇద్దరూ కూర్చుని మాట్లాడుకున్న తరువాత శాస్త్రిగారు తాత్పర్యం రాసి తీసుకువస్తానన్నారు. ఆయన రాసినది కొన్నిచోట్ల గ్రాంధికంగా చాలా కఠినంగా వుండి అర్థం చేసుకోవడం కష్టంగా తోచింది. అప్పటికి మా యింట్లో రెండు రకాల భగవద్గీతలున్నాయి. ఒకటి గౌడియా మఠం వాళ్లది. ఇంకొకటి కాశీనాథుని నాగేశ్వరరావు గారిది. శాస్త్రిగారు రాసింది చాలా కఠినంగా వుందని మంగపతి గారితో చెప్తే ఆయన యింకో రెండు భగవద్గీతలు తెచ్చి యిచ్చారు. అప్పుడు మావయ్య నాతో "ఇంట్లో వూరికే కూర్చుంటావు పిచ్చి పుస్తకాలు చదువుతూ, నాతో కొంచెం చెయ్యి కలిపి ఆ వచనాలు సరిగ్గా వున్నాయో లేదో చూడవచ్చు కదా!"అన్నారు. అప్పుడు ఆ నాలుగు పుస్తకాలు తీసుకొని ఏ భాగంలో ఎన్ని శ్లోకాలున్నాయో ఆ శ్లోకాలన్నీ ఏరి గుర్తు పెట్టుకుని ఆ పుస్తకాల్లో ఒక్కొక్కళ్లు రాసిన వచనాలు చదువుకుంటూ సత్యరంగయ్య శాస్త్రిగారు రాసిన వచనం కూడా చదువుకుని ఏ వచనం బాగున్నదో చూసుకుని, అవి విడిగా రాసుకున్నాము. రాసుకున్నవాటిలో నుంచి 108 శ్లోకాలు ఎంచుకుని, క్రమపద్ధతిలో మళ్లీ రాసుకుని ట్యూన్ కంపోజ్ చెయ్యటం మొదలు పెట్టారు. వచనం పర్‌ఫెక్ట్‌గా వుంది యిది కరెక్టు అనుకోవడానికి ఆరు నెలలు పట్టింది. మావయ్య ఆరోగ్యం బాగులేదు. డాక్టర్లు మేడ మీద నుంచి క్రిందకి రాకూడదు - మెట్లు దిగకూడదన్నారు. బ్లడ్ ప్రెషర్ చాలా ఎక్కువగా వుంది. మేం మేడమీద వుండేవాళ్లం. మెట్లు దిగటానికి వీల్లేదు, పాడటానికి వీల్లేదు, కొన్ని రోజులు ఎక్కడికీ వెళ్లటానికి వీల్లేదు అని డాక్టర్లు ఎప్పుడైతే చెప్పారో ఈ భగవద్గీత, ఈ శ్లోకాలన్నీ కంపోజ్ చేసుకున్నారు. వచనాలన్నీ చూసుకుని ముందర ఈ శ్లోకాల పని పట్టాలి. సంస్కృత శ్లోకాలు కదా! ఉచ్చారణ తప్పు పోరాదు. అర్థం చెడిపోకూడదు అని అనుకుంటూ ఆ శ్లోకాలు చాలా సేపు చదువుకుంటూ తప్పులు వస్తాయేమోనని పుస్తకం నన్ను పట్టుకుని చూడమని చిన్నపిల్లలు పాఠాలు అప్పచెప్పినట్టు చెప్పేవారు. అలా చదువుకుంటూ ఆరు నెలల ప్రాక్టీసు చేశారు. ఒంట్లో బాగైన తరువాత మొదటి పాట జీవనతరంగాలు సినిమాలో "ఈ అందానికి బంధం వేశానీనాడు" పాడారు. అది అయిన తరువాత దొరబాబు సినిమాలో కూడా పాడారు. ఈ సినిమాలో పాటల సాహిత్యం ఆయనకి నచ్చలేదు. "సాహిత్యం మారిపోయింది. ఈ పిచ్చిపాటలు పాడకూడదు. ఈ భగవద్గీత చక్కగా వచ్చింది. ఇది పాడుకుంటే బాగుంటుంది. ఇంకా మనకి సినిమా పాటలెందుకు? "లే లే నా రాజా" లాంటి పాటలన్నీ పాడుకోవాలా? కొత్త కుర్రవాళ్లు వస్తున్నారు. బాలసుబ్రహ్మణ్యం, రామకృష్ణ ఆనంద్ వాళ్లు పాడుకుంటారు. ఇంక నేను సినిమా పాటలు పాడను. నాకొద్దు. నేను భగవద్గీత, రామదాసు కీర్తనలు, అష్టపదులు యివన్నీ రికార్డు చేస్తూ కాలక్షేపం చేస్తాను. ఇంక సినిమా పాటలు పాడొద్దు అనుకుంటున్నాను" అన్నారు. భగవద్గీత రికార్డు చేసేటప్పుడు కాషాయ వస్త్రాలు కట్టుకోవాలన్నారు. అందుకు నేను ఒక్క కాషాయ వస్త్రాలు కట్టుకుంటే చాలదు. సన్యాసం కూడా వుండాలి. మంచం మీద పడుకోకూడదు. నేల మీద పడుకోవాలి. అందుకు ఆయన "ఇవన్నీ ఆటోమాటిక్‌గా వస్తాయి. అసలు నేను మనసులో ఎంత సన్యాసినో నీకు తెలీదు. మానసిక సన్యాసం ఎప్పుడో పుచ్చుకున్నాను" అన్నారు.

భగవద్గీత రికార్డింగుకి కాషాయ వస్త్రాలు కావాలన్నారు. నేను యింట్లో వున్న పంచలజత తీసుకుని వెళ్లి కాషాయ రంగు వేయించాను. రికార్డింగుకి కట్టుకు వెళ్లారు. అందులో ఒక పంచ ఆయనకి చాలా నచ్చింది. రేపు కూడా రికార్డింగు వుంది. ఈ పంచని రేపటికి రెడీ చెయ్యి అన్నారు. అప్పటికప్పుడు దాన్ని ఉతికి ఫాన్ కింద ఆరేసి యిస్త్రీ చేసి యిస్తే కట్టుకుని వెళ్లి రికార్డింగు చేసుకుని వచ్చారు.

భగవద్గీత రికార్డింగ్ అయాక అది ఎలా వచ్చిందా అన్న ఆలోచన. "నాకు యాభై సంవత్సరాలు దాటాయి కదా: భగవద్గీత పాడిన నోటితో సినిమా పాటలు పాడను. మనకున్న సంపద చాలు. మనకన్నా తక్కువ డబ్బున్నవాళ్లు వున్నారు. వాళ్లు బ్రతకటం లేదా? అంతగా మన పిల్లల పెళ్లిళ్లు పేరంటాలు అయ్యేటప్పటికి మన దగ్గర డబ్బు లేకపోతే అప్పుడు గుళ్లో పురాణ కాలక్షేపం చేసుకుని, ఈ భగవద్గీత చెప్పుకుంటూ వాళ్ల ఏదో ప్రసాదం పెడతారు అది తిని కాలక్షేపం చేద్దాం. అంతేకాని భగవద్గీత రెండోభాగం పూర్తయిన తరువాత యింక సినిమా పాటలు పాడను" అన్నారు.

(ఇంకా వుంది)

# పద్మనాభం ఆత్మకథ



## 1

**ప్రతీ మనిషి జీవితంలోను మిట్టపల్లాలుంటాయి; సుఖదుఃఖాలుంటాయి. నా జీవితమూ దానికి మినహాయింపుకాదు. తెరపై నవ్వులు రువ్వినవారందరి జీవితాలూ పువ్వులబాటలు కావని 'రేలంగోడి గోడు' విన్న 'హాసం' పాఠకులకు వేరే చెప్పనక్కరలేదు. నటుడిగానే కాక, నిర్మాతగా, దర్శకుడిగా, అనేకమంది కళాకారులను సినిమారంగానికి పరిచయం చేసినవాడిగా నా జీవితంలో ఎదురైన వివిధరకాలైన అనుభవాలను పాఠకులతో పంచుకుందామనే నా కథకు అక్షరరూపం కల్పిస్తున్నాను.**

నేటితో నాకు 71 ఏళ్లు నిండాయి. ఈ సుదీర్ఘజీవితంలోని సంఘటనలన్నీ ఏకరువు పెట్టి పాఠకులను విసిగించడం నా అభిమతం కాదు. స్థాలీపులాకన్యాయంగా అక్కడక్కడ, అప్పుడప్పుడు జరిగిన వాటిని ప్రస్తావిస్తూ నా కథను కొనసాగిస్తాను. ఎవరి కథయినా బాల్యంతోనే ప్రారంభమవుతుంది కాబట్టి నా కథా అక్కడే ప్రారంభిస్తాను.

నా జననం 1931 ఆగస్టు 20. కడప జిల్లా పులివెందుల తాలూకా సింహాద్రిపురం గ్రామంలో. తండ్రి శ్రీ బసవరాజు వెంకట శేషయ్య, తల్లి



శ్రీమతి తల్లి శ్రీమతి శాంతమ్మ. నేను పుట్టగానే ఓ జ్యోతిష్కుడు జాతకచక్రం వేసి చూసాడు. గురువారం రాత్రి 10 గంటలకు అనూరాధా నక్షత్రం. మేషలగ్నం. వృశ్చికరాశి. 1-5 మాసములు శనిదశ చెల్లు. చూసి "విశ్వవిఖ్యాత పురుషుడు జన్మించాడు" అన్నాడు.

అది విని మా నాన్నగారు ఫక్కున నవ్వారట. "నేను సాధారణమైన కరణాన్ని. నాకు విశ్వవిఖ్యాతుడైన పురుషుడు పుట్టడం ఏమిటి?" అన్నారట. మాది కడప జిల్లా వేంపల్లికి సమీపంలో వున్న వీరన్నగట్టుపల్లెకి కరణీకం. మా తాతగారు సుబ్బయ్యగారు, మా నాన్నగారు కరణాలే.

ఇక మా అమ్మ వైపు బంధువుల విషయానికి వస్తే-

మా అమ్మగారి నాన్నగారు, యరగుజిపాడు గ్రామానికి చెందిన నందర్సు చెన్నయ్య, అమ్మ శ్యామలాంబ. మా అమ్మమ్మ బాలింతరాలుగానే చనిపోయారు. మా తాతగారికి అంటే మాతామహుడికి 100 ఎకరాలు భూమి. మా అమ్మగారి పేరిట 5 ఎకరాలు పసుపు కుంకుమగా ఇచ్చారు. చెన్నకేశవస్వామి ఆలయంలో మా అమ్మా నాన్నల వివాహం అత్యంత వైభవంగా 3 రోజులు చేశారు.

పెళ్లయ్యాక వీరన్నగట్టుపల్లెకు మా అమ్మగారు కాపురానికి వచ్చారు. అమ్మకు పైశాచికమైన పిచ్చి ధోరణిగావుంటే మా అవ్వ సుబ్బమ్మగారు సమీపంలోవున్న శ్రీశ్రీశ్రీ గంజి వీరాంజనేయస్వామి వారికి 40 రోజులు సేవ చేయించారు. దానితో స్వస్థత చేకూరి కొంతకాలానికి నేను మా అమ్మ గర్భంలో ప్రవేశించాను. ఇప్పటికీ నేను గంజి వీరాంజనేయస్వామి వారి ప్రసాదాన్ని అని భావిస్తాను. ఇంతలో నాన్నగారికి సింహాద్రిపురం కరిణీకం వచ్చింది. వీరన్నగట్టుపల్లె నుండి పాపాఘ్ని నది దాటి వెళ్లాలి. ఒంటెద్దు బండి ప్రయాణం. మా అమ్మ చూడబోతే 6 నెలల గర్భిణి. ధైర్యం చేసి అలాగే వెళ్లారు. ఆంజనేయ స్వామి దయవల్ల ఏమీ కాలేదు.

జననం గురించి చెప్పాను కాబట్టి బాల్యం గురించి కొన్ని సంగతులు చెప్తాను. చిన్నప్పటినుండీ నాకు సంగీతం అన్నా, పద్యాలు అన్నా మహా ఇష్టం. పూర్వ జన్మ వాసనయేమో, 3వ యేట నుండి పద్యాలు పాడే ప్రయత్నం చేసేవాణ్ని. మా వూళ్లో రెవిన్యూ ఇన్స్పెక్టరు శ్రీ చెన్నకేశవుల నాయుడు గారికి హిజ్ మాస్టర్స్ వాయిస్ గ్రామఫోను వుండేది. 3 ఏళ్ళ వయస్సు లోనే నేను గ్రామఫోన్ దగ్గరికి పోయి కపిలవాయి రామనాధశాస్త్రిగారి "కోరీ భజింతును గోవిందుని మది నారదముని ముకుందున్" అనేపాటను విని పాడేవాణ్ణి.

ఆతరువాత 5 ఏళ్ల వయసులో వేమూరి గగ్గయ్యగారి శిశుపాలుని పద్యం!

వారిధులన్ గలంతు సురవర్గము త్ర్పళ్ల జగంతు, ఆర్జహిం
ద్రోరు ఫణాగ్రసంస్మిత, మహోగ్రమణిన్ బెకళింతు, లోక కం
ఠీరవనామ కారికుల నిశ్చల తేజములన్ గలంతు కం
సారి అనంగ ఎంత, ప్రళయాంతకుడై మురుమోదకుండునే..."

అని గంభీరంగా నవ్వగానే గ్రామఫోన్‌లోనికి తొంగిచూసి గగ్గయ్యగారు కనపడతాడేమోనని చూసేవాణ్ణి. అప్పుడువున్న సన్నని గొంతుతోనే ఆ పద్యం అలాగే అనుకరించి పాడేవాణ్ణి.

సినిమాలు చూడడమూ నా కిష్టమే! మా ఊరికి మూలా నారాయణస్వామివారి సినిమాటెంటు వచ్చింది. 'ద్రౌపదీ వస్త్రాపహరణం', వాహినీవారి 'వందేమాతరం', 'సుమంగళి', శోభనాచలవారి 'భక్త ప్రహ్లాద' చూసి అందులోని పాటలు పద్యాలు, కామిడీ సీన్లు నేనూ, మా చిన్నన్న సుదర్శనరావు అనుకరించి మా గ్రామస్థులను ఆనందింపచేసేవారం.

సింహాద్రిపురం బోర్డు హైస్కూల్‌లో 1వ తరగతి చదివే రోజుల్లో (1936) ఓ ముచ్చట! బాబు సాహెబ్ మాస్టరు మా గురువుగారు.



'సుమంగళి' చిత్రంలో రేలంగి, గిరిజలతో

"చింతామణి" నాటకంలో శ్రీకృష్ణుడు వేషం నాకిచ్చారు. కొండపేట కమాతా చింతామణి పాత్ర, మానాన్న శేషయ్యగారు శ్రీహరి పాత్ర వేస్తున్నారు, నేను బాలకృష్ణుణ్ణి. వేషం వేసుకొని మా అమ్మ ఒళ్ళో నిద్రపోతున్నాను. తెల్లవారు ఝామున 4 గంటల వరకూ నా పాత్ర రాదు. క్లయిమాక్సులో నేను రంగస్థలంపై ప్రవేశించి చింతామణికి హితబోధ చేసి, సానివృత్తిమాని సన్యాసాన్ని స్వీకరించి నాలో ఐక్యం కమ్మని చెప్పాలి. నా పాత్ర లేకపోతే క్లయిమాక్సే లేదు. ఆ టైము వచ్చేసరికి బాబుసాహెబ్ మాష్టరు వచ్చి చూస్తే నేను గాఢంగా నిద్రపోతున్నాను. లేపమన్నారు. మా అమ్మ ప్రయత్నించినా, ఎవరు ప్రయత్నించినా నేను లేవలేదు. ఎంతలేపినా నేను లేవకపోవడంతో మాస్టారే కలగజేసుకోవలసివచ్చింది. నా చెవ్వి మెలిపి 'బేటా లే' అని ఒక్కమాట అనగానే అంత గాఢనిద్రలోనూ ఉలిక్కిపడి లేచాను. ఆయనంటే నాకు భలే భయం.

'బేటా, లే, నీ పోర్షన్ వచ్చింది' అనగానే ఇంకోసారి వులిక్కిపడి వెంటనే స్టేజిమీదకు పరుగుపెట్టి కంఠతా పట్టిన పాట లంకించుకున్నాను.

నా మహిమ తెలియగలరా
నా లీలలు గనగలరా,
నాధాటికోర్వగలరా,
జగముల నెల్లను ఏలెడి వాడను,
భక్తి, జ్ఞాన వైరాగ్యము కలిగి నాలో ఐక్యము కారా...

అని పాడగానే చింతామణి మాట ఎలాగున్నా మా వూరి ప్రజలు వన్సుమోర్ అని చప్పట్లు కొట్టారు. ఈ వన్సుమోర్లు అప్పట్లో మనకు తెలియవుగా. పోర్షన్ అయిపోయింది, వెళ్లి నిద్ర కంటిన్యూ చేయవచ్చు అనుకుని వింగ్స్‌లో మా అమ్మ దగ్గరికి పరిగెట్టుకుని వచ్చేస్తుంటే మళ్లీ మేష్టారు ఆపేరు. "బేటా, మళ్లీ పాడమంటున్నార్రా, వెళ్లి మళ్లీ పాడు." అని ఉరిమారు. మనకి వచ్చిన పాటేగా, ఇంకోసారి పాడాను. ఓ చిన్న వెండికప్పు ప్రజెంటేషన్ వచ్చింది.

శ్రీకృష్ణపరమాత్ముని ఆశీర్వాదంతో అలా నా రంగస్థల ప్రవేశం వన్స్‌మోర్‌లతో ప్రారంభమయింది!

పరమాత్ముని దయ రంగస్థలానికే పరిమితమయింది కాబోసు, చదువులో మాత్రం ఆయన దయ లేదు. 5వ తరగతిలో నా మార్కులు చెప్పమంటారా? - తెలుగు 5, చరిత్ర 1, లెక్కలు 0, తోటపని 2. అంటే తోటపని కూడా అంతంతమాత్రం గానే ఉందన్నమాట! (ఫెయిలయ్యానని వేరే చెప్పాలా?) ఈ సంగతి మా మాస్టర్లు ఎప్పుడో గ్రహించినట్టున్నారు. 5 వ తరగతి ఫెయిలు కాగానే కాజామొహద్దీన్ మాస్టరుగారు ఓ రోజు మా ఇంటికి వచ్చి మా అమ్మానాన్నలకు శుబ్బరంగా చెప్పేశారు. - "మేం ఎంత తంటాలు పడినా మీ అబ్బాయికి చదువురాదు. పాటలు, పద్యాలు, అల్లరి అంటారా, మేం చెప్పకుండానే వచ్చేస్తాయి. వాటికి మార్కులు వేయం గానీ వేస్తే. పాటలు పాడడంలో 100మార్కులు, పరిగెట్టడంలో 100 మార్కులు, అల్లరిలో అయితే ఏకంగా 1000 మార్కులు వస్తాయి. ఈ చదువుగోల వదిలేసి మీ వాణ్ని నాటకాల్లోనో, సినిమాల్లోనో చేర్పించండి" అని సలహా యిచ్చారు.

(ఇంకా వుంది)

(ఫొటో కర్టెసీ: సంజయ్ కిషోర్)

## 'పాండవ వనవాసం' సినిమాలో పద్మనాభం నటించిన ఓ హాస్య సన్నివేశం, అభినయించిన గీతం.

1. లక్ష్మణ కుమారుడు : పద్మనాభం
2. అండం : సీతారామ్
3. పిండం : అల్లురామలింగయ్య
4. బ్రహ్మాండం : రమణారెడ్డి
5. శశిరేఖ (మాయా) : ఎల్. విజయలక్ష్మి

అండం, పిండం, బ్రహ్మాండంలు వెన్నంటిరాగా లక్ష్మణకుమారుడు విలాసంగా ఉద్యానవనంలో అడుగుపెడతాడు.



లక్ష్మణ: పిండం... పళ్ళు (చేతిలో గల పళ్ళెం నుండి ఒక పండు అందిస్తాడు పిండం)
అండం... గంధం... (గంధం అందిస్తాడు అండం)
(బ్రహ్మాండంవైపు తిరిగి) ఎలా వుంది మన శృంగార శోభ!?



బ్రహ్మాండం: బ్రహ్మాండం... బ్రహ్మాండం

లక్ష్మణ: హ హ హ

బ్రహ్మాండం: రాకుమారా... ఇక మీకు తిరుగులేదు. ఈసారి శశిరేఖ కనిపించగానే ఒక పట్టు పట్టండి... శృంగారపట్టు

లక్ష్మణ: ఓ... (అలాగే అన్నట్టు ఏదో గుర్తొచ్చినట్టు, నాలిక కరుచుకున్నాడు)
బ్రహ్మాండం... పట్టు పట్టాలనే వుంటుంది... కానీ తీరా ఆమె రాగానే కాళ్ళు వణికిపోయి గొంతారిపోయి, గుండాగి పోతుంది కదా...!?



బ్రహ్మాండం: ఇప్పుడేం భయం రాకుమారా...? ఇదివరకంటే ఆ అభిమన్యుడు ఎప్పుడు వచ్చి ఏ అఘాయిత్యం చేస్తాడో అని వుండేది... ఇప్పుడు వాడు...



లక్ష్మణ: ...కుక్కిన పేను
(అందరూ నవ్వారు)
(ఇంతలో మాయాశశిరేఖ వస్తుంది)

మాయాశశి: బావా...

లక్ష్మణ: ఆమె గొంతు వినగానే... బ్రహ్మాండం... నా కాళ్ళెందుకు అలా వణుకుతున్నాయ్

బ్రహ్మాండం: (తనలో) సరిపోయింది... (నచ్చచెపుతున్నట్టు) అది కొందరికి శృంగార చేష్ట

లక్ష్మణ: ఓ... అదా

బ్రహ్మాండం: రాకుమారా మీరు మాత్రం ధైర్యంగా వుండాలి (అంటూ... అండం, పిండంలతో తప్పుకొని చెట్టుచాటుకి వెళతారు)



మాయాశశి: బావా... బావా... మాట్లాడవేం బావా



లక్ష్మణ: (మాట్లాడాలని ప్రయత్నిస్తాడు... నోట్లోంచి శబ్దం వస్తుంది కానీ అక్షరం రాదు)

మాయాశశి: అయితే నేను వెళ్ళిపోతున్నాను

లక్ష్మణ: (కొంచెం ధైర్యం పుంజుకుని) శశీ...



మాయాశశి: బావా

లక్ష్మణ: (ఇంకొంచెం నిబ్బరంగ) సెసీ...

మాయాశశి: బావా...

లక్ష్మణ: (ధీమాగా) శశీయ్

శశి: పో... బావా (నవ్వుతూ పక్కకి తొలగుతుంది)



లక్ష్మణ: (చూశావా మన తడాఖా అన్నట్టు చాటున వున్న అండం, పిండం, బ్రహ్మాండంలని చూస్తూ) ఏయ్... (అంటూ అరుస్తాడు)

(ఆ తరువాత పాట ఇలా సాగుతుంది)

రచన: ఆరుద్ర     పాడినది: సుశీల, పద్మనాభం

ఆ: బావాబావా పన్నీరు
బావకు మరదలు బంగారు
బాజాలు మోగందె బాకాలు ఊదందె
ఎందుకు కంగారు
అ: అయ్యో! అబ్బ! అమ్మ!
ఆ: చిలిపి చేష్టలతో వలపెకోరునట
ముద్దూ తీర్చమని సద్దుచేయునట
మరులుకొనే బాల తను మనసుపడే వేళ
ఉలికిపడి ఉనికిచెడి ఉక్కిరి బిక్కిరి అవుతాడంట
ఓబావా! బావా!
అ: మరదలా!
ఆ: బావా బావా పన్నీరు బావకు మరదలు బంగారు
పరుగులు తీసే ఉరకలు వేసే బావను ఆపేరు
సుందరాంగుడట గ్రంధసాంగుడట
ఏడు మల్లియల ఎత్తుతూగునట
కలికికొనగోట ఆ చెంప ఇలామీట
అబలవలె అదిరిపడి లబోదిబో అంటాడంట!
ఓ బావా!
అ: మరదలా!
ఆ: బావాబావా పన్నీరు బావకు మరదలు బంగారు
వలపులలోనా జలకములాడ బావను తిప్పేరు
వలపులలోన జలకములాడ బావను ముంచేరు



స్పేస్ సైంటిస్టు, పారిశ్రామికవేత్త, సంగీత, సాహిత్యాభిమాని

## డా॥ పావులూరి సుబ్బారావు గారికి

# అభినందన చందనాలు

చిన్నతరహా పరిశ్రమల అంత్రప్రనార్‌గా జాతీయ బహుమతి
గెల్చుకున్న సందర్భంగా...



కేంద్ర ఆర్థికమంత్రి శ్రీ జస్వంత్‌సింగ్ చేతులమీదుగా ఆగస్టు 28, 2002న
2000 సం॥పు National Award for SSI Entrepreneurs అందుకున్న
**డా॥ పావులూరి సుబ్బారావు** గారికి

అభినందనలతో

**శ్రీ కె.ఐ. వరప్రసాద్‌రెడ్డి**
(శాంతా బయోటెక్నిక్స్ ప్రై.లి., హైదరాబాద్)

**అనంత్ టెక్నాలజీస్, హైదరాబాద్ స్టాఫ్**

**హాసం సంపాదకవర్గం, స్టాఫ్**



# ఆ మధురం పాట

రాజా

చలన చిత్ర నిర్మాణ రంగంలో ఎన్.ఎ.టి. సంస్థలకి గల స్థానం ప్రత్యేకం. పిచ్చి పుల్లయ్య, తోడుదొంగలు, ఉమ్మడి కుటుంబం, వరకట్నం, కోడలు దిద్దిన కాపురం, తల్లా - పెళ్ళామా, తాతమ్మకల వంటి సామాజిక స్పృహ కలిగిన సాంఘిక చిత్రాలు, సీతారామకళ్యాణం, శ్రీ కృష్ణ పాండవీయం, దానవీరశూరకర్ణ, శ్రీమద్విరాట పర్వం, బ్రహ్మర్షి విశ్వామిత్ర వంటి పౌరాణిక చిత్రాలు, చాణక్య - చంద్రగుప్త, సామ్రాట్ అశోక్, అక్బర్ సలీం అనార్కలీ, పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామి చరిత్ర, శ్రీనాథ కవి సార్వభౌముడు వంటి చారిత్రాత్మక చిత్రాలు, పాండురంగ మహాత్మ్యం వంటి భక్తిరస చిత్రం, జయసింహ, గులేబకావళికథ వంటి జానపద చిత్రాలు... ఇలా ఉన్నత ప్రమాణాలు కలిగిన చిత్రాలను నిర్మించిన సంస్థగా (మధ్యలో బ్యానర్ పేరులో స్వల్ప మార్పులు సంభవించినా) అందరికీ తెలుసు. ఒక సంస్థ వైవిధ్యంతో కూడిన ఇన్ని రంగాలను స్పృశిస్తూ చిత్ర నిర్మాణం కావించడం ఒక విశేషం అయితే ఆ అభిరుచికి కారణం ఎన్.టి.ఆర్. ,ఆయన సోదరుడు త్రివిక్రమరావు. ఇద్దరూ సంగీత సాహిత్యాల పట్ల స్పష్టమైన అవగాహన ఉన్న వ్యక్తులు కావడం వల్ల ఆ సంస్థ నుంచి వచ్చిన చిత్రాల గీతాలలో కూడా ఒక ప్రామాణికత తొంగిచూస్తూ ఉండేది. 1955లో ఎన్.ఎ.టి. బ్యానర్‌పై వచ్చిన

## జయసింహ

చిత్రంలోని పాటలు ఎంతగానో ప్రజాదరణ పొందాయి. అప్పట్లో ఆ సంస్థకు ఎక్కువగా సీనియర్ సముద్రాల రచన సాగించేవారు. టి.వి.రాజు సంగీతాన్నిచ్చేవారు. ఈ చిత్రానికి సముద్రాల జూనియర్ మాటలు, పాటలూ రాశారు. టి.వి.రాజు, సముద్రాల జూనియర్ కాంబినేషన్‌తో ఆ నందమూరి సోదరులు ప్రేక్షక శ్రోతల హృదయాలలో ఆనందమూరిన విధంగా చేయించుకున్న గీతాలివి.

అరెరెరెరెరె వినండిబాబూ యిదేనండి లోకం తీరూ
ఈ జనంపోకడా యిదేనండీ
అరె నిసగమపా లోకం మోసం పామగరిసా ॥2॥
మోసం మోసం అంటారంతా ॥2॥
మోసం చెయ్యని దెవ్వరంటా ॥నిస॥
ఆయాసమంతా గ్రాసంకోసం
లోకం పలువేషం ఈ లోకం పలువేషం
జగమంతా బల్ మోసం ॥అరె నిస॥
మోసాలు చేసి మోక్షం కోరి
యిచ్చే టెంకాయా దేవుడికిచ్చే టెంకాయా! ॥అరె నిస॥
అడుక్కుతినటం మరిగినవాళ్ళ
కాళ్ళు, కళ్ళూ, కీళ్ళూ, మోకాళ్ళూ, కళ్ళూ, కీళ్ళూ!
వ్యాపారి వాడే తరాసుముల్లూ
తక్కెడలో రాళ్ళూ అరె అంతా మోసంరా
జగమంతా వేషంరా ॥అరె నిస॥







ఈ పాటను పిఠాపురం నాగేశ్వరరావు పాడగా, రేలంగి అభినయించారు. 1950 లో 'సబక్' అనే ఒక హిందీ చిత్రం వచ్చింది. ఈ చిత్రానికి సంగీతం అల్లారఖా ఖురేషీ. ఈయన సంగీత దర్శకత్వంలో జి.యమ్.తుర్రానీ పాడిన 'అరె నిసగమపా...హయ్‌రామ్‌జీ పామాగారిస' అనే పాట బాగా పాప్యులర్ అయింది అప్పట్లో. ఆ పాట పల్లవినే ప్రేరణగా తీసుకుని ఈ పాటను చేశారు. తెలుగు పాటలో కొన్ని లైన్లు రాసుకుని తర్వాత తొలగించారేమోనని అనిపిస్తుంది. అవి సినిమాలోనూ, ఆడియోలోనూ లేవు. పాటల పుస్తకంలో మాత్రం ఉన్నాయి. కేవలం ఇన్ఫర్మేషన్ కోసం మాత్రమే ఉదహరిస్తున్న ఆ వాక్యాలు ఇవే: వీభూది రేఖల గడ్డం మీసం / అంతా పై వేషం -జగమంతా బల్‌మోసం /

పూజారి చెక్కా-భక్తుడు ముక్కా/ బుట్టలో వేసేస్తె - పాపం దేవుడు పస్తేగా/

జయ జయ శ్రీరామా రఘువరా
శుభకర శ్రీరామా! ॥జయ॥
త్రిభువన జన నయనాభిరామా (2) ॥జయ॥
తారకనామా...
తారకనామా... దశరథరామా ॥తారక॥
దనుజవిరామా పట్టాభిరామా (2) ॥జయ॥
రామా రఘుకుల జలనిధిసోమా (2)
భూమిసుతా కామా ॥రామా॥
కామిత దాయక కరుణాధామా (2)
కోమలనీల సరోజ శ్యామా(2) ॥జయ జయ॥



అరభి రాగంలోని జీవ స్వరాలన్నింటినీ అందిపుచ్చుకుని వీనుల విందుగా తయారైన 'జయజయ శ్రీరామా'పాట ఆ రోజుల్లో ప్రతి రామమందిరంలోనూ విరామం లేకుండా మారుమ్రోగిపోయేది. ఆ పాట కంఠోపాఠంగా రాని భక్తులు, ఘంటసాల అభిమానులు దాదాపుగా అరుదనే చెప్పాలి. ఘంటసాల తన గానామృతంతో అజరామరం చేసిన ఈ గీతాన్ని గుమ్మడి అభినయించారు. ఎన్.టి.ఆర్.,రేలంగి, అంజలి సన్నివేశప్రాధాన్యంగా కనిపిస్తారు. ఈ పాటను బాగా సాధనచేస్తే ఆరభిరాగంపై కొంతపట్టు దొరుకుతుంది.

ఆ: ఈనాటి యీ హాయీ
కలకాదోయి నిజమోయి! ॥ఈనాటి॥
నీ ఊహతోనే పులకించిపోయే
ఈ మేను నీదోయీ! ॥నీ ఊహ॥
నీ కోసమే యీ అడియాసలన్నీ
నా ధ్యాస, నా ఆశ నీవే సఖా ॥ఈనాటి॥
అ: ఏనోము ఫలమో ఏనోటి వరమో
యీ ప్రేమ జవరాలా? ॥ ఏ నోము॥
మనియేములే యిక విరితావి లీల
మన ప్రేమ కెదురేది లేదే సఖీ ॥ఈనాటి॥
ఆ: ఊగేములే తుల తూగేములే యిక
తొలిప్రేమ భోగాలా! అ: ॥ఊగేములే॥
ఇ: మురిపాల తేలే మన జీవితాలూ ॥2॥
దరహాస లీలా విలాసాలులే ॥ఈనాటి॥



మోహన రాగంలోని సమ్మోహన శక్తులన్నింటినీ పొందు పరుచుకున్న పసందైన గీతం ఇది. స్వరకర్త సృష్టించిన మాధుర్యాన్ని అందజేయటంలో ఘంటసాల,లీల సరియైన సంధానకర్తలుగా వినబడతారు. ఇక ఎన్.టి.ఆర్, అంజలీదేవి అభినయించిన 'ఈనాటి ఈ హాయి' పాట విషయానికి వస్తే ఓ తమాషా సంఘటన చెప్పాలి. నందమూరి సోదరులు మ్యూజిక్ సిట్టింగ్‌కి వస్తున్నారనగానే వారితో సన్నిహితంగా ఉండే టి.వి.రాజు గారిక్కూడా టెన్షన్‌గా వుండేది ఆయన బృందంతో సహా. 1968లో 'పాలమనుసులు' చిత్రం ద్వారా పరిచయమై తర్వాత్తర్వాత సంగీత దర్శకుడిగా ఎంతో పేరు సంపాదించుకున్న సత్యం అప్పట్లో ఆ బృందంలో ఉండేవారు. ఢోలక్ వాయించే వారు కనుక 'ఢోలక్ సత్యం' అనేవారాయన్ని. హిందీ సినిమా పాటలంటే చెవికోసుకునే సత్యం మంచి పాటలున్న హిందీ సినిమా విడుదలయిందని తెలిస్తే రాత్రి అందరూ పడుకున్న తర్వాత ఎవరికీ తెలియకుండా వెళ్ళి సెకెండ్‌షో చూసేసి

బస్సులు అవీ లేకపోతే కాలినడకన వచ్చేసి, తిరిగి బుద్ధిమంతుడిలా పడుకుండి పోయేవారు ఆ బృందంలో.

ఆ రోజు 'ఈనాటి ఈ హాయి' పాటకి సంబంధించిన ట్యూన్ నందమూరి సోదరులకు వినిపించితీరాలి. ఏవేవో తయారుచేశారుగానీ ఎవరికీ తృప్తిగా లేదు. 1953 ప్రాంతంలో దిల్-ఎ-నాదాన్ అనే హిందీ చిత్రం విడుదలయింది. గులామ్ మహమ్మద్ ఆ చిత్రానికి సంగీత దర్శకుడు. ఆయన స్వరపరచగా తలత్ మహమ్మద్ పాడిన ఓ పాట తలత్ స్వర్ణోత్సవ విజయగీతాల్లో ఒకటిగా నిలిచిపోయింది. ఆ పాట పల్లవి ఇలా ఉంటుంది

**జిందగీ దేనే వాలీ సున్ - తెరి దునియాసే దిల్ భర్‌గయా - మై యహా జీతెహీ మర్‌గయా - జిందగీ దేనే వాలీసున్**

ఈ పాటని వినిపించి 'ఇలా చేద్దామా?' అని అడిగారు సత్యం. 'వాళ్ళు కనిపెట్టలేరనుకున్నావా... చంపేస్తారు జాగ్రత్త' అని హెచ్చరించారు టి.వి.రాజు. 'అది కాదండీ చిన్న గమ్మత్తు చేస్తా వినండి' అంటూ 'జిందగీ దేనే వాలీసున్' పాటలోని రెండోలైన్ అయిన 'తేరీ దునియాసే దిల్ భర్‌గయా'కి గల ట్యూన్‌ని 'ఈనాటి ఈ హాయి' పాటకి మొదటిలైన్‌గా తీసుకుని మోహన రాగాన్ని ఆలపించుకుంటూ 'కలకాదోయి నిజమోయి' అనే లైన్‌ని పూర్తి చేశారు సత్యం. వెంటనే పాట పూర్తి స్వరూపం టి.వి.రాజుగారికి సాక్షాత్కరించేసింది. ఇంటర్ లూడ్స్ (చరణాల మధ్య వచ్చే వాద్య సంగీతం)తో సహా చరణాల ట్యూన్‌ను సిద్ధం చేసేశారాయన. మొత్తం పాట చకచకా తయారయిపోయింది. ఫస్ట్ హియరింగ్‌లోనే ఓకే చేసేశారు నందమూరి సోదరులు. ఎంత భయపడ్డారో అంత సుఖంగా, విజయవంతంగా ఆ సిట్టింగ్ ముగిసినందుకు 'ఈనాటి ఈ హాయి కలకాదోయి నిజమోయి' అని పాడుకున్నారట ఆరోజు.





మనసైనా చెలీ పిలుపూ (2)
వినరావేల ఓ చందమామా ॥మనసైన॥
పిలిచీ నిన్నే నే వలచాననా
బిగిసేరూ మగవారలూ ॥పిలిచి॥
తలచేరులే చెలి నిను చౌకగా
వలచేసే ననూ జాబిలీ
అదో నవ్వేను ననుచూచి ॥అదో॥
నను కవ్వించి ఆడేను దోబూచి ॥అదో॥
లేనవ్వుల తొలి లాలింతురే
తుది కన్నీట తేలింతురే ॥లే నవ్వుల॥
నమ్మేదెలా మనసమ్మేదెలా
మనసేనాడో ఆ రాజు సొమ్మాయెనే ॥మన॥





ఈ పాటను రావు బాలసరస్వతి, ఎ.పి.కోమల పాడగా తెరపై వహీదా రెహమాన్, సీత అభినయించారు. కొన్ని పాటలు తరాలు గడిచిన తరువాత-తొలి రోజులలో ఇచ్చిన అనుభూతిని ఇవ్వలేవు. కానీ పాట అలా కాదు, ఇవాళ్టికీ అదే ఫ్రెష్‌నెస్ ఫీలవుతాం. మరొక విషయం ఏమిటంటే 1951లో వచ్చిన 'ఢోలక్' చిత్రంకోసం శ్యామ్‌సుందర్ సంగీత దర్శకత్వంలో మధుబాలఝవేరీ పాడిన 'చోరీచోరీ ఆగ్‌సే దిల్‌మే లగాకర్ జల్‌దిమే' అనే పాట యొక్క నడక-'మనసైనా చెలీ పిలుపు' పాటకు ప్రేరణ అయిఉండవచ్చునని కొందరు పరిశీలకుల అభిప్రాయం. 'బ్రతుకు తెరువు' సినిమాలోని 'అందమే ఆనందం' పాటలోని 'ఆనందమే జీవిత మకరందం' అనే రెండవలైన్ యొక్క టేకాఫ్ నోట్స్, ల్యాండింగ్ నోట్స్ ఈ పాట రెండవలైన్ అయిన 'వినరావేల ఓ చందమామ'లా ఉన్నాయని మరికొందరి అభిప్రాయం.




ఆ: మదిలోని మధురభావం
పలికేను మోహనరాగం ॥మది॥
అ: ప్రవహింపవే నా రావం ॥ప్రవ॥
వివరించు ప్రేమ సరాగం ॥మది॥
ఆ: అరుణసంధ్యా కిరణాలలోన
తరుణపవనాల గిలిగింతలోన!
మురిసె నాలోన మోహాల తలపు (2)
విరిసె మురిపాల కలలేవోమరి ॥మది॥
అ: కలలదేలే మాధుర్యలీలా
వెలుగులే యిక మన జీవితాలూ!
కలసి రవళించు హృదయాన పాట(2)
వలపు పయనాల విరిబాట చెలి॥మది॥
నేపథ్యం:
మింటిపైనా వెలుగారిపోయె
కంటికీలోకమె చీకటాయె
బ్రతుకు నులివేడి కన్నీరయేనా...
ఆశలన్నీ అడియాసలేనా....




ఈ పాటను ఘంటసాల, రావు బాలసరస్వతి దేవి పాడగా ఎన్.టి.ఆర్, వహీదా రెహమాన్ అభినయించారు. ఈ పాటలోని రెండు చరణాలకు కొనసాగింపులా అంజలీదేవి అభినయించగా 'మింటిపైనా వెలుగారిపోయే' అనే మరొక చరణం కూడా వస్తుంది. ఆ చరణం హెచ్.ఎం.వి వారు విడుదలచేసిన ఆడియోక్యాసెట్‌లో లేదు. ఈ మూడు చరణాలు ప్రధానంగా మోహనరాగం పైనే ఆధారపడి ఉంటాయి. ఓ వైపు అందర్నీ ఆకర్షించగలిగే 'ఈ నాటి ఈ హాయి' లాంటి పాటకు మోహనరాగాన్ని పూర్తిగా వాడుకుంటూ అభిరుచివున్న కొంతమందికి మాత్రమే రుచించగలిగే ఈ 'మదిలోని మధురభావం' లాంటి పాటకి కూడా మోహనరాగాన్ని ఉపయోగించటం, అందులోనూ...ఆనంద విషాదాలు రెండూ ప్రతిఫలించేట్టుగా ఇవన్నీ టి.వి.రాజు గారిపై గల గౌరవాన్ని రెట్టింపుచేస్తాయి.

నడిరేయి గడిచేనే చెలియా
రాడాయెనే సామి నాసామి
రాడాయెనేసామి నేడూ ॥నడి॥
ఎదురూ తెన్నులూ చూచిచూచి
ఓ చెలియా వానికై వేచివేచి నేడూ ॥నడి॥
గగనాన నెలరేడు దిగజారిపోయె
సిగలోని విరులన్ని వసివాడిపోయె!
దిగులాయెనే...(2) మది వగలే మిగులాయే
మగరాయడే వాడు మనలేనో నేడూ ॥నడి॥
గడపా పడిగాపు పడియుండలేనే!
గడియొక్క యుగముగ గడుపగ లేనే! ॥గడపా॥
ఎడబాటుతో...ఎడబాటుతో
గమరిస రిసనిసదప గమరిగమ ఎడబాటుతో
సా సా పనిద సా సా మనిదప రిగమద మనిదపా
పనిదస నిరీస్సనిదస్సానిదపనీదపమ ఎడబాటుతో
సా...నీ...దా...సానీ సనిదపమ
నీ...దా...పా...నీద నిదపమగ
మాపమగమగమ పాదప మపమస
దానిద పద పద నినిసని ససనిద పపదపమప
ఎడబాటుతో యీ సడిలేని రేయి
కడలేని కన్నీరై నిలువగలేనే ॥నడి॥



సుశీల పాడిన ఈ జావళికి తోడయిన వహీదా రెహమాన్ నృత్యాభినయాన్ని ఈనాటికీ మరిచిపోని వారున్నారు. ఆ రోజుల్లో స్కూళ్ళల్లో, కాలేజీల్లో ఏదైనా శాస్త్రీయ నృత్యంలా అభినయించాల్సి వస్తే ఈ పాటను సాధనచేసి ప్రదర్శించిన సంఘటనలు కూడా కొన్ని కొన్ని కుటుంబాలలో ఉన్నాయి. అంతటి ఆదరణకు,గౌరవానికి నోచుకున్న ఈ జావళిని బేగడ రాగంలో స్వర పరిచారు. బేగడ రాగంలో సినిమా పాటలేమున్నాయని ప్రశ్నించుకుంటే ఇవాళ్టికీ సమాధానం కోసం చాలా కష్టపడాల్సిన పరిస్థితే ఉంది. కొంత మందైతే 'లవ-కుశ' చిత్రంలో ఘంటసాల స్వరపరిచి గానం చేసిన 'ఇదె మన ఆశ్రమంబు' అనే పద్యాన్ని మాత్రమే ఉదహరిస్తారు గానీ ఎందుకో ఈ జావళిని గుర్తు చేసుకోరు.

ఓ-కొండమీద కొక్కిరాయి
కాలు జారి కూలిపోయే ॥ఓ...కొండ॥
టక్కరి నక్క నక్కింది పక్క
ఎక్కడి దొంగలక్కడే గప్ చుప్ చుప్! ॥టక్కరి॥
ఏ కాడ నీ వున్నా నీ నీడనేవున్నా!
చిక్కేవు చేతిలో
చిక్కేమీ లేదులే గప్ చుప్‌చుప్ ॥కొండ॥
వేసెయ్యి యేసమూ చేసెయ్యి మోసమూ(2)
మోసగాడే మొనగాడూ, గప్ చుప్ చుప్ ॥కొండ॥
ఆకలి వేస్తే రోకలి మింగూ
ఏ పాటు కూటికేనులే గప్ చుప్ చుప్
మేకలు కావ్ కావ్ కావ్ కాకులు మే మే మే
లోకులు కాకులు
తోకలేని మేకలు గప్ చుప్ చుప్ చుప్ ॥కొండ॥



ఈ పాటను అంజలీదేవి పిచ్చిదానిలా నటిస్తూ నృత్యం చేస్తూ పాడే సన్నివేశంలో ప్రధానంగా ఎన్టీ రామారావు, ఉపపాత్రధారుల్లో ముఖ్యంగా పద్మనాభం, బాలకృష్ణ కనిపిస్తారు. కేవలం సరదాగా వినడానికి మాత్రమే పనికొచ్చే ఈ పాటను ఎ.పి.కోమల పాడినట్టుగా హెచ్.ఎం.వి. వారు విడుదల చేసిన క్యాసెట్‌లో (నం.ఎస్.ఎఫ్.హెచ్.ఒ.848261) ఉంది. పాటల పుస్తకంలో సుశీల పాడినట్టుగా ఉంది. అప్పుడు రిలీజయిన 78 ఆర్.పి.ఎం. రికార్డుల మీద 'దేవదాసు' ఫేమ్ కె.రాణి పాడినట్టుగా ఉంది. జాగ్రత్తగా వింటే కె.రాణి పాడినట్టుగానే అనిపిస్తుంది.




## టెక్నీషియన్స్

| | |
|---|---|
| ప్రొడ్యూసరు | : ఎన్. త్రివిక్రమరావు |
| డైరెక్టరు | : డి. యోగానంద్ |
| ఫొటోగ్రఫీ | : ఎం.ఎ. రహమాన్ |
| పాటలు, మాటలు | : సముద్రాల (జూనియర్) |
| సంగీతం | : టి.వి. రాజు |
| కళ | : తోట |
| నృత్యం | : వెంపటి సత్యం |
| స్టంటు | : స్టంటు మాస్టర్ సోము |
| ఎడిటింగ్ | : జి.డి. జోషి |
| ప్రొడక్షన్ | : ఎ. పుండరీ కాక్షయ్య |
| స్టూడియో | : వాహిని |

ఎన్.ఎ.టి. విడుదల

## నటీ - నటులు

| | |
|---|---|
| అంజలీదేవి | : కాళింది |
| యన్.టి.రామారావు | : జయసింహ |
| యస్.వి.రంగారావు | : రుద్రసింహ |
| రేలంగి | : బుద్ధిమతి |
| గుమ్మడి | : రణధీర్ |
| కాంతారావు | : విజయసింహ |
| రాజనాల | : మహావీర్ |
| కె.వి.యన్. శర్మ | : చండసేన |
| డా॥ కామరాజు | :రఘువీర మహారాజు |
| వంగర | : మంత్రి |
| ఋష్యేంద్రమణి | : దుర్గాదేవి |
| వహీదా | : పద్మిని |
| సీత | : చెలికత్తె |

మహంకాళి, బాలకృష్ణ, పద్మనాభం, లక్ష్మయ్య చౌదరి, మద్దాలి, దుర్గారావు, వసంతకుమార్




## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్గంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి **బాలూ** గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.

1. గ్రాసం (జయసింహ - వినండి బాబూ)
   ఎ) జీవితం బి) ఆహారము
   సి) ఊరు డి) గడ్డి
2. తరాసు (జయసింహ - వినండి బాబూ)
   ఎ) కిరీటం బి) రాజు
   సి) గల్లాపెట్టి డి) త్రాసు
3. దనుజ విరామ (జయసింహ -జయజయ)
   ఎ) శరీరముతో విశ్రమించువాడు
   బి) శరీరముతో పుట్టినవాడు
   సి) రాక్షసులను సమాప్తి చేయువాడు
   డి) సోదరుని ఇష్టపడువాడు
4. మనియేము (జయసింహ-ఈనాటి ఈ హాయి)
   ఎ) కలుస్తాము బి) పెండ్లాడతాము
   సి) ఉంటాము డి) ప్రేమిస్తాము
5. రవళించు (జయసింహ - మదిలోని)
   ఎ) నిద్రించు బి) ధ్వనించు
   సి) వర్ధిల్లు డి) ప్రవహించు
6. వసివాడు (జయసింహ-నడిరేయి)
   ఎ) రాలిపోవు బి) జారిపోవు
   సి) నలిగిపోవు డి) బాగావాడిపోవు
7. దరహాసము (జయసింహ - ఈనాటి ఈ హాయి)
   ఎ) చిరునవ్వు బి) విలువైన నవ్వు
   సి) భార్య నవ్వు డి) సిగ్గుతో నవ్వు
8. కుసుమము (శ్రీదేవి-రాశాను ప్రేమ లేఖలెన్నో)
   ఎ) ఎరుపు బి) తెలుపు
   సి) పువ్వు డి) పరిమళం
9. పయ్యెద (శ్రీదేవి-రాశాను ప్రేమలెఖలెన్నో)
   ఎ) కాలిమువ్వ బి) జడగంట
   సి) పైట డి) చెవిజూకా
10. అంబుజనాభుడు (చక్రధారి - విరలా విరలా)
   ఎ) బ్రహ్మ
   బి) పువ్వులు బాణముగా కలవాడు
   సి) నీటిలో పుట్టిన వాడు
   డి) విష్ణువు

### జవాబులు

1) b 2) d 3) C
4) C 5) b 6) d
7) a 8) C 9) C
10) d




## సెప్టెంబరు 20 అక్కినేని నాగేశ్వరరావు జన్మదిన సందర్భంగా....

ఇది వరకు సినిమాలు తీయడంతో పాటు వెండితెర నవలలు కూడా ప్రచురించే ఆనవాయితీ ఉండేది. వెండితెర నవల ప్రక్రియ రమణగారితో మొదలవలేదు కానీ, వాటికి రమణ ఓ గ్లామర్ తెచ్చిపెట్టేరన్నది, ఒక ఒరవడి పెట్టారన్నది పరమసత్యం. ఆయన తర్వాత వెండితెర నవలలు రాసిన వాళ్ళు ఆయన వల్ల అంతో ఇంతో ప్రభావితం అయ్యారన్న విషయం కూడా గమనించవచ్చు. ఇంతా చేసి ఆయన రాసినవి మూడు సినిమాలకే -ఆంధ్రపత్రిక నుండి బయటకు వచ్చాక వెలుగునీడలు, తర్వాత భార్యాభర్తలు. ఆ తర్వాత ఇద్దరుమిత్రులు. మూడూ నాగేశ్వరరావు సినిమాలే!

"ఇద్దరుమిత్రులు" సినిమా నాగేశ్వరరావు సినీ జీవితంలో ముఖ్యమైన మైలురాయి. హీరో ద్విపాత్రాభినయం చేసిన తొలి సాంఘిక తెలుగు సినిమా అదే!(రాజా- పేద సినిమాలో ద్విపాత్రాభినయం చేసినది బాల నటుడు, పైగా అది జానపదం) బీద నాగేశ్వరరావు, గొప్ప నాగేశ్వరరావు షేక్‌హాండ్ ఇచ్చుకునే దృశ్యం ఎంత పాప్యులర్ అయిందో చెప్పనలవి కాదు. రెండు పాత్రలు అనగానే ఒకరు మంచివారు, మరొకడు దుష్టుడు టైపు కథ కాదు ఇది. ఇద్దరూ హీరోలే. ఇద్దరికీ బంధుత్వం లేదు. ఇద్దరూ మిత్రులవుతారు. ఒకరి సమస్యలను మరొకరు ఎదుర్కొంటారు. సినిమా హైదరాబాదులో నిర్మితమైంది. సిల్వర్‌జూబ్లీ జరుపుకుంది.

ఈ చిత్ర కథను వెండితెర నవలగా తీసుకురావడానికి ముళ్ళపూడి వెంకటరమణ చాలా శ్రద్ధ తీసుకున్నారు. ఒక మామూలు నవలలో ఉపయోగించేటంత వర్ణన, భాషాచమత్కృతి కనబరిచారు. అంతేకాదు ప్రత్యేక ఆకర్షణగా పుస్తకం పేజీలలో షేక్‌హేండ్ దృశ్యాన్ని అనేక ఫ్రేముల్లో ముద్రింపించారు. పేజీలు వరుసగా, వేగంగా తిప్పితే ఇద్దరు నాగేశ్వరరావులూ షేక్‌హేండ్ ఇచ్చే దృశ్యం కదిలే బొమ్మల ద్వారా కళ్ళక్కడుతుంది. జనవరి 1962లో పుస్తకం తొలిప్రతి వేస్తే నెల్లాళ్ల తిరక్కుండా మలిప్రతి వేయవలసి వచ్చింది.

సినిమాతో పాటు వెండితెర నవలలు ప్రచురించే సంప్రదాయం మళ్ళీ నెలకొనాలని 'హాసం' అభిలాష. అవి ఎలా వ్రాయాలో ఈ తరంలోని రచయితలు నేర్చుకునేందుకు వీలుగా రమణ రాసిన 'ఇద్దరు మిత్రులు' వెండితెర నవలను ఈ సంచిక నుండి ధారావాహికంగా ప్రచురిస్తున్నాము. సినిమాను చూసిన వారినీ, చూడనివారినీ కూడా ఈ రచన అలరిస్తుందని మా గట్టి నమ్మకం.

అక్కినేని నాగేశ్వరరావు, బాపూరమణల మధ్య అనుబంధం గురించి వేరేగా చెప్పవలసిన అవసరం లేదు. వారి కాంబినేషన్లో వెలువడిన విజయవంతమైన చిత్రాలు ఎన్నో ఉన్నాయి. నాగేశ్వరరావు గారు 60 ఏళ్ళ నటజీవితం పూర్తిచేసుకున్న ఈ సందర్భంలో వారి జన్మదిన కానుకగా రమణ రాసిన ఈ వెండితెర నవలను పునర్ముద్రించటం జరుగుతోంది.

అన్నపూర్ణావారి

# ఇద్దరు మిత్రులు

### సీరియల్ - నవల 1



పైనున్న వాడు బహు కొంటెవాడు. పెద్దంత్రం, చిన్నంత్రం లేకుండా అందరినీ ఆడించి, ఆడుకుంటాడు. అరక్క వీడూ, దొరక్క వాడూ అవస్థపడగా, 'వీడి'కి వజ్రాలూ, 'వాడి'కి మరమరాలూ యిస్తాడు. ఉప్పుకి, కప్పురంలా గుబాళించాలన్న ఉబలాటం కలిగిస్తే, కప్పురానికి ఉప్పులా చవులూరాలన్న సరదా పుట్టించి తమాషా చూస్తాడు, జీవితం ఉప్పులా కరిగిపోయి, కప్పురంలా హరించిపోయేవరకు ఈ తీరని కోరికలతో కాలక్షేపం చేయించేస్తాడు. రామదాసు గారు (భద్రాచలం తాలూకా కాదు) అన్నట్టు,-అంథా 'వాడి'లీల.

అజయ్‌బాబు స్థితి ఇలాటిదే. అనుభవించడానికి, ఆపేక్ష తప్ప మిగతావన్నీ వున్నాయి. అతను జాగీర్దార్ల బిడ్డ. తండ్రి ఇటీవలనే చనిపోవడంతో లక్షల ఆస్తికి అధిపతి అయ్యాడు. ఆస్తితో పాటు, అనేక సమస్యలూ భాధ్యతలూ వరించాయి, ప్రమాదాలు ఆవరించాయి. వారసులు కావాలనుకునే బేవారసులు చుట్టుముట్టారు. ఎవరి ప్రేమలో ఎంత విషం కల్తీ అయిందో తెలీదు. దోచేవారెవరో బ్రోచేవారెవరో తెలీదు. అందరినీ నమ్మరాదు అన్న వాక్యంలో మొదటి మాటకి చాలా విశాలమైన అర్థం ఉందనీ, అందరినీ అంటే చాలామందిని అనేకాక'అ(ందరినీ' అని కూడా తాత్పర్యం ఉందని అజయ్‌బాబుకి అనుభవం మీద తెలిసింది. దానితో మనుష్యులంతా దూరం అయిపోయారు. అందరి మీదా అపనమ్మకం లాటిది కలిగింది. క్రమంగా తనమీదా అలాటి భావమే కలగవచ్చు. నా అన్న వాడి చేయూత తీసుకుని, మెట్లు మెట్లుగా జీవితంలోకి దిగి ఒడుపుగా నడవగల అవకాశం పోయి, తండ్రి మరణించడంతో సరాసరి అమెరికాలోంచి హైదరాబాద్‌లోని ఐశ్వర్యపు సుడిగుండంలోకి, జీవితంలోకి

ఒక్కసారిగా దూకవలసి వచ్చింది. అజయ్‌బాబు ఉక్కిరి బిక్కిరి అయిపోయాడు.

సమస్యలను, బాధలను ఎదుర్కోలేనివారు చాలమంది వాటిని జయించే పద్ధతి ఒకటే. అవి ఒడిసి పట్టుకునేవరకు పరుగెత్తి పారిపోవడం. ఆ పరుగెత్తే మార్గాలు రెండు. భ్రాంతి మొదటిది. ఇది కారుచౌక. గొప్పా బీదా అందరికి అందుబాటులో వుండేది. కానీ అట్టేసేపు మన్నదు.ఏ సమస్యో గుచ్చుకోగానే మెలకువ వస్తుంది. ఇది పోగానే మళ్ళీ వెంటనే మత్తుకావాలంటే, కొందరు బ్రాంది అనువైనదంటారు కాని భ్రాంతిలాగే ఇదీ కొద్దిసేపు నిలచేదే. అజయ్ బాబుకి, మొదటిది చేతగాక, రెండోదాంట్లో పడిపోయాడు. ఇంటికి తనే పెద్దకాబట్టి అడిగేవారులేరు. డబ్బున్నవాడు గాబట్టి తప్పులు చూపేవారు. ఒక్క అత్తయ్యుంది తన స్థితి 'చూసి'బాధపడేందుకు, కాని ఆవిడకి చూపు పోయింది. లంకంత భవంతిలో ఆవిడ ఒక్కర్తే నా అన్న మనిషి. మరొక్క జీవి ఉన్నాడట-నౌకరు వెంకన్న. వాడు మూగవాడు. ఈ నాగరిక జనారణ్యంలో వాళ్ళే తన రక్షకులు. మిగతావాళ్ళు - మానేజరు భానోజీరావుగారితో సహా అంతా భక్షకులట. అజయ్‌బాబుకి ఈ భయంకర స్థితి దుర్భరంగా వుంది. భయంకొద్దీ కాదు; అసహ్యంవేసి. అందుకనే అతను ఇంటినుంచి క్లబ్బుకో, హోటలుకో పారిపోతాడు; చింతలలోంచి, మద్యపానం ప్రసాదించే నిశ్చింతలలోకి పారిపోతాడు. అది అలవాటయిపోయింది.అది బాగో ఓగో తేలీదు. తేల్చుకునే ఆసక్తి లేదు. ఆ శక్తీ వున్నట్టు లేదు.



క్లబ్బులో కొంత 'నిశ్చింత' సేవించి, రిట్జ్ హోటలుకు వచ్చాడు అజయ్- అక్కడిం కాస్త సేవిస్తే, స్వప్నసీమ దాటి, సుషుప్తికి వెళ్ళి, ఆనందంలోకి తూలి పడి పోతాడు. మర్నాడు ఉదయం తన ఇంట్లో మంచం దిగేవరకూ ఇంటి'కెళ్ళిన వైనం కూడ తెలీదు.....హాలు దాటి, రెండో హాలులోకి ప్రవేశించాడు. ఇక్కడ మామూలుగా కుడివేపు తిరగాలి 'సేవా' మందిరానికి....ఇవాళ అది ఎడం వేపున వున్నట్టుంది ఏమో! తనకు కుడిఎడమలు తెలీవని అత్తయ్య అంటుంది. లేకపోతే తన కుడిచెయ్యి ఎడంవేపుకీ, ఎడంది కుడివేపుకీ మారాయేమో ? కుడి ఎడమైతే పొరబాటు లేదన్నాడు ఎవడో. మార్పులు మామూలే. జరుగుతూనే వుంటాయి. జరగాలి.....అజయ్ ఎడంవేపుకే తిరిగి ముందుకు సాగాడు.....అదిగో ! ఎవరో వస్తున్నారు.... నిజంగానే దారి వుందన్నమాట. ఎవడో తనెక్కడో చూసినట్టే ఉందే! ఎవడు చూడొచ్చాడు మనుషుల్ని బోలిన మనుష్యులుంటారు. వాడు తనని గమనించాడు కాబోలు. గతుక్కుమన్నాడు. అజయ్ నవ్వుకుని ముందుకుసాగాడు....



అంతవరకు అతన్ని వంచిస్తున్న ఆ అద్దంలో భ్రాంతి, 'ఢీ' ఇచ్చి తాను పగిలి, అతన్ని పగలగొట్టబోయినంత పని చేసింది. ఎవరో వచ్చి ఇటు కాదు అని అజయ్ భుజాలు పట్టుకుని సరైన దారికి మళ్ళించారు. దారి చూపారు.

'యాష్, ఐ నో. ఐ నో' అన్నాడు అజయ్.

వెధవ భ్రాంతి. ఎంత దగా చేసింది. భ్రాంతిని నమ్మరాదు.... బ్రాందిని నమ్మవలెను, ఇదీ దగా చేస్తుందిగాని, కొంచెం టైమిస్తుందేమో...చెప్పిచేస్తుంది.

ఎవరో మిత్రుడు చేయి పట్టుకుని కుర్చీలో కూర్చోపెట్టాడు. గది అంతా సిగరెట్ల పొగతో, అజయ్‌బాబు మనసులా, చూపులా మసక మసగ్గావుంది.

గ్లాసులు ఇంట్లో షాండిలియర్‌లా, జాపనీస్ సంగీతంలా, డాన్సింగ్ గర్ల్ చేతి గాజుల్లా, కాలి గజ్జెల్లా, జేబులో చిల్లర డబ్బుల్లా లింగ్‌లింగ్‌మంటున్నాయి. గలగలమంటున్నాయి. ఎంత హాయి!...ఇంక ఫోయ్...



'టు ది హెల్త్ ఆఫ్ మిష్టర్ అజయ్‌బాబూ' అన్నాడు ఒక మిత్రుడు ఉత్సాహంగా.

'వాడి హెల్తుకేరా. అజయ్ బాబు కోటీశ్వరుడైతేనూ' అన్నాడు సాటి జ్ఞాని.

'ఇంకా ఎక్కువురా స్ట్యూపిడ్...లక్షాధికారి తెలుసా. కోటీశ్వరుడు కంటే ఎక్కువ' అన్నాడు స్థాయి నందుకుంటున్న మహాజ్ఞాని.

'కాదురా - జమీందారు బిడ్డ. ఇంటినుండా డబ్బు మూలుగుతుందిరా' అని మిత్రుడి తప్పు సవరించాడు మొదటివాడు.

అజయ్ నవ్వాడు. డబ్బు పేరెత్తగానే నవ్వొచ్చింది. తెలివొచ్చింది. అదో పెద్ద జోకు. అదో పెద్దభ్రాంతి.



'డబ్బు! ఏదీ.. లేదు... గోదావరి మీద ప్రయాణం. తాగటానికి నీళ్ళు లేవు' అన్నాడు చేదు చప్పరించి.

'వహ్వా, చూడం డోయ్ బ్రదర్!... డబ్బంటే లక్ష్మి బ్రదర్... లక్ష్మి. బంగారు గజ్జెల గలగల....'

'జంగ్...జంగ్' అంటూ ఆ వాక్యాన్ని తేలిక తెలుగులోకి అనువదించాడు ఒక భాషారథి.



'నీ కార్లు, బంగళాలు, మేడలు,'

'నీఫ్యాక్టరీలు... లక్షలపై లాభాలూ'

'ష్ ! లాభాలూ!? ఎక్కడ?అంతా నష్టమే. కట్టాలి.. లక్షాయాభై వేలు' అన్నాడు అజయ్.

'వాట్, వాట్, వాట్' అన్నాడో వాట్‌మన్ కంగారుగా.

'ఇన్‌కంటాక్స్.... ఎటుచూసిన బాకీలు. గజ్జెల గల గలలు లేవు బ్రదర్...అంథా స్పైలెంట్' అన్నాడు అజయ్, సిగరెట్టు పొగా, చిరాకూ, విచారం కలిపి నిట్టూరుస్తూ.

'లేకేం? గజ్జెల గల గలలే కదూ? ఉంది' అన్నాడు ఒక దాట్ల తాతారావు.

'ఎక్కడ?'అన్నాడు అజయ్ ఉత్సాహంగా.

'చూపిస్తాను పద. ఖమాన్ దిలారాం డాన్సుకు పోదాం' అంటూ లేచాడు ఒక మిత్రుడు.

'దిలారాం అంటే?' అన్నాడు అజయ్ - మత్తుతో వాలిన రెప్పలెత్తి, పత్తికాయల్లా తెల్లగా, విశాలంగా ఉన్న కళ్ళను ఇంకా ఇప్పార్చి.

ఆడపిల్లలకేకాక, మొగాళ్ళకుకూడా మరోసారి చూడాలనిపించేటంతటి చక్కటి కళ్లు అవి. చదువు, సంస్కారం, ధైర్యం, తెంపరితనం కనిపింపచేసే చురుకైనచూపులు, వర్చస్సుగలముఖం, నిండుగా,నీటుగా, గోటుగా వుండే విగ్రహం. సహజంగా కనబడే దర్జా.

అజయ్‌బాబు విగ్రహస్ఫూర్తిని గమనించి, ఆనందించి, మెచ్చుకునే సమయం సందర్భం కావు అవి. ప్రేక్షక మిత్రులు ఆ ధోరణిలో లేరు. మరో కారణంవల్ల 'ముగ్ధుడు' అయిపోయిన మిత్రుడు వేరే దృష్టిలో వున్నాడు.

'బ్రదరూ - దిలారాం అంటే? ఏఁవిటంటే, దిల్ ఆరాం....హృదయానికి - విశ్రాంతి. దిలారాం డాన్సు చేస్తుంటే గజ్జెల గల గల..' అన్నాడు మత్తుగా అజయ్ బుజంతట్టి.

'జంగ్...జంగ్' అన్నాడో హుషారుద్దీన్ జంగ్ ఉత్సాహంగా.

ష్..పదండి' అంటూ ముందుకు నడిచాడు అజయ్. మత్తుగా మెత్తగా...

హాలు దాటి, సింహద్వారం వైపు పోబోతూ, రిసెప్షన్ డెస్క్ దగ్గర హటాత్తుగా ఆగాడు అజయ్.

'అన్నట్టు బంగళాకు ఫోన్ చేయ్యాలి. కొంచెం ఆగండి జెంటిల్‌మెన్!, అన్నాడు ఫోన్ మీదకి తూలి.

'జంగ్ జంగ్' అంటున్నాడు వెనకాల జంగు. ఠంగ్ ఠంగ్ అంది గడియారం.

బంగళాలోని ఆఫీసు గదిలో గడియారం కూడా ఆ మాటే అంది.

'అబ్బా! పదయింది' అన్నాడు యజమాని రాకకోసం భయభక్తులతో ఎదురుచూస్తూ, హుందాగా పచారు చేస్తున్న దివాన్‌జీ, భానోజీ గారు.

'అయింది మరీ' అన్నాడు ఆయన నీడలా వెనకే నడుస్తున్న 'భవదీయుడు' శేషావతారం.

'అజయ్ బాబు గారు రాలేదే' అన్నాడు భానోజీ జనాంతికంగా.

'రాలేదు మరీ' అన్నాడు వంతదారుడు రివాజు ప్రకారం.

భానోజీగారు ఇంకేదో అనబోయి, అవతారం వెంటనే ప్రతిధ్వనిస్తాడని భయపడి, అతనికేసి చిరాగ్గా చూసి పచారు కొనసాగించారు.

టెలిఫోన్ మోగింది. భవదీయుడే అందుకున్నాడు. 'హలో...నేను హెడ్డు గుమాస్తా, కిళాంబి శేషావతారం' అన్నాడు, ఉన్న కాస్త ఛాతీ వీలైనంతగా దర్జాగా విరిచి.



'హల్లో! నాకు అజయ్ కావాలి' అంది ఫోన్‌లో కంఠం తిక్కగా. 'నువ్వేరా అజయ్' అంటోంది మరో కంఠం. 'ఎస్.ఎస్. ఐ నో...హలో' అన్నాడు అజయ్.

శేషావతారం వినయావతారం ఎత్తి, చెవులు రిక్కించి, భక్తి శ్రద్ధలకు అభినయం పట్టాడు.

'చిత్తం. చెప్పండి మరీ'

'వినరా రాస్కెల్, విను'

శేషావతారం అదిరిపడి, కుదురుపడి గుటక మింగి,' వింటున్నా మరి. ఏమిటి సెలవు?' అన్నాడు.

'వినరా రాస్కెల్ విను' అన్నాడు అజయ్ - శ్రోత, వన్స్‌మోర్ అడక్కపోయినా.



'ఓహో, అయితే ఉండండి' అంటూ, భానోజీ గారికేసి చూసి ' అయ్యా! తమర్నే పిలుస్తున్నట్టుంది. ఇదండి' అన్నాడు హెడ్ గుమాస్తా ఫోన్ అందిస్తూ.

'హల్లో, నేను భానోజీ రావుని అజయ్ బాబు మేనేజర్ని. ఏం కావాలి మీకు?' అన్నాడాయన హుందాగా, కొంచెం చిరాగ్గా.

'వినరా రాస్కెల్ , విను'

భానోజీ రావు గారికి భోజనం ముందు చిరుతిళ్ళు అలవాటు లేకపోయినా, ఓ గుటక



మింగారు గుడ్లు మిటకరించి, గుమాస్తా కేసి చూసి ' బాగుంది, బాగుంది... ఆ పెద్ద మనిషి అంత స్పష్టంగా నిన్ను పిలుస్తుంటే, నన్నంటా వేమిటయ్యా, ఇవాళ నల్లమందు డోసు ఎక్కువైందా? సరిగ్గా విను నిన్నే' అంటూ రిసీవరు శేషావతారం చేతిలో పెట్టేశారు దర్జాకి భంగం రానీకుండా.

శేషావతారం చెవులు రిక్కించి వినేవి, వినాలని ఉబలాట పడేవి ఎన్నో వున్నాయి గాని, వాటిలో ఇలాటి ఇష్టాగోష్ఠి ముఖ్యమైంది కాదు. అందుకని అతనూ గుటకమింగి, కళ్ళు చికిలించి తటపటాయించాడు. రిసీవర్ హాలో అంటోంది. కొంచెం పైకెత్తాడు.

'చాలు అజయ్ బాబు. అంతా చెప్పేశావుగా. వాళ్ళు వినేశారు. అయిపోయింది. పద పోదాం డాన్సుకి' అంటున్నారెవరో.

ఆ మాట విన్న మిత్రుడు అజయ్ భుజం మీద చెయ్యి వేసి బలవంతాన వెనక్కి మళ్ళించాడు.

'అవునవును. డాన్సుకి కదూ! దిలారాం. దిల్ ఆరాం' అంటూ రిసీవరు పడేసి, వీధివేపు తూలాడు అజయ్ బాబు.

xxxxxxxxx

దిలారాం, చలాకి అయిన పిల్ల. పంచ కళ్యాణిలా వుంది.



నవ్వాలీ నవ్వాలీ అంది నరాగంగా. నవ్వులు నాకే ఇవ్వాలీ అంది. అజయ్ రెప్పలెత్తి ఆమెవంక చూశాడు- నువ్వా ఇవ్వాలనేనా పాట? అన్నట్టు ' నీకున్న చింతా వంతా ఈనాడే తీరాలి' అందాపిల్ల. అజయ్ నవ్వుకున్నాడు నీ మొహం అన్నట్టు.

కాని, పాట హాయిగా ఉంది. రేయిహాయిగా ఉంది - మధువు తీయగా ఉంది. మనసు హాయిగా ఉంది.



నవ్వాలి నవ్వాలి నీ
నవ్వులు నాకే యివ్వాలి
అందాల చిన్నవాడ బంగారు వన్నెకాడ
నీకున్న చింతా వంతా ఈ నాడే తీరాలి
కలిమి బలిమీ కలవాడవోయి
కలతలలో
మునిగిపోనేలనోయి
మనసూ దోచుకుని ఏ
చిన్నదో దాచినదా?
నిన్ను కవ్వించీ నిన్ను
నమ్మించీ
దగాచేసి పోయినదా?
వేదాంత విచారాలకూ
వేరే సమయముందిలే
వెన్నెల రోజులనూ
ఇలా వృధా
చేయకుమా
వలపుల రోజాలు వాడిపోనీయకుమా
మీ కోసమేనోయీ మా విలాసము
మీ అందరిదేనోయి ఈ వినోదము
పున్నమ చందురుడు చిందించే అందాలు
కలువల కన్నీటికీ కలిగించు సరదాలు...



రిట్జిలో సేవించిన మధువుకి, ఈ స్వరరాగసుధ తోడై వెగటై మరింత 'నిశ్చింతగా' ఇవతలకి వచ్చాడు అజయ్. మిత్రులనుసరించినట్టు లేదు. తను మాత్రం కారులో వున్నాడు. కారు తారు దారి మీద ప్రవహిస్తోంది. రాత్రి నిద్రపోతోంది. పగలంతా జనం తొక్కిడితో నలిగి, అలసిపోయిన వీధులు, దీపాల కాంతిని చిత్తుగా తాగి, మత్తుగా, హాయిగా విశ్రాంతి తీసుకుంటున్నట్లు పరుచుకుని ఉన్నాయి. కారు నడుపుతున్న అజయ్ మనసు ప్రశాంతంగా ఉంది. ప్రశాంతతను దాటిపోయింది. నిర్వికారంగా వుంది. చింతలేదు, చింతలేదన్న ఆనందం లేదు. సంతోషం లేదు, సంతోషం లేదన్న చింతలేదు...

నిరామయంగా వుంది. యాంత్రికంగా కాళ్ళూ చేతులూ కారు నడుపుతున్నాయి. చాలా జోరుగా నడుపుతున్నాయి. అతని కళ్ళు ఏ స్థితిలో ఉన్నాయో అన్నట్టు, కారే తన దీపాల కళ్ళు పెద్దవి చేసుకుని దారి చూసుకుని పరుగెడుతోంది.



దూరంగా కల్వర్ట్‌దగ్గిర, హఠాత్తుగా ఓ మనిషి నడిరోడ్డు మీదకు వచ్చాడు. ఫర్లాంగు దూరం కూడా లేదు అతనికీ, కారుకీ. అజయ్ దృష్టి ఆ వ్యక్తి మీద పడింది. యాంత్రికంగానే చేతులు స్టీరింగును పక్కకి తిప్పాయి- అతన్ని తప్పించుకుని పోవడానికి. అతను తిరిగి కారుదారివేపే నడిచాడు.



అది చూడగానే అజయ్‌కి మెలకువ వచ్చింది. నిటారుగా కూర్చుని, స్టీరింగు శ్రద్ధగా పట్టుకుని మళ్ళీ తప్పించ చూచాడు. రోడ్డుమీది మానవుడు కారు ఎటువెళ్తే అటే జరిగి ఎదురొస్తున్నాడు. దూరం తరిగిపోతోంది. ఎదటివాడు తప్పించు కుందికి చూస్తున్నాడా? దీనికింద పడాలని చూస్తున్నాడా?... ఇక వ్యవధి లేదు, ఇక చోటూ లేదు. అజయ్ స్టీరింగును గట్టిగా ఒక వేపుకు తిప్పి, గేరు మార్చి, బ్రేకు నొక్కాడు. అప్పటికే కాలాతీతం అయిపోయి నట్టుంది. కారు మడ్‌గార్డు ఆ వ్యక్తిని కొట్టింది; తిన్నగా వెళ్ళి తూముకు గుద్దుకుని పెద్ద చప్పుడుచేసి ఆగింది. అతను కిందపడ్డాడు.







అజయ్‌బాబుకు మత్తు దిగిపోయింది. కారు దిగాడు. పడిలేస్తున్న వ్యక్తి దగ్గరకు వచ్చాడు. పెద్ద దెబ్బ తగలలేదు కాబోలు. తనంతటతానే లేస్తున్నాడు. కుయ్‌కయ్ మనకుండా.



'ఏమిటిది చావాల నుందా?' అన్నాడు అజయ్ చిరాగ్గా.

అవతలి మనిషి లేచిపోబోతూ ఆగాడు 'చావాలనే అనుకున్నాను. కాని ఆ అదృష్టం కూడా లేకపోయింది' అన్నాడు నెమ్మదిగా.

ఒక క్షణం ఆగి, వెనక్కు తిరిగి 'క్షమించండి వస్తాను' అంటూ పోబోయాడు.



ఆ క్షణంలో సగంలో, మత్తులో మసక వెలుతురులో ఆ వ్యక్తిని చూసిన అజయ్ అదిరిపడ్డాడు.

ఇంకావుంది...

ఎన్నో గీతాలకు తన అభినయంతో ప్రాణప్రతిష్ట చేసిన **అక్కినేని నాగేశ్వరరావు**
పుట్టినరోజు (సెప్టెంబరు 20)ని పురస్కరించుకుని అభిమానుల కోసం...



హాసం

RNI Regd. No.APTEL/2001/5503 HAASAM HAASYA SANGEETHA PATHRIKA Postal Regn. No. H-HD-997.

# Blueprinting the future from the past



The world around us is full of unseen biological wonders, many of them endowed by nature with miraculous cures for the ills of man.

But it takes a particularly discerning eye to see these hidden cures.

At Shantha, we take quiet pride in the fact that our scientists possess this type of penetrative vision. One example of their path-breaking research is Shanvac-B, India's first indigenous family vaccine against Hepatitis-B. Another is betacarotene, an antioxidant manufactured from algae found in the high seas. A third is Shanferon, an indigenous anti-cancer drug...

Working 24 hours a day, 365 days a year, Shantha's scientists are ceaselessly pushing back the frontiers of the unknown. To bequeath mankind with a healthier future - through the miracles of Biotechnology.

**SHANTHA BIOTECHNICS PVT. LTD.**

3rd Floor, Serene Chambers, Road No 7, Banjara Hills, Hyderabad, India.
Tel : +91-40-3548507, 3608843 Fax : +91-40-3548476 E-mail : info@shanthabiotech.com
www.shanthabiotech.com